శ్రీరామ

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీమద్గోవింద భగవత్పాదశిష్య

శ్రీమచ్ఛంకర భగవత్పాద

విరచితమగు

శ్రీ

# వివేకచూడామణి

ఇది

సంస్కృతము

కడపపురనివాసియగు

కోవూరు పట్టాభిరామయ్యచే

రచియింపబడిన

తెనుగు పద్యములతోడం జేర్చి

కడపపుర వాస్తవ్యులగు

మ॥ రా॥ రా॥

పెండాల సుబ్రహ్మణ్యశెట్టిగారు

తంజావూరు గంగయ్యగారు.

అనువారి సాహాయ్యమున

నెల్లూరు

ఎంపరర్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడినవి.

1906సం ఫిబ్రవరి నెల తే 1ది



వెని వె. మాత్రము 0-8-0

శ్రీరామ

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

శ్రీమద్గోవింద భగవత్పాదశిష్య

శ్రీమచ్ఛంకర భగవత్పాద

విరచితమగు

శ్రీ

# వివేకచూడామణి



ఇది

ప్రకృతము

కడపపురనివాసియగు

కోప్పూరు పట్టాభిరామయ్యచే

రచియింపబడిన

తెనుగు పద్యములతోడంజేర్చి

కడపపుర వాస్తవ్యులగు

మ॥ రా॥ రా॥

పెండాల సుబ్బయ్యశెట్టిగారు

తంజావూరు గంగయ్యగారు.

అనువారి సాహాయ్యమున

నెల్లూరు

ఎంపరర్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపంబడియె.

1906 సం॥ ఫిబ్రవరినెల తే 1 ది



దీని వెలమాత్రము 0-8-0

శ్రీ రామ

# పీఠిక.




శ్రీమదాత్మానాత్మవివేక చూడామణియను నీ గ్రంథరత్నము శ్వరమహంస పరివ్రాజకాచార్యవర్యులగు శ్రీమచ్ఛంకర భ గాచార్యుల స్వాములవారిచే రచియింపబడినది. ఇది సకలవేదార్థసారమై యాచార్యులవారి స్వానుభవరూపమై మహారహస్యార్థ ప్రతిపాదకమై సంగ్రహరూపమయియున్నది.

ఇంతటియర్థములు యోగులకును మునులకును అనుభవైకవేద్యములై అందఱికిని తెలియకపోవుటను గ్రంథముచిన్నదియగుటను ఇది పండితులకేని పామరులకేని నాదరణీయముగాక యెఱుగబడని మహాపురుషునింబోలి యీకలికాలమున మూలబడియుండెనిట్టిదీనిన్నేఁజదివి దీనియందలి మహారహస్యములు జనులకెల్ల నెఱుకపడమికి వగచి దీనిని సులభశైలిని తెనిఁగించిన నందరకు నుపయోగించుం గదాయని కౌతుకంబొదవి పదియేండ్లనాఁడె దీనిం దెనిఁగింప నారంభించితింగాని నాకప్పటికిగల యనుభవమందులకు చాలనిదగుట నాపని జరుగదయ్యె. నేనుం జింతబడయుండితి నంతట నాపూర్వకృతపుణ్యవశమున:—

శ్లో॥ శ్రీకృష్ణదేవం తచ్ఛిష్యముద్ధవం భగవత్పరం।
గోవిందస్వామినం వందే నారాయణమునీశ్వరం।
తచ్ఛిష్యం వేంకటేశార్యం శేషాచలమకల్మషం।
గురుసింహం మహాప్రాజ్ఞమన్యానస్మద్గురూన్భజే॥

అను నీవరుసను శ్రీభగవద్గీతోపనిషదుపదేష్టయగు శ్రీకృష్ణదేవునిచే

నుపదేశింపబడిన సర్వోపనిషద్రహస్యార్థమును సాంప్రదాయముగా నెఱింగిన శ్రీగురు సింహదాసు గారి యనుగ్రహమునకు నేనుపాత్రుడనై వారికృపయను దివ్వె నాకీ గ్రంథమునందలి రహస్యములం దేటగాఁ గాన్పింపఁజేసినకతన నేను దీని దెనిగించు నుద్యమము రెండుమాసముల క్రిందట గొనసాగించుకొని ధన్యుడనైతి. ఈగ్రంథార్థమునందఱు నెఱింగి ధన్యులుగావలయుననుటయే నాసంకల్పము. ఈసంకల్పమీడేర్ప బరమేశ్వరుండు గరుణించుగాత.

మఱియు.

ఉ॥ శంకరహృత్సరోవరబిస ప్రసవంబులగూర్చు హారమై।
శంకరవాక్సుధారసము సాఁపడగాననువైనపాత్రమై।
శంకరనిర్మలానుభవ సాగరకన్యవసించుపీఠమై।
శంకరుమెప్పునొందుత నిజంబుగ నాకృతి నిర్మలాకృతిన్॥

కడప
3-2-06

కోపూరు పట్టాభిరామయ్య.

నోటీసు.

ఈ గ్రంథము వలయువారు నెల్లూరు వద్దయుండు కోవూరులో మ॥ రా॥ శ్రీ॥ కోవూరు ఆదిశేషయ్యాపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును. దీనివెల టపాలఖర్చు గాక- అణాలు 0-8-0

శ్రీ

# వివేకచూడామణి.

## విషయసూచిక.

| విషయ సంఖ్య | సంస్కృతము. | తెనుగు. | శ్లోక సంఖ్య |
|---|---|---|---|
| ౧౧ | వైరాగ్యలక్షణమ్ | వైరాగ్యలక్షణము | ౨౧ |
| ౧౨ | శమదమోపరతీనాం లక్షణమ్ | శమము-దమము-ఉపరతి- వీనిలక్షణము | ౨౨ |
| ౧౩ | తితిక్షాలక్షణమ్ | తితిక్ష లక్షణము | ౨౫ |
| ౧౪ | శ్రద్ధాలక్షణమ్ | శ్రద్ధలక్షణము | ౨౬ |
| ౧౫ | సమాధానలక్షణమ్ | సమాధానలక్షణము | ౨౭ |
| ౧౬ | ముముక్షుతాలక్షణమ్ | మోక్షేచ్ఛలక్షణము | ౨౯ |
| ౧౭ | తీవ్రవైరాగ్యము ముక్షుత్వవత్సు శమాదీనాం ఫలవత్త్వమ్ | వైరాగ్యమోక్షేచ్ఛలు తీవ్రములుగానున్నచో శమాదులు సఫలములగుననుట | ౩౦ |
| ౧౮ | వైరాగ్యముముక్షుత్వయోర్మందతాయాంశమాదీనామాభాసః | వైరాగ్యమోక్షేచ్ఛలు మందములైనచో శమాదులుండవనుట | ౩౧ |
| ౧౯ | మోక్షేభక్తేరుత్తమసాధనత్వంతస్యాః రూపణంచ | ముక్తికిభక్తియుత్తమసాధనమనుటయుదానిలక్ష్మ | ౩౨ |
| ౨౦ | గురూపసత్తిర్గురు లక్షణంచ | గురుసన్నిధి జేరుటయు గురులక్షణమును (మును | ౩౩ |
| ౨౧ | గురోః సన్నిధౌ ప్రవణతా పూర్వకః ప్రశ్నః | గురుసన్నిధిని సవినయముగ ప్రశ్నసేయుట | ౩౬ |
| ౨౨ | శిష్యంప్రతి అభయదానపూర్వకముత్తరమ్ | శిష్యునకభయమిచ్చి గురువుప్రత్యుత్తరమిచ్చుట | ౪౩ |
| ౨౩ | శిష్యకర్తృకః పునః ప్రశ్నః | మఱలశిష్యుడు సేయు ప్రశ్న | ౫౦ |
| ౨౪ | శిష్యం ప్రతిధన్యవాదః | శిష్యుని ధన్యుడవనుట | ౫౨ |

| విషయ సంఖ్య | సంస్కృతము. | తెలుగు. | శ్లోక సంఖ్య |
|---|---|---|---|
| ౪౨ | స్థూలదేహనిందా | స్థూలదేహనింద | ౮౯ |
| ౪౩ | స్థూలదేహస్య పూర్వకర్మజన్యత్వమ్ | స్థూలదేహము పూర్వకర్మమువలన బుట్టుననుట | ౯౦ |
| ౪౪ | జాగరే స్థూలదేహప్రశస్తిః | జాగ్రదవస్థయందు స్థూలదేహము ప్రశస్తమనుట | ౯౧ |
| ౪౫ | జీవదేహయోర్భేదః | జీవునకును దేహమునకును గల భేదము | ౯౨ |
| ౪౬ | జన్మాదయో ధర్మాః స్థూలదేహస్య | పుట్టువు మొదలగునవి స్థూలదేహధర్మములనుట | ౯౩ |
| ౪౭ | జ్ఞానేంద్రియాణాం కర్మేంద్రియాణాంచ పరిగణనమ్ | జ్ఞానేంద్రియములయొక్కయు కర్మేంద్రియములయొక్కయు విమర్శ | ౯౪ |
| ౪౮ | అంతఃకరణస్య చాతుర్విధ్యం చతుర్ణామపి లక్షణానిచ | అంతఃకరణము నాలుగువిధములనియు- ఆనాల్గింటి లక్షణములును | ౯౫ |
| ౪౯ | ప్రాణస్య పంచవిధత్వమ్ | ప్రాణ మైదువిధములనుట | ౯౬ |
| ౫౦ | లింగదేహస్వరూపమ్- తస్య స్వప్నే ప్రతీతిస్తత్కార్యంచ | లింగదేహస్వరూపమును-దానికి స్వప్నావస్థయందు ప్రశస్తియనియు- దానిపనియును | ౯౭ |
| ౫౧ | అంధత్వాదయో ధర్మాశ్చక్షురాదీనాం- నాత్మనః | గ్రుడ్డితనము మొదలగుధర్మములు కన్ను మొదలగు వానివే కాని యాత్మవి కావనుట | ౧౦౨ |
| ౫౨ | ఉచ్ఛ్వాసాదయః క్షుధాదయో ధర్మాశ్చ ప్రాణస్య | ఊపిరి త్రిప్పుకొనుట మొదలగునవియు ఆకలిమొదలగునవియు ప్రాణముధర్మములనుట | ౧౦౩ |

| విషయ సంఖ్య | సంస్కృతము. | తెనుగు. | శ్లోక సంఖ్య |
|---|---|---|---|
| ౨౦ | విక్షేపావరణశక్తిభ్యాంబంధః | విక్షేపావరణశక్తులవలనబంధముగలుగుననుట | ౧౪౬ |
| ౨౧ | సంసారవృక్షస్యబీజాదికథనమ్ | సంసారమనుచెట్టునకువిత్తనముమొదలగువాని జెప్పుట | ౧౪౭ |
| ౨౨ | జన్మాదిప్రవాహజనకోఽనాత్మబంధః | అనాత్మబంధముజన్మాదిప్రవాహమునుపుట్టించుననుట | ౧౪౮ |
| ౨౩ | సంబంధఃశస్త్రాదిభిరచ్ఛేద్యః | ఆబంధముశస్త్రాదులచేతెగనిదియనుట | ౧౪౯ |
| ౨౪ | స్వధర్మనిష్ఠాపూర్వకపరమాత్మవేదనేన సంసారనాశః | తనధర్మమునుచేయుచుపరమాత్మనెఱింగినచో సంసారమునశించుననుట | ౧౫౦ |
| ౨౫ | పంచకోశైరావృతఆత్మానభాతి | కోశములైదింటిచేకప్పబడియాత్మప్రకాశింపదనుట | ౧౫౧ |
| ౨౬ | తేషామపవాదేనశుద్ధఆత్మాభాతి | వాటినికడద్రోచినచోస్వచ్ఛముగాఆత్మప్రకాశించుననుట | ౧౫౨ |
| ౨౭ | అన్నమయకోశవిచారః | అన్నమయకోశవిచారము | ౧౫౬ |
| ౨౮ | ప్రాణమయకోశవిచారః | ప్రాణమయకోశవిచారము | ౧౬౭ |
| ౨౯ | మనోమయకోశవిచారః | మనోమయకోశవిచారము | ౧౬౯ |
| ౩౦ | విజ్ఞానమయకోశవిచారః | విజ్ఞానమయకోశవిచారము | ౧౮౬ |
| ౩౧ | ఆనందమయకోశవిచారః | ఆనందమయకోశవిచారము | ౨౦౪ |
| ౩౨ | విజ్ఞేయవిషయకప్రశ్నః | తెలియదగినదికేమియులేదేయనిప్రశ్న | ౨౧౩ |
| ౩౩ | విజ్ఞేయస్వరూపకథనమ్ | తెలియదగినదానిస్వరూపమునుతెలుపుట | ౨౧౪ |
| ౩౪ | జగన్మిథ్యాత్వమ్ | జగత్తుకల్లయనుట | ౨౧౯ |

| విషయ సంఖ్య | సంస్కృతము. | తెలుగు. | శ్లోక సంఖ్య |
| --- | --- | --- | --- |
| ౯౮ | వైరాగ్యబోధయో రావశ్యకతా | వైరాగ్యబోధలుముఖ్యములనుట (ననుట | ౩౭౪ |
| ౯౯ | వైరాగ్యవతో నిత్యసుఖానుభూతిః | వైరాగ్యముగలవాడు నిత్యసుఖమనుభవించు | ౩౭౫ |
| ౧౦౦ | వైరాగ్యస్య శ్రేష్ఠత్వమ్ | వైరాగ్యము శ్రేష్ఠమనుట | ౩౭౬ |
| ౧౦౧ | ఆశాదీనాం త్యాగోపదేశః | ఆశను న్నగునవి విడువవలయుననుట | ౩౭౭ |
| ౧౦౨ | దేహాత్మత్యాగపూర్వక బ్రహ్మాత్మోపదేశః | దేహము తానను టను విడుపించుటచే బ్రహ్మమే తానని యుపదేశించుట | ౩౭౮ |
| ౧౦౩ | భేదనిరాసః | భేదమును పోగొట్టుట | ౪౦౫ |
| ౧౦౪ | ద్వైతం మాయాజన్యం. అద్వైతం సత్యమితి కథనమ్ | ద్వైతము మాయవలన పుట్టినదనియు. అద్వైతము సత్యమనియు చెప్పుట | ౪౦౬ |
| ౧౦౫ | ఆరోప్యస్యాధిష్ఠానాభిన్నత్వమ్ | తోచునదియందు దానికన్నను వేఱుగాదనుట | ౪౦౬ |
| ౧౦౬ | హృదయే పూర్ణబ్రహ్మకలనోపదేశః - | హృదయమందు నిండు బ్రహ్మము నెఱుంగు నుపదేశ | ౪౦౮ |
| ౧౦౭ | త్యక్తదేహస్య పునరసంధానమేవ | దేహమును విడిచినవాడు తిరిగి దానినంటడనుట | ౪౧౩ |
| ౧౦౮ | జీవన్ముక్తస్య ఫలకథనమ్ | జీవన్ముక్తునకగు ఫలమును దెలుపుట | ౪౧౭ |
| ౧౦౯ | వైరాగ్యాదీనాం ఫలాని | వైరాగ్యాదుల ఫలములు | ౪౧౯ |
| ౧౧౦ | బోధవైరాగ్యయోః పరమావధిః | బోధయొక్కయు వైరాగ్యము యొక్కయు కడపల | ౪౨౪ |
| ౧౧౧ | జీవన్ముక్తలక్షణాని | జీవన్ముక్తలక్షణములు | ౪౨౫ |

| విషయ సంఖ్య | సంస్కృతము. | తెనుగు. | శ్లోక సంఖ్య |
|---|---|---|---|
| ౧౧౨ | జీవన్ముక్తస్య ప్రారబ్ధకర్మవిచారః | జీవన్ముక్తుని ప్రారబ్ధకర్మవిచారము | ౪౪౫ |
| ౧౧౩ | అద్వైతోపదేశః | అద్వైతోపదేశము | ౪౬౪ |
| ౧౧౪ | బంధాదయః స్వయమేవ వేద్యాః | బంధము మొదలగునవి యవిగలవారే తెలుసుకొనదగిన వనుట | ౪౭౫ |
| ౧౧౫ | బ్రహ్మోపదేశోపసంహారః | బ్రహ్మోపదేశము ముగింపు | ౪౭౮ |
| ౧౧౬ | బ్రహ్మజ్ఞానానంతరం శిష్యకర్తృకం స్వావస్థావర్ణనమ్ | బ్రహ్మము నెఱింగినపిమ్మట శిష్యుడు తనస్థితిని వర్ణించుట | ౪౮౧ |
| ౧౧౭ | శిష్యకర్తృకో గురుం ప్రతి నమస్కారః | శిష్యుడు గురువునకొనర్చు నమస్కారము | ౪౮౬ |
| ౧౧౮ | గురుకృతః పునః శిష్యం ప్రత్యుపదేశః | శిష్యునకు గురువు మఱలచేయు నుపదేశము | ౫౦౧ |
| ౧౧౯ | కృతార్థతయా శిష్యస్య గమనమ్ | ధన్యుడై శిష్యుడరుగుట | ౫౭౬ |
| ౧౨౦ | గ్రంథోపసంహారః | గ్రంథము ముగింపు | ౫౮౦ |



శ్రీరస్తు.

శ్రీమచ్ఛంకర గురు చరణారవిందాభ్యాంనమః.

---

# వివేకచూడామణి.

## ఆంధ్రపద్యసహితము.

### మంగళాచరణము.

శా॥ శ్రీగౌరీసతితోడ రాజతగిరిన్ సింహాసనాసీనుడై।
యోగీంద్రుల్గొలువంగబొల్చి భువనంబుత్పన్నసాంకర్యమై।
లోకం గావుమటన్న నారదునిపలుకుల్ చిత్తమందుంచి భూ।
భాగంబందుదయించు శంకరుడు నా స్వాంతంబునన్నిల్చుతన్॥

### ప్రతిజ్ఞాదికము.

తే-గీ॥ శంకరాచార్య కృతము సంసారబంధ । మోచనముదుఃఖజాలని
ర్మూలనంబు । నగు వివేకచూడామణి ననువుమీఱ । నాంధ్రమొన
రింతు లోకహితార్థినగుచు॥

ఉ॥ శంకరదేశికప్రవరు సత్కృతులందిది బ్రహ్మతత్త్వము
న్మంకులకైన బోధపడుమాటలఁగాని కష్మని తేటమాటలన్।
బొంకముగాగ దెల్పుట దెనుంగొనరించెద దీని ప్రేమచే।
శంకలువాయునిందుగల సత్పథముల్ గొనిపోవు వానికిన్॥

ఉ॥ కన్నులులేనిమానవుని గన్నులుగల్గినవాడు త్రోవవెం।
టన్నడిపించుకొంచు నట డాయగవచ్చెడు మిట్టపల్లము।
ల్మున్నుగువాని నాతనికి పోలగజెప్పుచు వానిబాపుచున్।
జన్నవిధానశంకరుడు సత్పథమజ్ఞుల కిందుబాపెడిన్॥

—*) గ్రంథము. (*-

ఓం తత్సత్

అథవివేకచూడామణిర్లిఖ్యతే ॥ శ్లో ॥ సర్వవేదాంతసిద్ధాంతగోచరంత మగోచరం । గోవిందం పరమానందం సద్గురుం ప్రణతోఽస్మ్యహం ॥ ౧॥

తే॥ గీ॥ సర్వవేదాంత సిద్ధాంత సత్యవాక్య । గోచరునింద్రియాది
కా గోచరాత్ము । నిత్యపరమాద్వయానంద నిర్మలాత్మ। మూ
ర్తి గోవింద సద్గురుజేర్తు మదిసి॥ ౧॥

శ్లో॥ జంతూనాంనరజన్మ దుర్లభమతః పుంస్త్వంతతో విప్రతా ।
తస్మాద్వైదిక ధర్మమార్గ పరతావిద్వత్వమస్మాత్పరం ।
ఆత్మానాత్మ వివేచనంస్వనుభవో బ్రహ్మాత్మనాసంస్థితి ।
ర్ముక్తిర్నోశతజన్మకోటి సుకృతైఃపుణ్యైర్వినాలభ్యతే॥ ౨॥

ఉ ॥ జంతువులందునిమ్మనుజ జన్మము దుర్లభమందు బుంస్త్వమా।
నంతకువిప్రుడౌట నిగమార్థపరత్వముబండితుండునా।
టంతకునాత్మవేత్తయయి స్వానుభవంబునుగల్గిబ్రహ్మమై।
శాంతివిముక్తుడౌట బహుజన్మసుపుణ్యము లేక యబ్బునే॥ ౨॥

శ్లో॥ దుర్లభంత్రయమేవైత ద్దేవానుగ్రహ హేతుకం।
మనుష్యత్వం ముముక్షుత్వంమహాపురుషసంశ్రయః॥ ౩॥

క॥ మనుజుండైపుట్టుట ము । క్తినిగోరుట సద్గురున్నిధింబొందుట నా।
జనుమూడేదుర్లభములు । ఘనమగు దైవంబుతోడు గాకున్న
మెడగ॥ ౩॥

శ్లో॥ లబ్ధ్వాకథం చిన్నరజన్మ దుర్లభం।
తత్రాపిపుంస్త్వంశ్రుతిపారదర్శనం।

యస్త్వాత్మ ముక్త్యైనయతేతమూఢధీః।
సహ్యాత్మహాస్వంవినిహంత్యసద్గ్రహాత్॥౪॥

ఉ॥ పొందనశక్యమౌ మనుజుపుట్టువు నందును వేదపారమిం।
పొందగఁగాంచగల్గు బురుషోత్తమ జన్మమునొంది యొకఁడై।
మందు డెవండు ముక్తుఁడగుమార్గము జూచుకొనండతండె యా।
త్మందనయజ్ఞతంగెడపి తానగునాత్మనిహంత యిద్ధరన్॥ ౪॥

శ్లో॥ ఇతఃకోన్వస్తి మూఢాత్మా యస్తుస్వార్థేప్రమాద్యతి।
దుర్లభంమానుషం దేహంప్రాప్యతత్రాపి పౌరుషమ్॥ ౫॥

క॥ బలుదుర్లభమగు మనుజత । నలపురుషత్వంబు నొందినప్పుడుతానే।
యిలనెట్టిమూఢుఁడైనను । వెలయునె తనమేలుపనుల విడిచిమఱి
పునన్॥ ౫॥

శ్లో॥ వదంతుశాస్త్రాణి యజంతుదేవాన్ । కుర్వంతుకర్మాణిభజంతు
దేవతాః। ఆత్మైక్యబోధేనవినాపిముక్తి। ర్నసిధ్యతి బ్రహ్మశతాం
తరేపి॥ ౬॥

తే॥గీ॥ చదివినను శాస్త్రజాలముల్ జన్మములను। జేసినను గర్మనిష్ఠ రాజిలి
న దైవ।తములగొల్చిననెన్ని కల్పములకైన।ముక్తిగల్గు నెయాత్మైక్య
బోధలేక॥ ౬॥

శ్లో॥ అమృతత్వస్యనాశాస్తి విత్తేనేత్యేవహిశ్రుతిః।
బ్రవీతికర్మణోముక్తే రహేతుత్వంస్ఫుటంయతః॥ ౭॥

తే॥గీ॥ కలిమిచేనమృతత్వంబు కలుగునాశ । యైనలేదని శ్రుతిసెప్పినట్లు
గాన । కర్మమునముక్తికలుగుట కాదటంచు। శ్లాఘ్యముగఁ దెల్పు
టెల్లతెల్లంబెకాదె॥ ౭॥

శ్లో॥ అతోఽపిముక్త్యై ప్రయతేత విద్వాన్ । సంన్యస్తబాహ్యార్థసుఖస్పృహస్సన్। సంతంమహాంతం సముపేత్యదేశికం । తేనోపదిష్టార్థసమాహితాత్మా॥ ౮॥

ఉ॥ కావున నింద్రియార్థ సుఖకాంక్షలుమాని మహాత్ముసద్గురున్।
గావుమటంచు జేరియలకారుణికుండు ప్రసన్నుడైతనున్।
బోధవగనాసతిచ్చు విధముల్ స్థిరచిత్తముతో గ్రహించుచున్।
కేవలముక్తికైసుమతి కీలెఱుగం గృషిసేయగాదగున్॥ ౮॥

శ్లో॥ ఉద్ధరేదాత్మనాత్మానం మగ్నంసంసార వారిధౌ।
యోగారూఢత్వమాసాద్య సమ్యగ్దర్శన నిష్ఠయా॥౯॥

తే॥గీ॥ అఖిలసంకల్ప కర్మసన్యాసియై ప। రాత్మ నిశ్చలదృష్టియోగాధిరూఢు। డై మహాసంసృతిసముద్రమందుమునుగు। నాత్మగడతేర్పదగు తగుయత్నమునను॥౯॥

శ్లో॥ సంన్యస్యసర్వకర్మాణి భవబంధ విముక్తయే।
యత్యతాం పండితైర్ధీరై రాత్మాభ్యాసఉపస్థితైః॥ ౧౦॥

ఆ॥వె॥ ఆత్మనిష్ఠ లెస్సయలవడబూనెడు । సాహసంబుగలుగుజ్ఞానులెల్ల। పుట్టువనెడుకట్టు పొలియ గర్మంబుల। చినుఁవదలి కృషినిచేయవలయు॥ ౧౦॥

శ్లో॥ చిత్తస్యశుద్ధయేకర్మ నతువస్తూప లబ్ధయే।
వస్తుసిద్ధిర్విచారేణ నకించిత్కర్మకోటిభిః॥ ౧౧॥

ఆ॥వె॥ చిత్తశుద్ధికొఱకె చేయుటకర్మముల్ । వస్తువెఱుగదానివలనగాదు।
చకఁగావిమర్శనలిపిననదియగు। గానికర్మకోటిగాదురవయు॥౧౧.

శ్లో॥ సమ్యగ్విచారత స్సిద్ధా రజ్జుతత్త్వావధారణా।
భ్రాంత్యోదితమహాసర్పభయదుఃఖవినాశినీ॥ ౧౨॥

తే॥ గీ॥ భ్రాంతుడౌ కర్త తాటిగని పెనుబాము టంచు। బెగడి వగ నొందహితుడు పన్నగము గామి। జెప్పవాడదికడు విమర్శింపదెలియు। త్రాసను నిజంబు భయ దుఃఖతతియు బాయు॥ ౧౨॥

శ్లో॥ అర్థస్యనిశ్చయోదృష్టో విచారేణహితోక్తితః।
నస్నానేననదానేన ప్రాణాయామశతేనవా॥ ౧౩॥

తే॥గీ॥ సద్గురువుసెప్పటను విమర్శనము వలన। నర్థనిశ్చయమగు నెందు సంతెగాని। స్నానముల బ్రాణసంయమనముల దాన। శతములనొన ర్చినను గాదుసత్యముగను॥ ౧౩॥

శ్లో॥ అధికారిణమాశాస్తే ఫలసిద్ధిర్విశేషతః।
ఉపాయాదేశకాలాద్యాస్సంత్యస్మిన్ సహకారిణః॥ ౧౪॥

క॥ ఫలసిద్ధియగును పాత్రత। గలవానికె తదితరునకు గాదఃయందున్। వెలయునుతోడై కాలము। స్థలమున్ మొదలగు నుపాయసమితియ మరినన్॥ ౧౪॥

శ్లో॥ అతోవిచారఃకర్తవ్యోజిజ్ఞాసోరాత్మవస్తునః।
సమాసాద్యదయాసింధుం గురుంబ్రహ్మవిదుత్తమం॥ ౧౫॥

తే॥గీ॥ కానన్నాత్మనెఱుంగ నిక్కముగ గోరు। నతడుబ్రహ్మజ్ఞ వరుడు దయాసముద్రు। డగు గురువరేణ్యు జేరి యత్యంతభక్తి। స్థిరత రాత్మ విచారంబు సేయవలయు॥ ౧౫॥

శ్లో॥ మేధావీపురుషోవిద్వానూహాపోహావిచక్షణః।
అధికార్యాత్మ విద్యాయా ముక్తలక్షణలక్షితః॥౧౬॥

తే॥గీ॥ పురుషుడును సూక్ష్మమతి చదువరియు లెస్స। నూహాలున పోహాలు నెఱుంగుయుక్తిశాలి। శాస్త్రచోదితలక్షణసంయుతుండె। యాత్మ విద్యగ్రహింపదానర్హుడగును॥౧౬॥

శ్లో॥ వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః।
ముముక్షోరేవ హి బ్రహ్మజిజ్ఞాసాయోగ్యతామతా॥ ౧౭॥

తే.గీ॥ ఎఱుకగలిగి విరక్తుఁడై యెసఁగి శమదమాది గుణభూషితుండునై
యాత్మమోక్ష। కాంక్షగలవానికే తగు ఘనతరాత్మ। తత్త్వమెఱిఁ
గెడు కోరిక ధరణియందు॥ ౧౭॥

శ్లో॥ సాధనాన్యత్ర చత్వారి కథితాని మనీషిభిః।
యేషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే న సిధ్యతి॥ ౧౮॥

కం॥ ఈవిద్యకు సాధనములు। కావలయును నాలుగనుచు ఘనులందురవె।
చ్చో వెలయునందె నిష్ఠసు।భావహమగు భంగమొందు నవిలేని
యెడన్॥ ౧౮॥

శ్లో॥ ఆదౌ నిత్యానిత్యవస్తువివేకః పరిగణ్యతే। ఇహాముత్రఫలభోగవి
రాగస్తదనంతరం॥ ౧౯॥ శమాదిషట్కసంపత్తిర్ముముక్షుత్వమితి
స్ఫుటం॥ ౧౯॥

తే॥గీ॥ వరుస నిత్యమనిత్యమన్వస్తుబోధ। యిందునందును ఫలభోగమందు
విరతి। మఱియు శమముఖ్యషట్కసంపత్తి యవల। మోక్షకాంక్ష
యు సాధనములగు నాల్గు॥ ౧౯॥

శ్లో॥ బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యేవంరూపో వినిశ్చయః॥ ౨౦॥
సోఽయం నిత్యానిత్యవస్తు। వివేకస్సముదాహృతః॥ ౨౦॥

తే॥గీ॥ బ్రహ్మ మొకటె నిజము ప్రపంచమెల్ల। కల్లయను నిశ్చయంబె ముఖ్య
మనవొప్పు। నిత్యము నసిత్యమని వస్తునిచయ మెఱుఁగు। సాధనంబిది
యిది సర్వసాధనంబు॥ ౨౦॥

శ్లో॥ తద్వైరాగ్యం జిహాసాయా దర్శనశ్రవణాదిభిః॥ ౨౧॥ దేహాది
బ్రహ్మపర్యంతే హ్యనిత్యే భోగవస్తుని॥ ౨౧॥

ఆ॥వె॥ కనుట వినుట మొదలుగా గలవానిచే। నొడలు మొదల బ్రహ్మకడప లగల। యస్థిరంబులైన యఖిల భోగార్థంబు। లందు పేక్షకల్మి యదెవి రక్తి ॥ ౨౧॥

శ్లో॥ విరజ్యవిషయవ్రాతా ద్దోష దృష్ట్యాముహుర్ముహుః॥ ౨౨॥
స్వలక్ష్యేనియతావస్థా మనసశ్శమఉచ్యతే॥ ౨౫॥

కం॥ మనసునకు మాటిమాటికి। ఘనదుఃఖమెవిషయసమితి గనుపఱచి మనం। బునునాదెసబోనీయక। తనుదాగనుచుండ నిల్పదగుశమ మనగన్॥ ౨౨॥

శ్లో॥ విషయేభ్యఃపరావర్త్య। స్థాపనంస్వస్వగోళకే॥ ౨౩॥
ఉభయేషామింద్రియాణాం సదమఃపరికీర్తితః॥ ౨౫॥

కం॥ పదియింద్రియముల గొనికడు। పదిలంబుగ వానివిషయ పరత నుడిపినె। వ్మదిగానయ్యాయిచోటుల। గుదియించుటదమమనబడు గుణముగుణాఢ్యా॥ ౨౩॥

శ్లో॥ బాహ్యానాలంబనం వృత్తేరేషోపరతిరుత్తమా॥ ౨౪॥ సహనంసర్వ దుఃఖానా మప్రతీకారపూర్వకం। చింతావిలాపరహితం సాతితిక్షానిగద్యతే॥ ౨౫॥

తే॥గీ॥ వెసమనోవృత్తి తనయంత వెలిరుచులకు।జనకయుండ మఱల్చినిల్ప నుపరతి। మాన్పనెంచక కుందకమఱియునేన్న। కఖిలదుఃఖము లోర్చుటయగు దితిక్ష॥ ౨౫॥

శ్లో॥ శాస్త్రస్యగురువాక్యస్యసత్యబుద్ధ్యవధారణం।
సాశ్రద్ధాకథితా సద్భిర్యయావస్తూపలభ్యతే॥ ౨౬॥

కం॥ నిగమాంతశాస్త్రమును నా। ప్పగుసద్గురువాక్యమును యథార్థం బనుచున్। సుగమముగ బుద్ధినిల్పుట। యగుశ్రద్ధనరుండు సిద్ధినం దుఃచదీనన్॥ ౨౫॥

శ్లో॥ సర్వదా స్థాపనంబుద్ధేః శుద్ధే బ్రహ్మణిసర్వదా।
తత్సమాధానమిత్యుక్తం నతుచిత్తస్యలాలనం॥౨౭॥

తే॥గీ॥ తేటమగు బ్రహ్మమందు సుస్థిరముగాగ। బుద్ధి నెప్పుడు విడువక యుంచునట్టిది। టదిసమాధానమనుగుణంబంతెగాని। చిత్తమును బుజ్జగించుట చేతగాదు॥౨౭॥

శ్లో॥ అహంకారాదిదేహాంతాన్ బంధానజ్ఞానకల్పితాన్।
స్వస్వరూపావబోధేన। మోక్తుమిచ్ఛాముముక్షుతా॥ ౨౮॥

కం॥ సేననెడు నదియె మొదలుగ। మేనివరకు దోచుదెలియమిం గల కట్లన్। తానిదియని తెలియుటచే। బోనెట్టంగోరుచే ముముక్షుత యనగన్॥౨౮॥

శ్లో॥ మందమధ్యమరూపాపి వైరాగ్యేణశమాదినా।
ప్రసాదేనగురోస్సేయం ప్రవృద్ధా సూయతేఫలం॥౨౯॥

తే॥గీ॥ మందమే నిది మధ్యమమాత్రమేని। ఘనశమాదులు వైరాగ్యమును గురుకృప। గల్గెనేని ప్రవృద్ధమై క్రమముమీఱ। గల్పలతయట్లుఫల మిచ్చుగాని చెడదు॥ ౨౯॥

శ్లో॥ వైరాగ్యంచముముక్షుత్వం తీవ్రంయస్యతువిద్యతే।
తస్మిన్నేవార్థవంతస్స్యుః ఫలవంతశ్శమాదయః॥౩౦॥

కం॥ వైరాగ్యము మోక్షేచ్ఛయు।నారయనెవ్వారికలరు నతితీవ్రములై।
వారికడశమదమాదులు। చేరినసఫలంబులగును సిద్ధముచూడన్॥

శ్లో॥ ఏతయోర్మందతాయత్ర। విరక్తత్వముముక్షయోః।
మరౌసలిలవత్తత్ర శమాదేర్భానమాత్రతా॥౩౧॥

కం॥ వైరాగ్య ముముక్షుత్వము। లారయ మందంబులగుచు నమరిన చోటం। జేరినశమాద్యులెల్లను। వారిమరుస్థలమునందువలెగన్పట్టున్॥

శ్లో॥ మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ।
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే॥ ౩౨॥
స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరేజగుః॥ ౩౨½॥

గీ॥ మోక్షమును జెంద సాధనంబు లగువాని।
యందుభక్తియె పెద్దది యట్టిభక్తి।
తనదు రూపంబు ధ్యానించుటనగ జెల్లు।
నదితనగుణంబుల భజించుటందు రొరులు॥ ౩౮॥

శ్లో॥ ఉక్తసాధన సంపన్న స్తత్వజిజ్ఞా సురాత్మనః॥ ౩౩॥
ఉపసీదేద్గురుం ప్రాజ్ఞం యస్మాద్బంధవిమోక్షణం॥ ౩౩½॥

క॥ ఈనాలుగుసాధనములు । మానుగమున్గల్గియాత్మ మర్మంబెఱుగం।
బూనెడువాడవ్వల విజ్ఞానసిధింగురునిముక్తిగనజేరదగున్॥ ౩౨॥

శ్లో॥ శ్రోత్రియోఽవృజినోఽకామ హతో యోబ్రహ్మవిత్తమః॥ ౩౪॥
బ్రహ్మణ్యుపరతశ్శాంతో నిరింధన ఇవానలః।
అహేతుకదయాసింధు ర్బంధురానమతాంసతాం॥ ౩౫॥

మ॥ గురుభావంబుననాశ్రయింపదగు విజ్ఞున్ శ్రోత్రియున్ బ్రహ్మవి।
ద్వరునిష్కామునిబుణ్యుబ్రహ్మమయునిర్వ్యాజానురాగాంబుధిన్।
దిరమై కట్టెయులేకమండెడు మహాగ్నింబోలు శాంతాత్ము ద।
న్శరణన్సజ్జనులైనవారికిగడున్ బ్రాణప్రియుంబంధువున్॥ ౩౩॥

శ్లో॥ తమారాధ్యగురుంభక్త్యా ప్రహ్వప్రశ్రయసేవనైః।
ప్రసన్నంతమనుప్రాప్య పృచ్ఛేత్ జ్ఞాతవ్యమాత్మనః॥ ౩౬॥

తే-గీ॥ చేరజనిభక్తితో నమస్కారములును।
వివిధశుశ్రూషలు నొనర్చి వినయమలర।
వేడుకొని మెప్పువడసి వివేకమున నె।
ఱుంగదగువాని గురుసదుగంగవలయు॥ ౩౪॥

శ్లో॥ స్వామిన్నమస్తేనతలోకబంధో కారుణ్యసింధో పతితంభవాబ్ధౌ।
మాముద్ధరాత్మీయకటాక్షదృష్ట్యా ఋజ్వ్యాతికారుణ్య సుధాభి
వృష్ట్యా॥ ౩౭॥

ఉ॥ మ్రొక్కెదదేవ దీనులగు మాధుల ధన్యులజేయుదీవునే।
దిక్కటంచిజన్మ మృత్యుభయదీనుడనై భవదీయసత్కృపా।
దృక్కులనిత్యముంగురియు దివ్యసుధారసమానగౌరినిక్॥
దిక్కనినమ్మివచ్చితిమదింగృప బూదునసుందయాంబుధీ॥ ౩౫॥

శ్లో॥ దుర్వారసంసారద వాగ్నితప్తం।
దోధూయమానం దురదృష్టవాతైః॥
భీతంప్రపన్నం పరిపాహిమృత్యో।
శ్శరణ్యమన్యద్య దహంనజానే॥ ౩౮॥

ఉ॥ సంసృతియన్దవానలము చాలగనన్నెరియించుచుండనా।
హింసకుదోడుగాగ దురదృష్టమహానిలమేచుజూడునా।
యంసముజేరిమృత్యువు భయాకృతినాయెదప్రకటించునీ।
హింసలబాపనాకు గతియీవెగదేకృప జూచికావవే॥ ౩౬॥

శ్లో॥ శాంతామహాంతోనివసంతిసంతో।
వసంతవల్లోకహితంచరంతః।
తీర్ణాస్స్వయం భీమభవార్ణవంజనా।
నహేతునాన్యానపి తారయంతః॥ ౩౯॥

తే-గీ॥ శాంతులుమహాత్ములిల నవ్వసంతుమాడ్కి।
లోకహితమాచరించుచుభీకరమగు।
భవసముద్రంబుదాటి నిర్వ్యాజకరుణ।
నన్యులనుగూడ దాటింతురలఘుమతులు॥ ౩౭॥

శ్లో॥ అయంస్వభావస్స్వత ఏవయత్పర।
శ్రమాపనోద ప్రవణంమహాత్మనాం।
సుధాంశురేషస్వయమర్కకర్కశ।
ప్రభాభితప్తామవతిక్షితింకిల॥ ౪౧॥
క॥ పురులశ్రమనివారించెడి। పరమాసక్తియిదిస్వస్వభావమె యగుస।
త్పురుషులకుచంద్రుడినకర। పరితప్తధరిత్రిజల్లబఱచుంగాదే॥ ౩౮॥
శ్లో॥ బ్రహ్మానందరసానుభూతికలితైః పూతైస్సుశీతైర్యుతై।
ర్యుష్మద్వాక్కలశోజ్ఝితై శ్శ్రుతిముఖై ర్వాక్యామృతైస్సేచయ।
సంతప్తం భవతాపదావ దహనజ్వాలాభిరేనంప్రభో।
ధన్యాస్తేభవదీక్షణక్షణగతేః పాత్రీకృతాస్స్వీకృతాః॥ ౪౧॥
శా॥ స్వామీసంసృతి కాఱుచిచ్చువలెన స్సంతాపమొందించె నా।
త్మామోదానుభవంబు వ్యక్తముగ శాంతాకారమైచల్లనై।
మీమోమన్గలశంబునన్వెడలి ప్రామిన్కుల్వలెన్నించు వా।
క్యామేయామృత ధారనాపయిన నింపారంగ జిల్కంగదే॥ ౩౯।
క॥ కడువడిమీచేనభయము। వడసికటాక్షంబునొందుపాత్రతగలుగఁ
బడమిజరియించువారే । కడతేరినవారుజన్మ కర్మచ్యుతులై॥ ౪౦
శ్లో॥ కథంతరేయంభవసింధుమేతం।
కావాగతిర్మేకతమోఽస్త్యుపాయః।
జానేనకించిత్కృపయావ మాంప్రభో।
సంసారదుఃఖక్షతిమాతనుష్వ॥ ౪౨॥
తే॥ గీ॥ కడలిసంసృతి దాటులేకరణిదీని।
నాకుదిక్కేది వెరవున్నదేకృపాబ్ధి।
యేమియునెఱుంగ దేవనన్నేలుకరుణ।
బుట్టువనియెడుదుఃఖంబు బోవనడచు॥ ౪౧॥

శ్లో॥ తథావదంతం శరణాగతంస్వం।
సంసారదావానలతాపతప్తం।
నిరీక్ష్యకారుణ్యరసార్ద్రదృష్ట్యా।
దద్యాదభీతింసహసామహాత్మా॥ ౪౧॥

క॥ అనితననుశరణుజొచ్చిన। ఘనసంసారాగ్నిశప్తుగనుగొనిదయచే।
ననవలయు గురువుభయపడ। బనిలేదు తరింతువనుచు వాత్సల్య
మునన్॥ ౪౨॥

శ్లో॥ విద్వాన్సతస్మా ఉపసత్తిమీయుషే।
ముముక్షవేసాధుయథోక్తకారిణే।
ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ।
తత్త్వోపదేశం కృపయైవకుర్యాత్॥ ౪౪॥

ఉ॥ అంతగురుండుతోడ్పడుటకై బ్రతిమాలుచు ముక్తిగోరుచున్।
శాంతివహించిసాధుగతి సల్పుచునాజ్ఞలనెల్లజిత్తవి।
శ్రాంతిమెసంగభక్తుడయి కాదిలెదుశిష్యవరేణ్యుగూర్చియ।
త్యంతకృపన్రహస్యమగు నర్థమునంతయుజెప్పగాదగున్॥ ౪౩॥

శ్లో॥ మాభైష్టవిద్వన్స్తవనాస్త్యపాయః।
స్సంసారసింధోస్తరణేఽస్త్యుపాయః।
యేనైవయాతాయతయోఽస్యపారం।
తమేవమార్గంతవనిర్దిశామి॥ ౪౫॥

తే॥ గీ॥ బుద్ధిశాలివి భయపడబోకు నీక।
పాయమేమియు లేదుచూపట్టగలదు।
సంసృతి సముద్రమును దాటు సరణియతులు।
పేనిచేదాటిరదెనీకు దెల్పువాడ॥ ౪౬॥

శ్లో॥ అస్త్యుపాయోమహాన్కశ్చిత్సంసారభయనాశనః।
తేనతీర్త్వాభవాంభోధింపరమానందమాప్స్యసి॥ ౪౭॥

క॥ కలదొక వెరవధికంబది।
తెలిసినసంసారభయము దీఱుఁదానన్।
సులభముగ భవమహాంబుధి।
వెలువడిపరమసుఖమొందె వెలసెదువుత్రా॥ ౪౫॥

శ్లో॥ వేదాంతార్థవిచారేణ జాయతేజ్ఞానముత్తమం।
తేనాత్యంతికసంసారదుఃఖనాశోభవత్యను॥ ౪౬॥

క॥ విను ముపనిషదర్థ విమ।
ర్శనమునసుజ్ఞానమబ్బుసరగందానన్।
ఘనమగుసంసృతిదుఃఖము।
చనురూపత్రిమలబాడమజాలదునీకున్॥ ౪౭॥

శ్లో॥ శ్రద్ధాభక్తిధ్యానయోగాన్ముముక్షో।
ర్ముక్తేర్హేతూన్వక్తి సాక్షాచ్ఛ్రుతేర్గీః।
యోవాఏతేష్వేవతిష్ఠత్యముష్య।
మోక్షోఽవిద్యాకల్పితాద్దేహబంధాత్॥ ౪ ॥

తే॥ గీ॥ ముక్తిగోరెడువానివిముక్తికరయ।
హేతువులుశ్రద్ధభక్తిధ్యానైకయుక్తి।
యనిశ్రుతిమెపలుకు-వీనినేహత్రియున్న।
భ్రాంతిజశరీరబంధంబువాయునతని॥ ౪౭॥

శ్లో॥ అజ్ఞానయోగాత్పరమాత్మనస్తవ
హ్యనాత్మబంధస్తతఏవసంసృతిః।
తయోర్వివేకోదితబోధవహ్ని
రజ్ఞానకార్యంప్రదహేత్సమూలం॥ ౪౮॥

చ॥ వినుపరమాత్మవీవు నినువీడక కప్పిన తెల్విలేమి నే।
కెనసెననాత్మబంధమటు హెచ్చెనుసంసృతి దుఃఖమాపరా।
త్మునివినవాత్మనారయగబుట్టు ప్రబోధమహాగ్ని తెల్విలే।
మినివటపోచుసర్వమును నిమేషమునన్మొదలంటగాలుచుక్॥ ౪౮॥

శిష్యఉవాచ॥

శ్లో॥ కృపయా శ్రూయతాంస్వామి న్ప్రశ్నోఽయం క్రియతేమయా।
యదుత్తర మహంశ్రుత్వా కృతార్థస్స్యాం భవన్ముఖాత్॥ ౫౦॥

ఆ॥ వె॥ అనినశిష్యుడను మహాత్మనేనొకటి।
యడుగ దలచినాడ నవధరింప।
వలయుదయను మీరు సెలవిచ్చును త్తరం।
బును గ్రహించి ధన్యతనువహింతు॥ ౪౯॥

శ్లో॥ కోనామబంధః కథమేషఆగతః।
కథంప్రతిష్ఠాస్య కథంవిమోక్షః।
కోఽసావనాత్మా పరమస్సఆత్మా।
తయోర్వివేకః కథమేతదుచ్యతాం॥ ౫౧॥

తే॥ గీ॥ బంధమననెద్ది యదియెట్లువచ్చెనుండు।
టెట్లువదలుటయేరీతియిట్టియనాత్మ।
యెద్దిపరమాత్మయననేదియివితెలియువి।
వేకమెట్లగు సెలవియ్యవేమహాత్మ॥ ౫౦॥

శ్రీగురుఉవాచ॥ శ్లో॥ ధన్యోఽసికృతకృత్యోఽసి। పావితంతేకులంత్వయా।
యదావిద్యాబంధముక్త్యా। బ్రహ్మీభవితుమిచ్ఛసి॥ ౫౨॥

క॥ నాథుడుగురుపనుధన్యుడ।
వీవుకృతార్థుడవునున్ముహృద్యంబుగ బం

ధావళివీడ్వడబ్రహ్మము।
గావలచుంట నీకులంబకలుష(బచ్చెకా ౫౧॥

శ్లో॥ ఋణమోచనకర్తారః పితుస్సంతిసుతాదయః।
బంధమోచనకర్తాతు స్వస్మాదన్యోనకశ్చన॥ ౫౨॥

తే॥ గీ॥ అప్పుజేసినదదిర్చ్పనాత్మజాదు।
లుండ్రునరునకుబంధంబులూడదీయ।
నెవ్వనికివాడెకానితదితరునకును।
బోసగదెన్నివిధంబులబుడమియందు॥ ౫౭॥

శ్లో॥ మస్తకన్యస్తభారాదే। ర్దుఃఖమన్యైర్నివార్యతే।
క్షుధాదికృతదుఃఖంతు। వినాస్వేనన కేనచిత్॥ ౫౮॥

క॥ తలపైనుండెడుబరువున।
గలిగెడిదుఃఖంబు వాపగలుగుదురన్యుల్।
తలపగనాకలిమొదలగు।
పలుదుఃఖములాకరి వాకరుపాపగనగునే॥ ౫౩॥

శ్లో॥ పథ్యమౌషధసేవాచ క్రియతేయేనరోగిణా।
ఆరోగ్యసిద్ధిర్దృష్టాస్య నాన్యానుష్ఠితకర్మణా॥ ౫౫॥

తే॥ గీ॥ మందుదిని పథ్యముండెడు మానవునకు।
మానురోగములారోగ్యమౌనుగాని।
యొరులొనర్చెడు పథ్యాదికోపచార।
ములనువానికినారోగ్య మలరగలదె॥ ౫౪॥

శ్లో॥ వస్తుస్వరూపం స్ఫుటబోధచక్షుషా।
స్వేనైవవేద్యం నతుపండితేన।
చంద్రస్వరూపం నిజచక్షుషైవ।
జ్ఞాతవ్యమన్యైరవగమ్యతేకిం॥ ౫౬॥

తే॥ గీ॥ విశదముగ జ్ఞాననేత్రంబువిచ్చి తాను।
వస్తురూపంబుజూడఁగ వలయునాత్మ।
విదుడువర్ణింపగాదు తేనెలుగుదాను।
కనులఁజూడక యొరులచేవినదెలియునె॥ ౫౫॥

శ్లో॥ అవిద్యాకామకర్మాది పాశబంధంవిమోచితుం।
కశ్శక్నుయాద్వినాత్మానం కల్పకోటిశతైరపి॥ ౫౭॥

తే॥ గీ॥ ఒడలునేననుభ్రమయును నల్గడల నెరయు।
గోరికలుచెయువులునను గొప్పత్రాళ్ల।
కట్టులెడలింపదనకె యోగానియొరుల।
కగునెకల్ప శతంబులకైననరయ॥ ౫౬॥

శ్లో॥ నయోగేననసాంఖ్యేన। కర్మణానోనవిద్యయా।
బ్రహ్మాత్మైకత్వబోధేన। ముక్తిస్సిధ్యతినాన్యథా॥ ౫౮॥

తే॥ గీ॥ యోగధారణలను సాంఖ్యయోగమునను।
కర్మములుసేత జదువులుగలువగాదు।
బ్రహ్మమునుతానునొకటె యన్నప్రజ్ఞచేత।
ముక్తిదొరకొను మఱియెట్టియుక్తిగాదు॥ ౫౭॥

శ్లో॥ వీణాయారూప సౌందర్యం తంత్రీవాదనసౌష్ఠవం।
ప్రజారంజనమాత్రంతన్నసామ్రాజ్యాయకల్పతే॥ ౫౯॥

తే॥ గీ॥ వీణరూపంబదెంత సొంపైననాద।
మెంతయింపైన నరులకుసంతసంబొ।
నర్చునంతయకాని జనంబునెల్ల।
నిలప్రభుత్వంబెసంగదానేలగలదె॥ ౫౮॥

శ్లో॥వాగ్వైఖరీశబ్దఝురీ శాస్త్రవ్యాఖ్యానకౌశలం।
వైదుష్యంవిదుషాంతద్వద్భుక్తయేనతుముక్తయే॥ ౬౦॥

తే॥ గీ॥ అటులెపండితులగువారి యలఘువిద్య।
మాటపొంకముపన్యాస పాటవంబు।
శాస్త్రముల నర్థములుసెప్ప శక్తియెల్ల।
పొట్టకేగాని ముక్తికి బోవగాదు॥ ౫౯॥

శ్లో॥ అవిజ్ఞాతే పరేతత్త్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా।
విజ్ఞాతేఽపిపరేతత్త్వే శాస్త్రాధీతిస్తునిష్ఫలా॥ ౬౧॥

క॥ పరతత్త్వము నెఱుగనిచో। స్థిరముగ శాస్త్రంబు లభ్యసించియు నేలా।
పరతత్త్వము నెఱిగినచో। స్థిరముగశాస్త్రంబులభ్యసించగనేలా॥ ౬౦॥

శ్లో॥ శబ్దజాలంమహారణ్యం చిత్తభ్రమణ కారణం।
అతఃప్రయత్నాత్ జ్ఞాతవ్యం తత్వజ్ఞాత్తత్వమాత్మనః। ౬ ॥

ఆ॥ వె॥ అడవి శబ్దజాల మందు జొచ్చినచిత్త।
మధికచలనమందు నట్లుగాన।
నాత్మ నెఱుగువానినడిగి యాత్మరహస్య।
సరణి నెఱుగవలయు జతనమునను॥ ౬౧॥

శ్లో॥ అజ్ఞాన సర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధంవినా।
కిము వేదైశ్చశాస్త్రైశ్చ కిముమంత్రైః కిమౌషధైః॥ ౬౨॥

క॥ ఎఱుగమి యను సర్పముచే । గఱువంబడియున్నవాని కష్టముదీర్పన్
గుఱిగలయెఱుకయెమందగు। మఱియేటికి వేదశాస్త్రమంత్రౌషధముల్॥

శ్లో॥ నగచ్ఛతివినాపానం వ్యాధిరౌషధశబ్దతః।
వినాపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్నముచ్యతే॥ ౬౪॥

తే॥ గీ॥ త్రాగకయెమందు పేరుమాత్రమనుకొన్న।
వ్యాధి కుదురనియట్లు ప్రత్యక్షముగను।
బ్రహ్మమెఱుగక దానిపేర్లనునిరతము।
నుచ్చరించినమోక్షంబు నొందరాదు॥ ౬౩॥

శ్లో॥ అకృత్వాదృశ్యవిలయ మజ్ఞాత్వాతత్త్వమాత్మనః।
బాహ్యశబ్దైఃకుతోముక్తి రుక్తిమాత్రఫలైర్నృణాం॥ ౬౫॥

గీ॥ అగపడునవెల్ల బట్టిమాయంబుసేయ।
కాత్మతత్త్వంబెఱుంగక యఱచునరుని।
వట్టిమాటలచే ముక్తి వచ్చుటెట్లు।
మాటలాడినమాత్రంబె మతిఫలంబు॥ ౬౪॥

శ్లో॥ అకృత్వాశత్రుసంహార మగత్వాఖిలభూశ్రియం।
రాజాహమితిశబ్దాన్నో రాజాభవితుమర్హతి॥ ౬౬॥

క॥ అరులబురిగొనక యిలగల । సిరినెల్లగడించకఱక క్షితిపతిననినన్।
దొరయగునెనరుడుమాటల। దొరకొనునేసిరియువెడగుత్రోవయెకాదే॥

శ్లో॥ ఆప్తోక్తింఖననంతథోపరిశిలాద్యుత్కర్షణంస్వీకృతిం।
నిఃక్షేప స్సమపేక్షతే నహి బహిశ్శబ్దైస్తునిర్గచ్ఛతి।
తద్వద్బ్రహ్మవిదోపదేశ మనన ధ్యానాదిభిర్లభ్యతే।
మాయాకార్యతిరోహితం స్వమమలంతత్త్వంనదుర్యుక్తిభిః॥ ౬౭॥

ఉ॥ మిత్రునినమ్మిత్రవ్వియటమీది శిలాదులుతీసితీసినన్।
సూత్రముగానిధుల్ దొరుకు చుల్కని మాటలజిక్కవల్లె యీ।
ధాత్రిగురూక్తినమ్మి బహుధామననానులొనర్పకున్నవా।
జ్ఞాత్రమునంగనంబడదు మాయనుడాగినశుద్ధతత్త్వముల్॥ ౬౬॥

శ్లో॥ తస్మాత్సర్వప్రయత్నేన భవబంధవిముక్తయే।
స్వైరేవయత్నఃకర్తవ్యో రోగాదావివపండితైః॥ ౬౮॥

ఆ॥ వె॥ కానబుద్ధిశాలులైన వారెల్లరో।
గాదులందువలె ప్రయత్నముసను।

తా మెకృషియొనర్పదగు నెట్టులయినను।
పుష్టిప నెడుకట్టు పొలియుకొఱకు॥ ౬౭॥

శ్లో॥ యస్త్వయాద్యకృతః ప్రశ్నో వరీయాఞ్ఛాస్త్రవిన్మతః।
సూత్రప్రాయో నిగూఢార్థో జ్ఞాతవ్యశ్చ ముముక్షుభిః॥ ౬౯॥

క॥ కడులెస్సైనదియిపుడీ। వడిగ్గనప్రశ్నంబుసూత్రమట్లుగభీరం।
బౌడబలుదుశాస్త్రివేత్తల। గమ దెలియందగుముముక్షుగణమునకెల్లన్॥

శ్లో॥ శృణుష్వావహితో విద్వ న్యన్మయా సముదీర్యతే।
తదేతచ్ఛ్రవణాత్సద్యో భవబంధాద్విమోక్ష్యసే॥ ౭౦॥

క॥ వినుసావధానచిత్తం। బునని ప్పుడు నేవచింపబోయెడియర్థం।
బనువందవిన్న సుమతీ। ఘనభవబంధంబు నిన్నుగమవడివిడుచున్॥ ౬౯॥

శ్లో॥ మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే।
వైరాగ్యమత్యంత మనిత్యవస్తుషు।
తతశ్శమశ్చాపి దమ స్తితిక్షా।
న్యాసః ప్రసక్తాఖిల కర్మణాం భృశం॥ ౭౧॥

ఆ॥ వె॥ మోక్షమునకుబూడ మొదటిహేతువనిత్య।
వస్తువులను గలుగువరవిరక్తి।
పిదపశమముదమము వెనుకదితిక్షయు।
ఫలముగోరి పనులబట్టకునికి॥ ౭౦॥

శ్లో॥ తతః శ్రుతి స్తన్మననం సతత్త్వ। ధ్యానం చిరం నిత్య నిరంతరం మునేః॥
తతోఽవికల్పం పరమేత్య విద్వా। నిహైవ నిర్వాణసుఖం సమృచ్ఛతి।

ఆ। వె॥ అవలవినుటవినిన యదివిమర్శించుట।
దానిలెస్సనిలిపి తలచుచుంట।
మైన జెదరకుండు నాస్థాయి జెందివి।
ముక్తిసుఖమునిందె పొందుమౌని॥ ౭౧॥

శ్లో॥ యత్రోద్భవ్యంతవేదానీ మాత్మానాత్మవివేచనం।
తదుచ్యతేమయాసమ్యక్తదాత్మన్యవధారయ॥ ౭౩॥

ఆ॥ వె॥ ఆత్మయిదియనాత్మయిదియనుసువిచార।
మెఱుగ జెప్పవాడ నిప్పుడేనీకు।
దాని తెస్సవినుము తలకనిమనముతో।
మఱువకుండమత్రియు మగిడినిలుపు॥ ౭౨॥

శ్లో॥ మజ్జాస్థిమేదః పలరక్తచర్మ।
త్వగాహ్వయైర్ధాతుభి రేభిరన్వితం।
పాదోరువక్షో భుజపృష్ఠమస్తకై।
రంగైరుపాంగైరుప యుక్తమేతత్॥ ౭౪॥
అహంమమేతి ప్రథితంశరీరగం।
మోహాస్పదం స్థూలమితీర్యతేబుధైః॥ ౭౪౹॥

తే॥ గీ॥ చీము నెత్తురు మాంసమస్థిమేదములును।
నెమ్ములునుతోలు వీనిచేనిర్మితమయి।
కాలుసేతులుతలవీపు కడుపుతెమ్ము।
నిట్టినానావయవముల నింటిబోలె॥ ౭౩॥

క॥ కానంబడుచుండు లోకము। లోనేనును నాయదియనలోలాత్ములకుం।
స్థానమయినికరముగగన। నైనదియీమేనుస్థూలమండ్రిదిపెద్దల్॥ ౭౪

శ్లో॥ నభోనభస్వద్దహనాంబుభూమయః।
సూక్ష్మాణిభూతా నిభవంతితాని॥ ౭౫॥
పరస్పరాంశైర్మిళితానిభూత్వా।
స్థూలానిచస్థూలశరీరహేతవః।
మాత్రాస్తదీయావిషయాభవంతి।
శబ్దాదయఃపంచసుఖాయభోక్తుః॥ ౭౬॥

తే॥ గీ॥ ఖానిలానల జలభూము లనెడునైదు।
భూతములుసూక్ష్మ దశనుండియూతతముగ।
నొకటిమెదేసి పాళులై యొండొకరిట।
గలిసిస్థూలంబులనగ విఖ్యాతినొందు॥ ౭౫॥

క॥ స్థూలమహాభూతములివి। స్థూలవపుఃకారణములు శ్రోత్రాదికమా।
త్రిశియుఏనిది భోక్తకు। బోలగశబ్దాదిివిషయములు సుఖమిచ్చున్॥

శ్లో॥ యఏషమూఢా విషయేషుబద్ధా।
రాగోరుపాశేన సుదుర్గమేన।
ఆయాంతినిర్యాంత్యధ ఊర్థ్వముచ్చై।
స్స్వకర్మమాత్రేన జవేననీతాః॥ ౭౭॥

ఉ॥ ఈవిషయంబులందగిలి యెప్పుడువీడక కోరిక త్రాళ్లచే।
గేవలబద్ధులై జడులొగిందమ చేసినకర్మమీద్వగా।
చావునుపుట్టువుంబొరసి సత్వర మేగుచువచ్చుచుందురి।
భావమెఱింగియావిషయ వాసనజోలినిమానవొప్పగున్॥ ౭౭॥

శ్లో॥ శబ్దాదిభిఃపంచభిరేవపంచ పంచత్వమాపుస్స్వగుణేనబద్ధాః।
కురంగమాతంగపతంగమీనభృంగా నరఃపంచభిరంచితఃకిమ్॥ ౭౮॥

తే॥ గీ॥ వినికిమొదలగు నైదింటవిడిగనొకట।
టొకటనేనైజముగ జచ్చుచుండుజింక।
కరియుమిడుతయు చేపభృంగంబునవగ।
నైదుగలిగిన మానవుండనగనెంత॥ ౭౮॥

శ్లో॥ దోషేణతీవ్రోవిషయః కృష్ణసర్పవిషాదపి।
విషంనిహంతిభోక్తారం ద్రష్టారంచక్షుషాప్యయమ్॥ ౭౯॥

తే॥ గీ॥ నల్లత్రాచువిషంబు కన్ననుభయంక।
రంబువిషయంబు విషమన్నత్రాగునట్టి

వానినేచంపువిషయంబు వాంఛగనుల।
జూచినంతనె చంపు నిష్ఠురముగాను॥ ౭౯॥

శ్లో॥ విషయాశామహాపాశా ద్యోవిముక్తస్సుదుస్త్యజాత్।
సఏవకల్పతేముక్త్యై నాన్యష్షట్ఛాస్త్రవేద్యపి॥ ౮౦॥

ఆ॥ వె॥ విడువరాకయుండు విషయాభిలాషయన్।
త్రాటికట్టువీడదన్నువాడె।
ముక్తిగాంచునోరుడు పోలుపారనాటుకొ।
స్త్రిములజదివినను పరంబుగనడు॥ ౮౦॥

శ్లో॥ ఆపాతవైరాగ్యవతోముముక్షూ।
న్భవాబ్ధిపారం ప్రతియాతుముద్యతాన్।
ఆశాగ్రహోమజ్జయతేఽంతరాళే।
నిగృహ్యకంఠే వినివర్త్యవేగాత్॥ ౮౧॥

చ॥ కడవటుకున్విరక్తియెసగన్ భవసాగరమెల్లనీది వె।
ల్వడగగడంగువాని విడుబాటెదగోరెడువాని నాశయన్।
గడుసుజలగ్రహంబొడిసి కంఠము బట్టిరయంబుమాన్పియా।
నడుమనెయీడ్చిముంచు జతనంబున నేమఱగూడదెన్నడున్॥౮౧॥

శ్లో॥ విషయాఖ్యగ్రహోయేన సువిరక్త్యసినాహతః।
సగచ్ఛతిభవాంభోధేః పారంప్రత్యూహవర్జితః॥ ౮౨॥

క॥ విరతియనువాడియడిదము। సరగబఱపివిషయమను మొసలిజంపినవా।
డరుగగలడువిఘ్నములే। కరుదుగసంసారజలధి యవ్వలిదరికిన్॥ ౮౨॥

శ్లో॥ విషమవిషయమార్గైర్గచ్ఛతోఽనచ్ఛబుద్ధేః।
ప్రతిపదమభియాతో మృత్యురప్యేషవిద్ధి।
హితసుజనగురూక్త్యాగచ్ఛత స్స్వస్యయుక్త్యా।
ప్రభవతిఫలసిద్ధిస్సత్యమిత్యేవవిద్ధి॥ ౮౩॥

చ॥ మతికలుషంబుగా విషయమార్గములంబడి పోవువానికిం।
ప్రతిపదమందు నీవిషయరక్తియె శత్రువుమృత్యువౌ బుధుల్।
హితులుగురుండుజెప్పగతె నేగుచుమరు క్తిజరించువానికీ।
ప్సితఫలసిద్ధిగల్గునిది సిద్ధముగామదినమ్మిమెప్పుడున్॥ ౮౩॥

శ్లో॥ మోక్షస్యకాంక్షాయది వైతవాస్తి।
త్యజాతిదూరా ద్విషయాన్విషంయథా।
పీయూషవత్తోష దయాక్షమార్జవ।
ప్రశాంతిదాంతీర్భజ నిత్యమాదరాత్॥ ౮౪॥

తే॥ గీ॥ విడువుగోరెదవేని వివేకమూని।
విడువిషమునట్లు దవ్వులవిషయములను।
గొనుమమృతమట్లు సంప్రీతిదనరతుష్టి।
శాంతిదయయార్జవము దాంతెక్షమయునెపుడు॥ ౮౪॥

శ్లో॥ అనుక్షణంయత్పరి హృత్యకృత్య।
మనాద్యవిద్యాకృత బంధమోక్షణం।
దేహఃపరార్థోఽ యమముష్యపోషణే।
యస్సజ్జతేసస్స్వ మనేనహంతి॥ ౮౫॥

తే॥ గీ॥ మొదలులేనియవిద్య నిమ్మోలవొలంగ।
దట్టుపనిబూన కెప్పుడుతనదిగాని।
యీశరీరంబుబోషించ నెంచుజడుడు।
దీనిచే తన్నుదానె వధించుకొనును॥ ౮౫॥

శ్లో॥ శరీరపోషణార్థీస న్యఆత్మానందిదృక్షతి।
గ్రాహందారుధియాధృత్వా నదీంతర్తుంసగచ్ఛతి॥ ౮౬॥

క॥ ఈదేహము బోషించుచు। నేదేవునిబూడగోరు సేవాడాతం।
డీదినదిదాటబూచును। మోదంబునదారువంచు మొసలింగొంచున్॥

శ్లో॥ మోహ ఏవ మహామృత్యుర్ముముక్షోర్వపురాదిషు।
మోహో వినిర్జితో యేన స ముక్తిపదమర్హతి॥ ౮౭॥

తే॥ గీ॥ తనువు మొదలగునవి నిజమనుచు దోచు।
మోహమే పెద్దమృత్యువు మోక్షకామి।
కట్టి మోహంబు నెదిరి జయంబు గొన్న।
మేటి కేతగు ముక్తియన్ పీట మెకట॥ ౮౭॥

శ్లో॥ మోహం జహి మహామృత్యుం దేహదారసుతాదిషు।
యం జిత్వా మునయో యాంతి తద్విష్ణోః పరమం పదం॥ ౮౮॥

తే॥ గీ॥ మేను నిల్లాలు బిడ్డలు లోనగునవి।
సత్యమను మోహమే పెద్దమృత్యు వయ్య।
దీని విదళించు మును లెల్ల దీని గెలిచి।
నిలుతురా నిండి మించెడు వెలుగునందు॥ ౮౮॥

శ్లో॥ త్వఙ్మాంసరుధిరస్నాయు మేదోమజ్జాస్థిసంకులం।
పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలం నింద్యమిదం వపుః॥ ౮౯॥

తే॥ గీ॥ నరము లెముకలు చీము నెత్తురును మెదడు।
మాంసమును గూడి మూత్రంబు మలము నిండి।
హేయమై యుండు తోలు తిత్తి యీ శరీర।
మిది యె స్థూలంబు నా బడు నీ ధరిత్రి॥ ౮౯॥

శ్లో॥ పంచీకృతేభ్యో భూతేభ్యః స్థూలేభ్యః పూర్వకర్మణా।
సముత్పన్నమిదం స్థూలం భోగాయతనమాత్మనః॥ ౯౦॥

తే॥ గీ॥ ఒకటొకటియైదు పాళులౌ రైయొండొకంట।
గలియు నా స్థూలభూత సంఘంబువలన।
తొంటి కర్మంబుచే బుట్టు స్థూలదేహ।
మిది యె యాత్మకు నను భవపదము వత్స॥ ౯౦॥

శ్లో॥ అవస్థాజాగరస్తస్య స్థూలార్థానుభవోయతః॥ ౯౮॥
బాహ్యేంద్రియైః స్థూలపదార్థసేవాం।
స్రక్చందనస్త్య్రాది విచిత్రరూపాం।
కరోతిజీవస్స్వయ మేతదాత్మనా।
తస్మాత్ప్రశస్తిర్వపుషోఽస్యజాగరే॥ ౯౧॥
సర్వోఽపిబాహ్యసంసారః పురుషస్యాయదాశ్రయః।
విద్ధిదేహమిదంస్థూలం గృహవద్గృహమేధినః॥ ౯౨॥

తే గీ॥ స్థూలవిషయానుభవమిందు గ్రోలుకతన।
బరగుదీనికి జాగ్రదవస్థ తాసె।
యిదియనుచు జీవుడొందు బాహ్యేంద్రియముల।
వలన స్రక్చందనస్త్ర్యాది వస్తుసమితి॥ ౯౧॥

తే గీ॥ కానజాగ్రదవస్థ నికరముగదోచు।
చుండునిటనీశరీరంబు నండగొనియె।
జరుగుబురుషుని బాహ్యసంసారమెల్ల।
గృహికిగృహమట్లుదేహికి నిదియుదనరు॥ ౯౨॥

శ్లో॥ స్థూలస్యసంభవజరామరణానిధర్మాః।
స్థౌల్యాదయోబహువిధాశ్శిశుతాద్యవస్థాః।
వర్ణాశ్రమాదినియమాబహుధామయాస్స్యుః।
పూజావమానబహుమానముఖావిశేషాః॥ ౯౩॥

సీ॥ పుట్టుటముదియుటపొలియుటయనునవి పోతరించుటచిక్కిపోవుటయును
మున్నగునవియును చిన్నతనంబుజవ్వనము వార్ధకముఖావస్థలవియు।
బ్రాహ్మణాదికవర్ణభావముల్బ్రహ్మచర్యాదికాశ్రమధర్మభేదములును
పలుతెఱంగులరోగములునదువళ్లనుబూజింపబడుటయుభోగియగుట

తే-గీ॥ యొరులచేనవమానంబు నొందుటయును।
మెప్పులొందుట సొంపు పెంపొప్పుటయును।

నట్టివెల్లనుస్థూలదేహస్వభావ।
ధర్మములువినీనీవిగా దలపబోకు॥ ౯౩॥

శ్లో॥ బుద్ధీంద్రియాణి శ్రవణంత్వగక్షి।
ఘ్రాణంచజిహ్వా విషయావబోధనాత్।
వాక్పాణి పాదా గుదమప్యుపస్థః।
కర్మేంద్రియాణి ప్రవణేనకర్మసు॥ ౯౪॥

తే.గీ॥ కనులుచెవులునుత్వక్కు నాలుకయును నాస।
యివివిషయబోధకములు జ్ఞానేంద్రియములు।
పదములుకరంబులును వాక్కుగుదముపస్థ।
యివ్వికర్మంబుసేత కర్మేంద్రియములు॥ ౯౪॥

శ్లో॥ నిగద్యతేఽంతఃకరణం మనోధీ।
రహంకృతిశ్చిత్తమితిస్వవృత్తిభిః॥౯౫॥

తే.గీ॥ దానివృత్తులబట్టి యంతఃకరణము।
నొక్కటిసెనాలుగుగనెంచు చుంద్రుబుధులు।
మనసుబుద్ధియు జిత్తము మఱియహంకృ।
తియనివానికి బేర్లుసుధీవిచార॥ ౯౫॥

శ్లో॥ మనస్తుసంకల్ప వికల్పనాదిభి।
ర్బుద్ధిఃపదార్థా ధ్యవసాయధర్మతః॥ ౯౫॥
అత్రాభిమానా దహమిత్యహంకృతి।
స్స్వార్థానుసంధాన గుణేనచిత్తం॥ ౯౫॥

క॥ మనమగుసంకల్ప వికల్పనములచే బుద్ధియగును వస్తువిమర్శన్।
తను వేసగనహంకృతి। ఘనవిషయధ్యానమొందగాజిత్తమగున్॥౯౬॥

శ్లో॥ ప్రాణాపానవ్యానోదాన సమానాభవత్యసౌప్రాణః।
స్వయమేవవృత్తిభేదాద్వికృతేర్భేదాత్సువర్ణసలిలవత్॥ ౯౬॥

క॥ ప్రాణింబాకఁటియయ్యుం । గానంబడుఁబసిడిసీటికై వడివిక్రుతిం।
బ్రాణాపానవ్యానో।దానసమానంబులగుచు దనవృత్తులచేఁ॥ ౯౭॥

శ్లో॥ వాగాదిపంచ శ్రవణాదిపంచ।
ప్రాణాదిపంచా భ్రముఖానిపంచ।
బుద్ధ్యాద్యవిద్యాపిచ కామకర్మణీ।
పుర్యష్టకంసూక్ష్మ శరీరమాహుః॥ ౯౭॥

శ్లో॥ఇదంశరీరంశ్రుణుసూక్ష్మసంజ్ఞితం।లింగంత్వపంచీకృతభూతసంభవం।
సవాసనంకర్మ ఫలానుభావకం। స్వాజ్ఞానతోఽనాదిరుపాధిరాత్మనః॥౯౮॥

సీ॥ వాక్పాణిపదగుదోపస్థలు చెవికన్ను - నాసనాలుక త్వకఁనంగ
నైదు। ప్రాణంబపానంబు వ్యానంబుదానస-మానంబులను నైదుమఱియు
నాకాసంబుగాలియు నగ్గిజలమిలయను నైదు-మనసుబుద్ధియహంకరణము
చిత్త। మనునాల్గునునవిద్యయును కామమునుగర్మ- మనునివిచేరిసూక్ష్మం
గమనకు॥

తే.గీ॥ బురములెనిమిది యందురు బుధులిదియును।
పాళులుగ జేరకుండు భూతాళివలన।
బుట్టుతొలివాసనలతోడ. బురుషుడిందె।
కర్మఫలమొందుచుండు నజ్ఞానమునను॥ ౯౮॥

క॥ ఇదెలింగదేహమిదియే। కదయాత్మకుమఱువవలన గలిగినమూలం।
బాదవనియుపాధిదీనం। బాదలుచుస్వప్నంబులొందు బురుషుండెపుడుణ్॥।

శ్లో॥ స్వప్నోభవత్యస్యవిభక్త్యవస్థా స్వమాత్రశేషేణ విభాతియత్ర
స్వప్నేతుబుద్ధి స్స్వయమేవజాగ్రత్ కాలీననానావిధవాసనాభిః॥

తే.గీ॥ దీనికి నవస్థ స్వప్నమే దీనియందు।
బుద్ధియొకఁటెమిగిలితా మును మెలకువ।

యందుబూచిన పలువిషయములదలచు।
కొనుచుదనయంత దానె పెల్లొందుచుండు॥ ౧౦౦॥

శ్లో॥ కర్త్రాదిభావం ప్రతిపద్యరాజతే।
యత్రస్వయం జ్యోతిరయంపరాత్మా।
ధీమాత్రకోపాధి రశేషసాక్షీ।
నలిప్యతేతత్కృత కర్మలేశైః॥ ౧౦౦॥

ఆ-వె॥ ఇయ్యవస్థయందు నే గర్తనేభోక్త।
ననుచువెల్గుబుద్ధి నాపరాత్మ।
తానె దానసిలిచి తాసర్వసాక్షియై।
దానిపనులనతడు తగులుబడడు॥ ౧౦౧॥

శ్లో॥ యస్మాదసంగస్తత ఏవకర్మభి।
ర్నలిప్యతేకించిదుపాధినాకృతైః॥ ౧౦౪॥
సర్వవ్యాపృతికరణం లింగమిదంస్యా చ్చిదాత్మనఃపుంసః।
వాశ్యాదికమివతక్ష్ణస్తేనైవాత్మాభవత్యసంగోఽయం॥ ౧౦౧॥

ఆ-వె॥ తానసంగుడగుట తగుల డుపాధిచే।
నైనకర్మముల రవంతయయిన।
వానినెల్లజూచు వాడౌటనేయాత్మ।
తానసంగుడయ్యె భానువట్లు॥ ౧౦౭॥

ఆ-వె॥ వడ్లవానికులియు బాడిసెమున్నగు।
వానియట్లు తగులుబడక యెపుడు।
తెలివియైనపురుషు డెలమినిపనులెల్ల।
సలుపలింగమిది యె సాధనంబు॥ ౧౦౮॥

శ్లో॥ అంధత్వమందత్వ పటుత్వధర్మాః।
స్సౌగుణ్యావైగుణ్యవ శాద్ధిచక్షుషః।

బాధిర్యమూకత్వ ముఖా స్తదైవ।
శ్రోత్రాదిధర్మా నతువేత్తు రాత్మనః॥ ౧౦౨॥
ఉఛ్వాసనిశ్వాస విజృంభణక్షుత్
ప్రస్యందనాద్యుత్క్రమణాది కాః క్రియాః।
ప్రాణాదికర్మాణి వదంతి తజ్ఞాః।
ప్రాణస్యధర్మా వశనాపిపాసే॥ ౧౦౩॥
అంతఃకరణమేతేషు చక్షురాదిషువర్ష్మసు।
అహమిత్యభిమానేన తిష్ఠత్యాభాస తేజసా॥ ౧౦౪॥

సీ॥ కానరామియుమందగతి పటుత్వము నేత్ర - ములకగు గుణదోష ములుపొసగిన। చెవుడుమూకత్వమిట్టివి యెల్లశ్రోత్రాది-ధర్మముల్దెలియు నాత్మకివిగలుగ। వూపిరితిరుగుటయును తుమ్ముటావులిం - చుటకదలుట వెడలుటమొదలుగ। ప్రాణాదికార్యంబు లంద్రుబుధుల్ప్రాణ-ధర్మంబులాకలి దప్పిగొనుట॥

తే॥ గీ॥ కనులు మొదలగు నీచోట్లనెనసి యందు।
ప్రతిఫలించిన వెలుగుతో జతనుగూడి।
నేనునాయదియను నభిమానమునను।
పొలుచునంతఃకరణమని తెలియుమయ్య॥ ౧౦౪॥

శ్లో॥ అహంకారస్సవిజ్ఞేయః కర్తాభోక్తాభిమాన్యయం।
సత్వాదిగుణయోగేన చావస్థాత్రయమశ్నుతే॥ ౧౦౫॥

తే-గీ॥ చేయువాడను నేను నాచేసినదది।
కుడుచుచుండుదు నేననుకొనుచునుండు।
నదియహంకృతియది యెసత్వాదిగుణము।
లొందిమూటినవస్థల నెందుచుండు॥ ౧౦౫॥

శ్లో॥ విషయాణాం సమానత్వే సుఖీ దుఃఖీ విపర్యయే।
సుఖం దుఃఖం చ తద్ధర్మః సదానందస్య నాత్మనః॥ ౧౦౬॥

తే.గీ॥ విషయములు లెస్సగా నబ్బు వేళ సుఖియు।
నబ్బకుండిన దుఃఖియు నగు మెయి గుసు।
ఖంబు దుఃఖంబు దానిధర్మంబు లెప్పుడు।
నాసుఖాత్మకుడగు నాత్మ నంట వెవియు॥ ౧౦౬॥

శ్లో॥ ఆత్మార్థత్వేన హి ప్రేయాన్ విషయో న స్వతః ప్రియః।
స్వత ఏవ హి సర్వేషామాత్మా ప్రియతమో యతః॥ ౧౦౭॥

తే॥ గీ॥ ఆత్మకొఱకొట నే విషయంబు ప్రియము।
విషయమది తాన ప్రియమయి వెలయ దెందు।
గాన నాత్మ తనంతట తానె సకల।
మునకు మిక్కిలి ప్రియుడనజనును గాదె॥ ౧౦౭॥

శ్లో॥ తత ఆత్మా సదానందో నాస్య దుఃఖం కదాచన।
యత్సుషుప్తౌ నిర్విషయ ఆత్మానందోఽనుభూయతే॥ ౧౦౮॥

తే.గీ॥ అగుట నాత్మ సదానందుడతని కెపుడు।
దుఃఖమింతయు లేదు నిద్దురను జూడు।
విషయములదాసి తనయంత వెలయుచుండు।
నాత్మసౌఖ్యమె యనుభవ మగుట తెలియు॥ ౧౦౮॥

శ్లో॥ శ్రుతిః ప్రత్యక్షమైతిహ్యమనుమానం చ జాగ్రతి॥ ౧౦౯॥

తే.గీ॥ ఆగమంబులు సెప్పెదు నవియు నింద్రి।
యంబులెతిగెడు నవి వ్యవహారమందు।
వాడుకైనవి యూహించ వచ్చునవియు।
నీయవస్థలయనుభవ మంబెఱుక పఱుచు॥ ౧౦౯॥

శ్లో॥ అవ్యక్తనామ్నీ పరమేశశక్తి రనాద్యవిద్యాత్రిగుణాత్మికాపరా।
కార్యానుమేయాసుధియైవ మాయా యయాజగత్సర్వమిదంప్రసూయతే॥ ౧౦౯॥

తే-గీ॥ మొదలులేకుండు తెలివిమి మూడుగుణము।
లైయుండునది స్వకార్యములవలన।
ప్రజ్ఞనూహించనైన దీశ్వరునిశక్తి।
మాయ యవ్యక్తమిదె జగన్మాతయిదియె॥ ౧౧౦॥

శ్లో॥ సన్నాప్యసన్నాప్యుభయాత్మికానో।
భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికానో।
సాంగాప్యనంగాప్యుభయాత్మికానో।
మహాద్భుతానిర్వచనీయరూపా॥ ౧౧౦॥

తే-గీ॥ ఉండునది లేనిదియు నుండియుండనిదియు।
వేఱదియటుకానిదీ రెంటిబెరసినదియు।
నవయవియునిరవయవియు నాయుభయము।
గాకకడుచిత్రమై చెప్పరాకయుండు॥ ౧౧౧॥

శ్లో॥ శుద్ధాద్వయబ్రహ్మ విబోధనాశ్యా।
సర్పభ్రమోరజ్జు వివేకతోయథా।
రజస్తమస్సత్వ మితిప్రసిద్ధా।
గుణాస్తదీయాః ప్రథితైస్స్వకార్యైః॥ ౧౧౮॥

తే-గీ॥ రెండవదిలేక చేటమైయుండునట్టి।
బ్రహ్మమెఱిగిననిదిమాయ త్రాటినెఱుగ।
సర్పమనుభ్రమవలె రజస్సత్వతమము।
లన్నికార్యంబులును దీనిచిన్నెలయ్యె॥ ౧౧౨॥

శ్లో॥ విక్షేపశక్తీరజసః క్రియాత్మికా।
యతఃప్రవృత్తిః ప్రసృతాపురాణీ।
రాగాదయోఽస్యాః ప్రభవంతినిత్యం।
దుఃఖాదయో యే మనసోవికారాః॥ ౧౧౨॥

తే-గీ॥ దేనిచేసంసృతియనాదిగా నెఱసెడి।
దేనబొడము రాగాధులు మానసికము।
లైనదుఃఖాదు లెప్పుడున దెరజొగు।
ఆక్రియాత్మిక విక్షేపనామశక్తి॥ ౧౧౩॥

శ్లో॥ కామఃక్రోధో లోభదంభాద్యసూయా।
హంకారేర్ష్యా మత్సరాద్యాస్తుఘోరాః।
ధర్మాఏతేరాజసాః పుంప్రవృత్తి।
ర్యస్మాదేషాతద్రజో బంధహేతుః॥ ౧౧౩॥

ఉ॥ ఘోరములైనకామమును క్రోధములోభముదంభమీసహం।
కారమసూయమత్సర ముఖంబులురాజసవృత్తిదాల్చునా।
కారములివ్విపూరుషుని గ్రచ్చరసంసృతిద్రిప్పుచుండుసం।
సారపుకట్టుపుట్టుటరజస్సు బలంబుననేయిదింతయున్॥ ౧౧౪॥

శ్లో॥ ఏషావృతిర్నామ తమోగుణస్య।
శక్తిర్యయావస్త్వవ భాసతేఽన్యథా।
సైషానిదానం పురుషస్యసంసృతే।
ర్విక్షేపశక్తేః ప్రవణస్య హేతుః॥ ౧౧౪॥

తే-గీ॥ మఱియునావరణంబు తమస్సుశక్తి।
దీనిచేవస్తువితరమై కానబడును।
పురుషసంసార మునకిదేమూలమిందు।
సక్తుదౌల్లె విక్షేపశక్తిగుణము॥ ౧౧౫॥

శ్లో॥ ప్రజ్ఞావానపి పండితోఽపి చతురోఽప్యత్యంతసూక్ష్మాత్మద।
గ్వ్యాలీఢస్తమసా న వేత్తి బహుధా సంబోధితోఽపి స్ఫుటం।
భ్రాంత్యారోపితమేవ సాధు కలయత్యాలంబతే తద్గుణాన్।
హంతాసౌ ప్రబలా దురంత తమసశ్శక్తిర్మహత్యావృతిః॥ ౧౧౬॥

చ॥ చదువరిబుద్ధిశాలి నెఱజాణయు సూక్ష్మశరాత్మవేత్తయై।
పొదలియు నీతమోగుణము బొందినదోనరు డెంత చెప్పినన్।
వదలక భ్రాంతిగానబడు వానినె నిక్కమటంచు నెంచు నం।
తదియొగదా మహాప్రబలమావృతి తామసశక్తియక్కటా॥ ౧౧౬॥

శ్లో॥ అభావనా వా విపరీతభావనా। సంభావనా విప్రతిపత్తిరస్యాః।
సంసర్గయుక్తం న విముంచతి ధ్రువం। విక్షేపశక్తిః క్షపయత్యజస్రం॥

తే.గీ॥ తోపమియు వేఱురీతిగా దోచుటయును।
తోచియును తోపకుండుట దొడరివిడువ।
దావృతిని జిక్కినట్టి మహాత్ము నెపుడు।
జెఱచు నాతనివృత్తి విక్షేపశక్తి॥ ౧౧౭॥

శ్లో॥ అజ్ఞాన మాలస్య జడత్వనిద్రా।
ప్రమాదమూఢత్వ ముఖాస్తమోగుణాః।
ఏతైః ప్రయుక్తో నహి వేత్తి కించి।
న్నిద్రాళువత్ స్తంభవదేవతిష్ఠతి॥ ౧౧౮॥

చ॥ ఎఱుగమి జాగు మొద్దుతన మెకుఱుడు నిద్ర విమూఢభావమున్।
మఱపును నిట్టివన్నియు తమస్సుగుణంబులు వీనిగూడినం।
గుఱు తెఱుగండొకింతయును కూచమువ్రీసిన నిద్దురించు న।
త్తెఱగున నుండు మానవుడు దీనిదురంతమహత్త్వమెట్టిదో॥ ౧౧౮॥

శ్లో॥ సత్వంవిశుద్ధంజలవత్తథాపి। తాభ్యాంమిళిత్వాశరణాయకల్పతే।
యత్రాత్మబింబః ప్రతిబింబితస్సన్। ప్రకాశయత్యర్క ఇవాఖిలం
జడం॥ ౧౧౯॥

తే-గీ॥ నీటివలెసత్వమెప్పుడు తేటయయ్యు।
మిగులు రెంటిని గలసి తానగును పాధి।
యందుబ్రతిఫలితంబయి యాత్మబింబ।
మర్కుపోలికజడమెల్ల నలరజేయు॥ ౧౧౯॥

శ్లో॥ మిశ్రస్యసత్వస్య భవంతిధర్మాః। స్త్వమానితాద్యానియమాయమాద్యాః। శ్రద్ధాచభక్తిశ్చ ముముక్షుతాచ। దైవీచసంపత్తి
రసన్నివృత్తిః॥ ౧౨౦॥

శ్లో॥ విశుద్ధసత్వస్య గుణాః ప్రసాదః। స్వాత్మానుభూతిః పరమాప్రశాంతిః। తృప్తిఃప్రహర్షః పరమాత్మనిష్ఠా। యయాసదానంద
రసంసమృచ్ఛతి॥ ౧౨౧॥

సీ॥ ఇమ్మిశ్రసత్వగుణమ్ముధర్మములుని - ర్గర్వితమొదలుగా గలవియును
య। మాదులన్నియమంబు లశిభక్తిశ్రద్ధయు - మోక్షేచ్ఛ య
జ్ఞానమునువదలుట। దైవసంపత్తియునావిశ్రుతంబులు - సత్వంబు
శుద్ధమై సాగెనేని। చిత్తంబునిలకడ చెడనిస్వానుభవంబు - తృప్తి
సంతసము హృద్వృత్తిశాంతి॥

తే-గీ॥ నిర్మలానందపీయూష నిత్యధార।
నొసగుబరమాత్మనిష్ఠయు నుత్తమార్థ।
దాయకములగునీయెల్ల ధర్మములును।
దనరుగాపున సత్వశుద్ధినిపొనర్చు॥ ౧౨౦॥

శ్లో॥ అవ్యక్తమేతత్త్రిగుణైర్నిరుక్తం । తత్కారణంనామ శరీరమాత్మనః । సుషుప్తిరేతస్య విభక్త్యవస్థా । ప్రలీనసర్వేంద్రియబుద్ధివృత్తిః॥ ౧౨౨॥

తే-గీ॥ వరుసగుణములు మూటవవ్యక్తమిప్పు।
తెలుఁగజెప్పితినాత్మకు నిదియె కార।
ణంబనుశరీర మింద్రియంబులెల్ల।
ప్రజ్ఞనణగుటయగు నిద్రరయెయవస్థ॥ ౧౨౮॥

శ్లో॥ సర్వప్రకార ప్రమితప్రశాంతి ర్బీజాత్మనావస్థితి రేవబుద్ధేః।
సుషుప్తిరేతస్యకిలప్రతీతిః కించిన్నవేద్మీతిజగత్ప్రసిద్ధేః॥ ౧౨౩॥

తే.గీ॥ అన్నితెఱగుల తెలియుట లణచిక్రమింగి।
బుద్ధియొకవిత్తనంబును బోలియుండు।
టదియెలోకులు నిద్దురయందురిందు।
నేమియునెఱుంగననుటంద తెఱఁగివదియె॥ ౧౨౬॥

శ్లో॥ దేహేంద్రియప్రాణ మనోఽహమాదయ।
స్సర్వేవికారా విషయాస్సుఖాదయః।
వ్యోమాదిభూతా న్యఖిలంచవిశ్వ।
మవ్యక్తపర్యంత మిదంహ్యనాత్మా॥ ౧౨౪॥

ఉ॥ అంగమునింద్రియంబులును ప్రాణమనస్సులహంక్రియాదులి।
మ్ముంగలవిక్రియల్ విషయము ల్సుఖదుఃఖగణంబువ్యోమమా।
దింగలభూతముల్నిఖిలదృశ్యము విశ్వముమాయదాకయీ।
యంగుసర్వముంజనునవాత్మ యనన్విశరింపనేర్పునన్॥ ౧౩౩॥

శ్లో॥ మాయామాయాకార్యం మహదాదిదేహపర్యంతం।
అసదిదమనాత్మకత్వం విద్ధిత్వంమరుమరీచికాకల్పం॥ ౧౨౫॥

తే-గీ॥ మాయయయునుసట్టి మాయచే జేయబడిన।
దగుమహత్తుమొదల్దేహ మంతముగను।
సకలమునవాత్మ యీసమస్తంబుకల్ల।
యెండమావులవంటిది యెఱుగుమయ్య॥ ౧౨౪॥

శ్లో॥ అథతేసంప్రవక్ష్యామి స్వరూపంపరమాత్మనః।
యద్విజ్ఞాయనరోబంధా న్ముక్తఃకైవల్యమశ్నుతే॥ ౧౨౬॥

కం॥ వరగుణ నీకికజెప్పెద। పరమాత్మనిజస్వరూప భావమునిదియే।
నరుడెఱుగువాడెబంధం। బురువడిదెగనడికి ముక్తినొందుధ్రువ
ముగన్॥ ౧౨౫॥

శ్లో॥ అస్తికశ్చిత్స్వయంనిత్య మహంప్రత్యయాలంబనః।
అవస్థాత్రయసాక్షీస త్పంచకోశవిలక్షణః॥ ౧౨౭॥

క॥ కలడొకడుతానెనిరతము। వెలయున్నేననెడు గుఱుతువెంబడిచూచున్।
మెలకువకలనిద్దురలను। కలగడుకోశంబులైదుగాకవెలుంగున్॥౧౨౬॥

శ్లో॥ యోవిజనాతిసకలం జాగ్రత్స్వప్నసుషుప్తిషు।
బుద్ధితద్వృత్తిసద్భావ మభావమహమిత్యయం॥ ౧౨౮॥

తే-గీ॥ బుద్ధియునుదానిచేష్టలు పొలుచుచుంట।
మెలకువనుగలనిద్దుర దెలియునఖిల।
మవియెవియులేకయుంటె తానగుచునుండు।
నదియెయీబ్రహ్మమదియె నిత్యంబెఱుంగు॥ ౧౨౭॥

శ్లో॥ యఃపశ్యతిస్వయంసర్వం యంనపశ్యతి కశ్చన।
యశ్చేతయతిబుద్ధ్యాది నతద్యంచేతయత్యయం॥ ౧౨౯॥

క॥ ఎవడన్నిటిదాగనుగాను। నెవనింగనజాలకుండు నెయ్యదియునుతా।
నెవడిచ్చుంజేష్టబుద్ధ్యా। ద్యనయములకెవని కీయ్యవియేచేష్టన్॥ ౧౨౮

శ్లో॥ యేనవిశ్వమిదంవ్యాప్తం యంనవ్యాప్నోతికించన।
ఆభారూపమిదంసర్వం యంభాంతమనుభాత్యయం॥ ౧౩౦॥

ఆ-వె॥ ఎవడునిండియుండు నీవిశ్వమెల్లనె।
య్యదియునెవనియందు వ్యాప్తిఁ జెంద।
దిద్దియెల్లఁబూడ నెద్దానిఁ బోల్చెడ।
యిదివెలుంగు మందు నెదివెలుంగ॥ ౧౨౯॥

శ్లో॥ యస్యసన్నిధిమాత్రేణ దేహేంద్రియమనోధియః।
విషయేషుస్వకీయేషు వర్తంతేప్రేరితాఇవ॥ ౧౩౧॥

తే-గీ॥ ఏదిదగ్గరి యున్నంతనీశరీర।
మునుసమస్తేంద్రియంబులు మనసుబుద్ధి।
ప్రేరితంబులపోలిక ధృతినొనర్చు।
తమపనులనెల్లనదియె బ్రహ్మమని తెలియు॥ ౧౩౦॥

శ్లో॥ అహంకారాదిదేహాంతా విషయాశ్చసుఖాదయః।
వేద్యంతేఘటవద్యేన నిత్యబోధస్వరూపిణా॥ ౧౩౨॥

క॥ నేననునదిమొదలుతనీ। మేనిదనుకతోచునవియు మించువిషయసం।
తానము సుఖాదు లేడపని। జ్ఞానంబగునెవడెఱుంగు ఘటములబోలెన్॥

శ్లో॥ ఏషోఽంతరాత్మా పురుషఃపురాణో।
నిరంతరాఖండ సుఖానుభూతిః।
సదైకరూపః ప్రతిబోధమాత్రో।
యేనేషితావాగ సవశ్చరంతి॥ ౧౩౩॥

తే-గీ॥ అట్టియీయంతరాత్మ మహాపురాణు।
పురుషుడెప్పుడునఖండ సౌఖ్యరసమయుడు।
శుద్ధచిన్మాత్రుడేకరూపుడు సుస్థిరుండు।
నితడుప్రేరికొల్ప వాక్ప్రాణతతులుజర్గు॥ ౧౩౨॥

శ్లో॥ అత్రైవసత్త్వాత్మ నిధీగుహాయామవ్యాకృతాకాశ ఉశత్ప్రకాశః।
ఆకాశఉచ్చైరవివత్ప్రకాశతే । స్వతేజసావిశ్వమిదం ప్రకాశయన్॥

ఉ॥ ఇందవిశుద్ధసత్త్వగుణవృత్తిదనర్చినబుద్ధియన్ గుహం।
జెందినశుద్ధధిగ్గగన సీమనుజొచ్చి వెలుంగుచుండుమిం।
టుందనయంత వెల్గుదినసాధుని పోలికవిశ్వమంతయుం।
గ్రందగుస్వప్రకాశమునగ్రాలగ జేయుచునాత్మనిత్యముః॥౧౩౩॥

శ్లో॥ జ్ఞాతామనోఽహంకృతివిక్రియాణాం।
దేహేంద్రియప్రాణకృతక్రియాణాం।
అయోఽగ్నివత్తాననువర్తమానో।
నచేష్టతేనో వికరోతికించన॥ ౧౩౪॥

తే-గీ॥ అగ్నియినుమును జేరినయట్టులాత్మ।
రహంమనోఽహంకృత్తుల వికారములనువపు।
రింద్రియప్రాణములు సేయునెల్లపనుల।
చేరి మెఱుగుఁజలింపదు చెడదుఁ రవయు॥ ౧౩౫॥

శ్లో॥ నజాయతేనో మ్రియతే నవర్ధతే నక్షీయతేనో వికరోతినిత్యః।
విలీయమానేఽపివపుష్యముష్మిన్నలీయతే కుంభ ఇవాంబరస్స్వయం॥

ఆ-వె॥ జననియుమృతియు వృద్ధిక్షయమువికారంబు।
లేకనిత్యుడగుచు లీలనుండు।
పొలియడితడుతనువు పొలిసినగడవబో।
నడవనాకసంబు చెడనియట్లు॥ ౧౩౬॥

శ్లో॥ ప్రకృతివికృతిభిన్నశ్శుద్ధ బోధస్వభావ।
స్సదసదిదమశేషం భాసయన్నిర్విశేషః।
విలసతిపరమాత్మా జాగ్రదాదిష్వవస్థా।
స్వహమహమితి సాక్షాత్సాక్షిరూపేణబుద్ధేః॥ ౧౩౭॥

క॥ ప్రకృతికి వికృతికి వేత్తె। యకలంకజ్ఞానమూర్తియై యీసదస।
త్సకలము పరమాత్ముఁడు దా।నొకఁడే వెలుఁగొంద జేయుచుండు నెఱియుమా॥

క॥ విలసిల్లుచుండునితఁడే। మెలకువఁగల నిద్రయందు మించి మతికిన।
వ్వలసాక్షి రూపుఁడై తా। నెలకొని ప్రత్యక్షముగను నే నేననుచున్॥

శ్లో॥ నియమితమనసాముంత్వం స్వమాత్మానమాత్మ।
న్యయమహమితి సాక్షాద్విద్ధిబుద్ధి ప్రసాదాత్।
జనిమరణతరంగాపారసంసారసింధుం।
ప్రతరభవకృతార్థో బ్రహ్మరూపేణసంస్థః॥ ౧౩౮॥

చ॥ మనసును నిల్పి నిర్మలతమంబగు బుద్ధిని బొంది వేటగా।
గనుఁగొనుమిద్ది నేననియఖండ పరాత్మ నెసీదు రూపుగా।
ఘనిశముజన్మమృత్యువులనంతములేని భవాంబురాశి చ।
య్యనగడ తేరి బ్రహ్మపదమంది కృతార్థుఁడవౌదు పుత్రకా॥ ౧౩౮॥

శ్లో॥ అత్రానాత్మన్యహమితి మతిర్బంధఏషోఽస్యపుంసః।
ప్రాప్తోఽజ్ఞానాజ్జననమరణ క్లేశసంపాతహేతుః।
యేనైవాయంవపురిద మసత్సత్యమిత్యాత్మబుద్ధ్యా।
పుష్యత్యుక్షత్యవతివిషయై స్తంతుభిఃకోశకృద్వత్॥ ౧౩౯॥

ఆ-వె॥ ఇయ్యనాత్మయందు నేననుబుద్ధియే।
జననమరణదుఃఖ జాలమునను।
బురుషుద్రోయుబంధ మురువడిదన్నుదా।
నెఱుఁగమినిజనించు నిదియువినుము॥ ౧౩౯॥

చ॥ పురుషుడు దీనజిక్కి నిజ బుద్ధిసత్తగ్నసీశరీరమున్।
దిరమని యెంచి పెంచుచు నతిస్థిరుఁడై పరిరక్ష సేయుచున్।
ధరబిసి గాయాపుఱ్ఱు తన తంతువులందు నెచికుఱనట్లు దు।
స్తరవిషయంబులందగిలి తావిషపించ్చుకొనంగఁ బోడిలన్॥ ౧౪౦॥

శ్లో॥ అతస్మిన్ స్తద్బుద్ధిః ప్రభవతి విమూఢస్యతమసా।
వివేకాభావాద్వైస్ఫురతి భుజగేరజ్జుధిషణా।
తతోఽనర్థవ్రాతోనిపతతి సమాధాతురధిక।
స్తతోయోఽసద్గ్రాహస్సహి భవతిబంధశ్శృణుసఖే॥ ౧౪౦॥

తే.గీ॥ తండ్రివినుమయ్య యదిగానిదానియందు।
నదియెనెడుబుద్ధి తాఁబుటియందహిసిబోలి।
యెఱుకలేమిని తమసున హీనమతికి।
బొడము నంత ననర్థములొప్పసగుచుండు॥ ౧౪౧॥

క॥ సవరింపనోపరానిది। యవివేకమువలన బుట్టునట్టియనర్థం।
బవునిదియెయసత్తనుసురి। యవిశీర్ణంబైన బంధమనని దెసుమీ॥ ౧౪౨

శ్లో॥ అఖండనిత్యాద్వయ బోధశక్త్యా।
స్ఫురంతమాత్మాన మనంతవైభవం।
సమావృణోత్యా వృతిశక్తిరేషా।
తమోమయీరాహురి వార్కబింబం॥ ౧౪౧॥

మ॥ ఒకటైనిత్యమువైభిదారహితమై యుద్దీప్తబోధాకృతిన్।
బ్రకటంబౌతనశక్తిచేవెలుగు నాబ్రహ్మంబునీతామస।
ప్రకృతింగల్గినయావృతిప్రథిత నుంభచ్ఛక్తిక ప్పున్ మహా।
త కుడౌసూర్యునిరాహువట్లధిక మాదర్పంబుచే నేర్పునన్॥౧౪౩॥

శ్లో॥ తిరోభూతేస్వాత్మ న్యమలతర తేజోవతిపుమాం।
ననాత్మానంమోహాదహమితి శరీరంకలయతి।
తతఃకామక్రోధప్రభృతి భిరమంబంధనగుణైః।
పరంవిక్షేపాఖ్యారజస ఉరుశక్తిర్వ్యథయతి॥ ౧౪౪॥

చ॥ అమలతరద్యుతిందనరు స్వాత్మనునావృతికప్పినంతనే।
భ్రమపడియయ్యనాత్మయగు భగ్త్రిక దేహముదానటంచుని।

త్యము బురుషుం డెదందలచు నంతటనాతని గామముఖ్యబం।
ధములరజః ప్రభూతమగు దారుణశక్తికలంచు నెవ్వగన్॥ ౧౪౪॥

శ్లో॥ మహామోహగ్రాహగ్రసనగళితాత్మావగమనో।
ధియోనానావస్థాంస్వయ మభినయం స్తద్గుణలయా।
అపారేసంసారేవిషయ విషపూరేజలనిధౌ।
నిమజ్జ్యోన్మజ్జ్యాయంభ్రమతి కుమతిఃకుత్సితగతిః॥ ౧౪౩॥

క॥ కడుబలమైన మోహమను గ్రాహముమ్రింగిన నాత్మ తెల్వితో।
విడిచిమతిస్థితుల్ దనదు వృత్తులుగాగొని యాడుచున్ ధృతిన్।
విడి విషయాఖ్యమా విషము నిండినసంస్కృతిసాగరంబునన్।
మునిగిబయల్ మహావ్యధమునుంగుచు దేలుచునుండు దుర్గతిన్॥

శ్లో॥ భానుప్రభా సంజనితాభ్రపఙ్క్తిః।
ర్భానుంతిరోధాయ విజృంభతేయథా।
ఆత్మోదితాహంకృతిరాత్మతత్త్వం।
తథాతిరోధాయ విజృంభతే స్వయం॥ ౧౪౪॥

తే-గీ॥ అరుణకరములఁబుట్టిన యభ్రపఙ్క్తి।
యరుణు గప్పివిజృంభించు నట్టులాత్మ।
బుట్టినయహంకృతియు నాత్మనట్లె పుట్టి।
మఱుగుపఱచి విజృంభించి మలయుదాను॥ ౧౪౬॥

శ్లో॥ కబళితదిననాథే దుర్దినేసాంద్రమేఘై।
ర్వ్యథయతిహిమ ఝంఝూవాయు రుగ్రోయథైతాన్।
అవిరత తమసాత్మన్యావృతే మూఢబుద్ధిం।
క్షపయతి బహుదుఃఖై స్తీవ్రవిక్షేపశక్తిః॥ ౧౪౫॥

తే-గీ॥ కాఱుమొగులు రవిఁబట్టి కప్పియుండ।
వానిబెన్నంచుగాలిచే వ్యాకులతనొట్టు।

లాత్మనుతమస్సువిడువక యావరింప।
జిమ్ముజడబుద్ధి వెతలవిక్షేపశక్తి॥ ౧౪౭॥

శ్లో॥ ఏతాభ్యామేవ శక్తిభ్యాం బంధః పుంసస్స మాగతః।
యాభ్యాంవిమోహితో దేహం మత్వాత్మానంభవత్యయం॥ ౧౪౮

తే-గీ॥ పురుషునకెప్పుడునుండు నావరణశక్తి।
చెదరజిమ్ముచునుండు విక్షేపశక్తి।
తనరెండు రెంట బంధమాతనికి వీని।
వలనిభ్రమ తాను తనువని తలచునతడు॥ ౧౪౮॥

శ్లో॥ బీజంసంసృతి భూమిజస్య తుతమో దేహాత్మధీ రంకురో।
రాగః పల్లవమంబు కర్మతువపుస్స్కంధోఽసవశ్శాఖికాః।
అగ్రాణీంద్రియ సంహతిశ్చ విషయాః పుష్పాణిదుఃఖంఫలం।
నానాకర్మ సముద్భవం బహువిధం భోక్తాత్రజీవఃఖగః॥ ౧౪౯॥

సీ॥ సంసారమనెడు వృక్షముబుట్టుటకు విత్తనముతన్నా వా నెఱుంగమి
యెసుమ్మ। దానిమోసగుమేను నేననుకొనుటయె యది వలచుట
యె మారాకుచిగురు। నీళ్లుకర్మము ప్రాణి నిలువు శరీరంబు కొమ్మ
తైయుండు ప్రాణమ్ములెల్ల। కొసలింద్రియంబులు కుసుమముల్
విషయంబు లిట్టివిచిత్రమౌ చెట్టునందు॥

తే-గీ॥ పలుతెఱంగులకర్మముల్ పక్వములయి।
పలురుచులుగల్గు దుఃఖమన్పండుపండు।
నాతరువుజేరియుండెడు నట్టిజీవు।
డనెడుపక్షియె యాపండు దినుచునుండు॥ ౧౪౯॥

శ్లో॥ అజ్ఞానమూలోఽయమనాత్మబంధో।
నైసర్గికోఽనాదిరనంత ఈరితః।

జన్మాద్య వ్యాధిజరాదిదుఃఖ।
ప్రవాహపాతం జనయత్యముష్య॥ ౧౪౮॥

తే-గీ॥ అవిద్యసజ్ఞానమున నీయునాత్మబంధ।
మనిస్వభావజమాద్యంత హీనమందు।
తిరిగి జననమృతి వ్యాధుల మదిమిమొదలు।
దుఃఖములవెల్లువను వీనిద్రోసియీద్చు॥ ౧౫౦॥

శ్లో॥ నాస్త్రైర్నశస్త్రైరనిలేనవహ్నినా।
ఛేత్తుంనశక్యో నచకర్మకోటిభిః।
వివేకవిజ్ఞాన మహాసినావినా।
ధాతుఃప్రసాదేన శితేనమంజునా॥ ౧౪౯॥

తే-గీ॥ అస్త్రములశస్త్రముల ననిలానలముల।
కర్మకోటుల ద్రెంపగాగాదుదీని।
దైవకృపగల్గుటను పదనైవెలుంగు।
నరసియెఱిగెడు తెలివికాన్సరియగాక॥ ౧౫౧॥

శ్లో॥ శ్రుతిప్రమాణైక మతేస్స్వధర్మ।
నిష్ఠాతయైవాత్మ విశుద్ధిరస్య।
విశుద్ధబుద్ధేః పరమాత్మవేదనం।
తేనైవసంసార సమూలనాశః॥ ౧౫౦॥

తే-గీ॥ శ్రుతినినమ్మినబోధధర్మ రతిఘటించు।
నంతనాత్మవిశుద్ధి యానట్టిశుద్ధ।
బుద్ధికగుబ్రహ్మవెఱుగుట బోవ్వదీన।
సంసృతిసమూలముగచెడి క్షణములోన॥ ౧౫౨॥

శ్లో॥ కోశైరన్నమయాద్యైః పంచభిరాత్మానసంవృతోభాతి।
నిజశక్తిసముత్పన్నైశ్శైవలపటలైరివాంబువాపిస్థం॥ ౧౫౧॥

ఆ- వె॥ తనదుశ క్తిబుట్టి తనరునన్నమయాది।
కోశపంచకమున గుప్తమగుచు।
నాత్మ గానరాదనల్పమహాపాచిచే।
బావిలోని నీటిపగిదిమహ్ని॥ ౧౫౩॥

శ్లో॥ తచ్ఛైవాలాపనయే సమ్యక్సలిలం ప్రతీయతే శుద్ధం।
తృష్ణాసంతాపహరం సద్యస్సౌఖ్యప్రదం పరం పుంసః॥ ౧౫౪॥

ఆ- వె॥ అట్టిపాచిదీగ లవల ద్రోచిననరు।
దప్పిబెట్టదీర్ప దక్షణంబ।
సౌఖ్యమొసగదగిన స్వచ్ఛంబు శ్రేష్ఠమౌ।
జలముగానవచ్చు స్పష్టముగను॥ ౧౫౪॥

శ్లో॥ పంచానామపి కోశానామపవాదే విభాత్యయం శుద్ధః।
నిత్యానందైకరసః ప్రత్యగ్రూపః పరస్స్వయంజ్యోతిః॥ ౧౫౫॥

ఆ- వె॥ పంచకోశములను పరిహరించినవెనక।
నాత్మ స్వప్రకాశు డమలుడతులు।
డద్వితీయసంతతానంద రసఘనుం।
డతడె వెలుగు ప్రత్యగాత్మ యనగ॥ ౧౫౫॥

శ్లో॥ ఆత్మానాత్మవివేకః కర్తవ్యో బంధముక్తయే విదుషా।
తేనైవానందీ భవతి స్వం విజ్ఞాయ సచ్చిదానందం॥ ౧౫౬॥

ఆ- వె॥ బుద్ధిశాలిబంధ ముక్తికై యాత్మన।
నాత్మ నరసి తెలియనగు దృఢముగ।
దానతనను సచ్చిదానందమూర్తిగా।
గాంచి నిరతిశయ సుఖంబునందు॥ ౧౫౬॥

శ్లో॥ ముంజాదిషీకామివ దృశ్యవర్గాత్।
ప్రత్యంచమాత్మానమసంగమక్రియం।

వివిచ్యతత్ర ప్రవిలాప్యసర్వం।
తదాత్మనాతిష్ఠతి యస్సముక్తః॥ ౧౫౫॥

ఆ-వె॥ ముంజయందు దర్భపోచనువలెదృశ్య।
గణమునందసంగు గర్తరహితు।
ప్రత్యగాత్మసరసి పట్టియందఖిలంబు।
నడచితానునదియె యగుటెముక్తి॥ ౧౫౬॥

శ్లో॥ దేహోఽయమన్నభవనోఽన్నమయస్తుకోశ।
శ్చాన్నేనజీవతి వినశ్యతితద్విహీనః।
త్వక్చర్మమాంసరుధిరాస్థిపురీషరాశి।
ర్నాయంస్వయంభవితు మర్హతినిత్యశుద్ధః॥ ౧౫౭॥

క॥ అన్నమయకోశమనఁగా । నన్నమువలనం జనించునదియీదేహం।
బన్నమునబ్రతుకు నదిలే । కున్నన్నశియించు చూడుమొయ్యనదీక్షా॥

తే గీ॥ తోలునెముకలునెరచి నెత్తురుమలము।
జేరిమేర్పడుమరికి శరీరమిద్ది।
నిత్యనిర్మలమూర్తి యైనెగడునాత్మ।
తానగుటకర్హమెన్నటికైనగాదు॥ ౧౫౮॥

శ్లో॥ పూర్వంజనేరపి మృతేరథనాయమస్తి।
జాతక్షణఃక్షణగుణోఽనియతస్వభావః।
నైకోజడశ్చఘటవత్పరిదృశ్యమాన।
స్స్వాత్మాకథంభవతి భావవికారవేత్తా॥ ౧౫౯॥

ఉ॥ పుట్టకముందుగాని మృతిపొందినపిమ్మటగానిలేమియా।
పట్టుతనాన నిక్షణ భంగురమస్థిరవృత్తియొకటైౖ।
నట్టిదికాక పెక్కు లగు నాత్మ ఘటంబునుబోలెచూడనా।
నిట్టిదిదేహమిట్లగునే వికృతిజ్ఞుడజుండుస్వాత్మతా॥ ౧౬౦॥

శ్లో॥ పాణిపాదాదిమాన్ దేహో నాత్మా వ్యంగేఽపి జీవనాత్
తత్తచ్ఛక్తేరనాశాచ్చ నని యమ్యో నియామకః॥ ౧౫౮॥

తే-గీ॥ బ్రతుకుచుండుట నవయవ బలములుడుగ
కుండుటను హస్త పాదాదియుక్తమైన
యంగమాత్మను బోలియు నాత్మగాదు
నదుపువాడౌ నెనదుపింపబడెడు జడము॥ ౧౬౦॥

శ్లో॥ దేహతద్ధర్మతత్కర్మ తదవస్థాదిసాక్షిణః
స్వత ఏవ స్వతస్సిద్ధం తద్వైలక్షణ్యమాత్మనః॥ ౧౫౯॥

తే-గీ॥ పరగ నొడలికి దీనిస్వభావములకు
చేష్టలకునునవస్థాద్యశేషమునకు
సాక్షియై యుంటకుండ నిచ్చలు వెలుంగు
నాత్మకుతనంత దా వేఱై యగుట చెల్లు॥ ౧౬౧॥

శ్లో॥ శల్యరాశిర్మాంసలిప్తో మలపూర్ణోఽతికశ్మలః
కథం భవేదయం వేత్తా స్వయమేతద్విలక్షణః॥ ౧౬౦॥

తే-గీ॥ ఎరచిప్పూసిన యెముకల యిల్లు దేహ
మెందు మలమెల్లెడలనుండు హేయముగద
యిదియగునె తాను వేఱౌచు నెల్లెఱుగుచుండు
తెలివియా నాత్మ యెన్నగా తెలియుమయ్య॥ ౧౬౨॥

శ్లో॥ త్వఙ్మాంసమేదోఽస్థిపురీషరాశా
వహంమతిం మూఢజనః కరోతి।
విలక్షణం వేత్తి విచారశీలో
నిజస్వరూపం పరమార్థభూతం॥ ౧౬౧॥

తే-గీ॥ తోలు మాంసము మెదడునస్థులును మలము
నీసికూటమి మూఢుండు నేనటంచు

దలఁచుసువివేకి పరమార్థతత్త్వమగుచు।
వేఱుమనదాని తానుగా వెలయునెఱుకు॥ ౧౬౪॥

శ్లో॥ దేహోఽహమిత్యేవ జడస్యబుద్ధిః।
దేహేచజీవే విదుష స్త్వహంధీః।
వివేకవిజ్ఞానవతో మహాత్మనో।
బ్రహ్మాహమిత్యేవ మతిస్సదాత్మని॥ ౧౬౫॥

క॥ నేనను దేహమె మందుఁడు। నేనను దేహమును జీవునిఁజదువరివి।
జ్ఞానమువివేకమునగల। జ్ఞానితను నెఱుంగు శుద్ధమతిబ్రహ్మముగాన్॥

శ్లో॥ అత్రాత్మబుద్ధిం త్యజమూఢబుద్ధే।
త్వఙ్మాంసమేదోఽస్థిపురీషరాశౌ।
సర్వాత్మని బ్రహ్మణినిర్వికల్పే।
కురుష్వశాంతిం పరమాంభజస్వ॥ ౧౬౩॥

తే॥ తోలునంజూడు మెదడునస్థులును మలము।
కుప్పయాగుదీని నేననుకొనకు జడుడ।
యఖిలమైశుద్ధమైన బ్రహ్మంబునీవు।
గానెఱిఁగి మెకుఁడగు శాంతిగాంచుమయ్య॥ ౧౬౬॥

శ్లో॥ దేహేంద్రియాదా వసతిభ్రమోదితాం।
విద్వానహంతాం నజహాతియావత్।
తావన్నతస్యాస్తి విముక్తివార్తా।
ప్యస్త్వేష వేదాంత నయాంతదర్శీ॥ ౧౬౪॥

తే॥ సాంతముగ తెఱఁగు వేదాంతశాస్త్రితులను।
జడవియున్నను నరున కసత్తులయిన।
యీశరీరేంద్రియాదుల నేననుభ్రమ।
మానకున్నంతకువిముక్తిమాటలేదు॥ ౧౬౭॥

శ్లో॥ ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే।
యత్స్వప్నదేహే హృదికల్పితాంగే।
యథాత్మబుద్ధి స్తవనాస్తికాచ।
జ్జీవచ్ఛరీరేచతథైవమాస్తు॥ ౧౬౫॥

తే.గీ॥ మేనినీడను నద్దంబులోనిజాడ(
గలగనినమేనమతిలోన దలచుకొన్న।
తనువునమనీకు నేననుతలపులేని।
యట్లె జీవించు నీమేనియందువలదు॥ ౧౬౬॥

శ్లో॥ దేహాత్మధీరేవ నృణామసద్ధియాం।
జన్మాదిదుఃఖ ప్రభవస్యబీజం।
యత స్తత స్త్వంజహితాం ప్రయత్నాత్।
త్యక్తేతుచిత్తే నపునర్భవాశా॥ ౧౬౭॥

క॥ దేహమునేనను మతియే। మోహగ్రస్తులకు జన్మముఖములకెద్దున్।
సాహసమునదానివిడు। చిత్తాహంకృతివీడ బుట్టువదలేకుండున్।

శ్లో॥ కర్మేంద్రియైఃపంచభిరంచితోఽయం।
ప్రాణోభవేత్ప్రాణమయస్తుకోశః।
యేనాత్మవానన్నమయోఽన్నపూర్ణాత్।
ప్రవర్తతేఽసౌసకలక్రియాసు॥ ౧౬౯॥

తే.గీ॥ ప్రాణమిదియైదు కర్మేంద్రియములగూడి।
ప్రాణమయకోశమగునిదే యన్నమయము।
చేతనముజేయునిది దానిజేరినండి।
యన్నిపనులందు జరిగెడునట్లుచేయు॥ ౧౭౦॥

శ్లో॥ నైవాత్మాపిప్రాణమయోవాయువికారో।
గంతాగంతావాయువదంతర్బహిరేషః।

యస్మాత్తిరంచితాత్మాప్యపి నవేత్తీష్టమనిష్టం।
స్వంవాన్యంవాకించన నిత్యంపరతంత్రః॥ ౧౬౮॥

ఉ॥ ప్రాణమయంబుచూడ నొకవాయువికారము రాకపోకలన్।
లోనను వెల్పలన్‌దిరుగు లోలతవాయువులీల మేలుగీ।
కైనన్నుతన్నువన్యులను నైననెఱుంగదు లేశముం బరా।
ధీనముగాన నెన్నకుమదీనిని నాత్మనుగామనమ్మునన్॥ ౧౬౯॥

శ్లో॥ జ్ఞానేంద్రియాణిచ మనశ్చమనోమయస్స్యాత్।
త్వరాశోమమాహమితి వస్తువికల్పహేతుః।
సంజ్ఞాదిభేదకలనాకలితోబలీయాన్।
తత్పూర్వకోశమభిపూర్య విజృంభతేయః॥ ౧౭౦॥

తే గీ॥ మనసుజ్ఞానేంద్రియంబులు మొనసియగు మ।
నోమయాభిఖ్యకోశంబు ధామమిదియె।
నేనునాయదియును మృషాజ్ఞానమునకు।
గదుబలాఢ్యంబు సంజ్ఞాదికములదెలియు॥ ౧౭౧॥

క॥ ఇదిప్రాణమయమ్మునెల్లం। గదిసివిజృంభించియుండు ఘనమైదృఢమై।
పదిలముగనిలిచిసంసృతి। మొదలై సంసారములకు మూలంబగుచున్॥

శ్లో॥ పంచేంద్రియైః పంచభిరేవహోతృభిః।
ప్రచీయమానో విషయాజ్యధారయా।
జాజ్వల్యమానో బహువాసనేంధనై।
ర్మనోమయాగ్నిర్దహతిప్రపంచం॥ ౧౭౨॥

తే-గీ॥ ఇంద్రియములైదు వ్రేల్చువారేవురగుచు।
పూనివిషయంబులను నేయిపోసివ్రేల్చ।
తొంటివలపులన్ కట్టెలమంటలెగయ।
మనసనెడునగ్ని లోకమెల్లనుదహించు॥ ౧౭౪॥

శ్లో॥ నహ్యస్త్యవిద్యామనసోఽతిరిక్తా।
మనోహ్యవిద్యా భవబంధహేతుః।
తస్మిన్ వినష్టే సకలంవినష్టం।
విజృంభితేఽస్మిన్ సకలంవిజృంభతే॥ ౧౭౧॥

తే-గీ॥ వినుమనసుకంటె వేఱేయవిద్యలేమి।
మనసెభవబంధమునకు కారణ మవిద్య।
యదినశించిన సర్వంబునడగిపోవు।
నదివిజృంభింప సర్వంబునడరుహెచ్చి॥ ౧౭౫॥

శ్లో॥ స్వప్నేఽర్థశూన్యే సృజతిస్వశక్త్యా।
భోక్త్రాదివిశ్వం మనఏవసర్వం।
తథైవజాగ్రత్యపినోవిశేషః।
స్తత్సర్వమేత న్మనసోవిజృంభణం॥ ౧౭౨॥

ఉ॥ ఏమియులేనిస్వప్నమున నీమనసేతనశక్తిచేతస।
ర్వామితభోక్తృముఖ్య విషయంబులసృష్టిఘొనర్చునట్టులే।
యీమహిజాగ్రతందగు మఱేమియులేదువిశేషమారయ।
న్నామగుణాకృతుల్మనసునం జనియించినవౌ యెఱుంగుమా॥౧౭౬

శ్లో॥ సుషుప్తికాలే మనసిప్రలీనే నైవాస్తికించి జ్జగతఃప్రసిద్ధేః।
అతోమనఃకల్పిత ఏవపుంస స్సంసారఏతస్యనవస్తుతోఽస్తి॥౧౭౩॥

తే-గీ॥ నిద్రవేళనుమనసు లీనించినప్పు।
డేమియునులేమియుండదు నెఱిగినదియె।
కానపురుషునకిదిమనః కల్పితంబు।
గానిసంసారమేమియు గాదునిజము॥ ౧౭౭॥

శ్లో॥ వాయునానీయతేమేఘః పునస్తేనైవనీయతే।
మనసాకల్ప్యతేబంధో మోక్షస్తేనైవకల్ప్యతే॥ ౧౭౪॥

తే-గీ॥ గాలి మేఘంబుగూర్చు నా గాలిమఱల।
దానినడచునునట్లెయీ మానసంబె।
బంధ మొడగూర్చు విషయ సంబంధముననుl
మోక్ష మొనరించువాని సమ్ముఖమువిడచి॥ ౧౭౪॥

శ్లో॥ దేహాదిసర్వ విషయేపరికల్ప్యరాగం।
బధ్నాతి తేనపురుషం పశువద్గుణేన।
వైరస్యమత్ర విషవత్సువిధాయపశ్చా।
దేనంవిమోచయతి తన్మనఏవబంధాత్॥ ౧౭౫॥

తే-గీ॥ తనువుమున్నగు విషయాళిదగులుపఱచి।
దానబురుషుని బసరంబు ద్రాటబోలె।
గట్టువెండియువానిపై గరళమట్లు।
విరతిబుట్టించి విడుపించు వెసమనస్సె॥ ౧౭౬॥

శ్లో॥ తస్మాన్మనః కారణమస్యజంతో।
ర్బంధస్యమోక్షస్యచ వావిధానే।
బంధస్యహేతు ర్మలినంరజోగుణైః।
ర్మోక్షస్యహేతు ర్విరజస్తమస్కం॥ ౧౭౭॥

తే-గీ॥ కానబంధము నొందెడి మోక్షంబునొందెడి।
మనసె యొడగూర్చుచుండు నీ మానవునకు,
నదిరజసునొంది చెడి బంధ మొదవజేయు।
తమసురజసును విడచి మోక్షమునొసంగు॥ ౧౭౮॥

శ్లో॥ వివేకవైరాగ్య గుణాతిరేకా।
చ్ఛుద్ధత్వమాసాద్య మనోవిముక్త్యై।
భవత్యతోబుద్ధి మతోముముక్షో।
స్తాభ్యాందృఢాభ్యాం భవితవ్యమగ్రే॥ ౧౭౯॥

క॥ సువివేకమునవిర_క్తిని। బ్రవిమలమైమనసు మోక్షపదమొసగుంగా।
న విము_క్తిపరుడుసన్మతి। యఖిరెండును మొదల దృఢము లౌక్రియగడగుత్॥

శ్లో॥ మనో నామమహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు।
చరత్యత్రనగచ్ఛంతు సాధవో యేముముక్షవః॥ ౧౭౮॥

తే-గీ॥ మనసనెడుపెద్దపులి విషమంబులైన।
విషయవిపినాంతరంబుల విచ్చలవిడి।
తిరుగుచున్నది యావంకకరుగబోకు!
డయ్య మోక్షంబుగోరెడు నార్యులార॥ ౧౭౭॥

శ్లో॥ మనఃప్రసూతే విషయాన శేషాత్।
స్థూలాత్మనాసూక్ష్మ తయాచభోక్తుః।
శరీరవర్ణా శ్రమజాతిభేదాత్।
గుణక్రియాహేతు ఫలానినిత్యం॥ ౧౭౯॥

తే-గీ॥ స్థూలసూక్ష్మంబులౌ విషయాలనెల్ల।
దేహవర్ణాశ్రమముల జాతిస్థితులను।
పరగుగుణకర్మముల హేతుఫలసమితుల।
మనసెభోక్తకు గల్పించుమహిమనెపుడు॥ ౧౭౩॥

శ్లో॥ అసంగచిద్రూపమముంవిమోహ్య।
దేహేంద్రియ ప్రాణగుణైర్నిబధ్య।
అహంమమేతి భ్రమయత్యజస్రం।
మనస్స్వకృత్యేషుఫలోపభు_క్తిషు॥ ౧౮౦॥

తే-గీ॥ ఎదియునంటని తెలివైయ్యాసితని మోస।
పుచ్చి దేహేంద్రియప్రాణములగుణముల।
గట్టి తనపనియగు ఫలగ్రహణమందు।
మన సితని నేను నాయదియనగజేయు॥ ౧౮౧॥

శ్లో॥ అధ్యాసదోషా త్పురుషస్యసంసృతి।
రధ్యాసబంధ స్త్వము నైవకల్పితః।
రజ స్తమోదోష వతోఽవివేకినో।
జన్మాదిదుఃఖస్యనిదానమేతత్॥ ౧౮౧॥

తే-గీ॥ పురుషుసంసార మధ్యాసమునఘటించు।
నిదియెయధ్యాసబంధంబు గుదురుపఱచు।
దెలివిలేనిరజ స్తమః కలుషమతికి।
జన్మమరణాదిదుఃఖ సంజనకమిదియె॥ ౧౮౪॥

శ్లో॥ అతఃప్రాహుర్మనోఽవిద్యాం పండితా స్తత్వదర్శినః।
యేనైవభ్రామ్యతేవిశ్వం వాయునేవాభ్రమండలం॥ ౧౮౨॥

తే-గీ॥ జ్ఞాననిశ్చయ మెఱిగినజ్ఞానులెల్ల।
మానసంబె యవిద్యయనుచూనిపలికి।
రదియెసుమ్ము జగంబెల్లనభ్రపటలి।
వాయువెటులల్లె భ్రమియింపజేయుచుండు॥ ౧౮౫॥

శ్లో॥ తన్మనశ్శోధనం కార్యం ప్రయత్నేనముముక్షుణా।
విశుద్ధేసతిచైతస్మిన్ముక్తిఃకరఫలాయతే॥ ౧౮౩॥

తే-గీ॥ అట్లగుటమోక్షమ్మును గోరునట్టివాడు।
జతనమునమానసము శుద్ధిసలుపవలయు।
నదివిశుద్ధినెసంగిన నతనికపుడె।
మోక్షమఱచేతి ఫలమునుబోలియుండు॥ ౧౮౬॥

శ్లో॥ మోక్షైకసక్త్యావిషయేషురాగం నిర్మూల్యసంన్యస్యచసర్వకర్మ।
సచ్ఛ్రద్ధయాయశ్శ్రవణాదినిష్ఠో రజస్స్వభావంసధునోతిబుద్ధేః॥

తే-గీ॥ దృఢముగామోక్షమందు గోరికవహించి।
విషయరతిమాని కర్మములెల్లడించి।

శ్రద్ధతోశ్రవణాది కాసక్తుడైన।
వానిబుద్ధిరజస్స్వభావంబువిడుచు॥ ౧౮౩॥

శ్లో॥ మనోమయోనాపి భవేత్పరాత్మా।
హ్యాద్యంతవత్త్వాత్పరిణామిభావాత్।
దుఃఖాత్మకత్వాద్విషయత్వహేతో।
ర్ద్రష్టాహిదృశ్యాత్మ తయానదృష్టః॥ ౧౮౪॥

ఉ॥ ఆదియునంతమున్గలది యన్యత నొందును దుఃఖరూపమా।
నీదృశమంచుఁజూడదగు నిట్టిదిగాన మనోమయంబును౯।
గాదుసుమీ సమస్తమును గాంచెదునాపరమాత్మ ద్రష్టయా।
నేదియుగాదుదృశ్యమనుటేవు నెఱుంగుదుగాదెపుత్రకా॥ ౧౮౫॥

శ్లో॥ బుద్ధిర్బుద్ధీంద్రియైస్సార్ధం సవృత్తిఃకర్తృలక్షణః।
విజ్ఞానమయకోశస్స్యాత్పుంసస్సంసారకారణం॥ ౧౮౬॥

క॥ జ్ఞానేంద్రియములుబుద్ధికి। స్థానముగాబెరసి కర్తదానసుటదెవి।
జ్ఞానమయకోశమిదెయీ। మానవుసంసారమును సమస్తముజేయున్॥

శ్లో॥ అనువ్రజచ్చిత్ప్రతిబింబశక్తి। ర్విజ్ఞానసంజ్ఞఃప్రకృతేర్వికారః।
జ్ఞానక్రియావానహమిత్యజస్రం। దేహేంద్రియాదిష్వభిమన్యతేభృశం॥

తే-గీ॥ ఆత్మప్రతిబింబ శక్తిననుసరించి।
యెసగువిజ్ఞానమను నిప్రకృతివికార।
మెఱుగుటయొదీనిపని శరీరేంద్రియాదు।
లేననుచు లెస్సదలచు సుమ్మిదియెపుడు॥ ౧౮౭॥

శ్లో॥ అనాదికాలోఽయ మహంస్వభావో।
జీవస్సమస్తవ్యవహారవోఢా।
కరోతికర్మాణ్యపి పూర్వవాసనః।
పుణ్యాన్యపుణ్యానిచతత్ఫలాని॥ ౧౮౮॥

ఆ-వె॥ ఈయనాదియైన యేవను ప్రకృతియే।
జీవుడెల్లపనులు చేయునితడె।
పూర్వవాసనల పుణ్యములపుణ్యముల్।
కర్మములనొనర్చి కాంచుఫలము॥ ౧౮౭॥

శ్లో॥ యత్త్వేవ విదితాత్ర్యపి యోనిషు వ్రజ।
న్నాయాతి నిర్యాత్యధ ఊర్ధ్వమేవః।
అస్యైవ విజ్ఞానమయస్య జాగ్ర।
త్స్వప్నాద్యవస్థా సుఖదుఃఖభోగః॥ ౧౯౮॥

క॥ నానాజన్మములొందుచు। దానున్నతనీచగతుల దవిలితిరుగువి।
జ్ఞానమయుడితడె సుఖదుః। ఖానుభవమునొందు జాగ్రదాదిస్థితులన్॥

శ్లో॥ దేహాదినిష్ఠాశ్రమధర్మకర్మ గుణాభిమానం సతతంమమేతి।
విజ్ఞానకోశోఽయమతిప్రకాశః ప్రకృష్టసాన్నిధ్యవశాత్పరాత్మనః॥

చ॥ ధరిమవర్ణాశ్రమధర్మకర్మగుణ సంబంధంబు దేహాదిని।
ష్ఠము నెల్లప్పుడు స్వీయమంచలరు విజ్ఞానాఖ్యకోశంబతి।
ప్రముఖంబై వెలుగొందు బ్రహ్మముసమీపంబౌటనింతేలబ్ర।
హ్మమదేతాననిసంసృతింబొదల దానందెన్నిజోపాధితన్॥ ౧౮౪॥

శ్లో॥ యోఽయంవిజ్ఞానమయః ప్రాణేషుహృదిస్ఫురత్యయంజ్యోతిః।
కూటస్థస్సన్నాత్మాకర్తా భోక్తాభవత్యుపాధిస్థః॥ ౧౮౧॥

ఆ-వె॥ ప్రాణములహృదంతరంబునవిజ్ఞాన।
మయమిదే వెలుంగు మహిమతోడ।
నీయుపాధినొంది యెలమిఁగూటస్థుడై।
యాత్మకర్తభోక్తననితలంచు॥ ౧౮౫॥

శ్లో॥ స్వయంపరిచ్ఛేదముపేత్యబుద్ధే।
స్తాదాత్మ్యదోషేణ పరంమృషాత్మనః।

సర్వాత్మకస్సన్నపి వీక్షతేస్వయం।
స్వతఃపృథక్త్వేన మృదోఘటానివ॥ ౧౯౨॥

తే-గీ॥ తానుసర్వాత్ముడయ్యు నతత్యమైన।
బుద్ధియేననుఁదోషాన బాధల వాత్మ।
తాను వేఱుఁచుకను తన్నుదానె వేఱ।
టంచుఘటములు మన్ను వేఱన్నయట్లు॥ ౧౯౬॥

శ్లో॥ ఉపాధిసంబంధ వశాత్పరాత్మా।
హ్యుపాధిధర్మానను భాతితద్గుణః।
అయోవికారా నవికారివహ్నివ।
త్సదైకరూపోపి పరస్స్వభావాత్॥ ౧౯౩॥

ఆ-వె॥ నిర్వికారమైన నిప్పులోహపువికా।
రంబులొందునట్లు బ్రహ్మమెపుడు।
నేకరూపుడయ్యు నీయుపాధినిగూడ।
గుణములొంది దాని పనులెచేయు॥ ౧౯౭॥

శిష్యఉవాచ॥ శ్లో॥ భ్రమేణాప్యన్యథా వాస్తుజీవభావఃపరాత్మనః।
తదుపాధేరనాదిత్వాన్నానాదేర్నాశఇష్యతే॥ ౧౯౪॥

శిష్యుండిట్లను॥ ఆ-వె॥ భ్రమను గాని వేఱుపగిదినిగానిజీ।
వత్వమయ్యెగాదె బ్రహ్మమునకు।
మొదలులేనిదిగద తదుపాధి యాదిలే।
నిదినశించకుండు గదమహాత్మ॥ ౧౯౮॥

శ్లో॥ అతోఽస్యజీవభావోఽపి నిత్యాభవతిసంసృతిః।
ననివర్తేత తన్మోక్షః కథంమేశ్రీగురోవద॥ ౧౯౫॥

క॥ కావునబరమాత్మునకీ। జీవత్వమునిత్యమయ్యెజెడదీసంసా।
రావర్తనమును మోక్షం। బేవిధమునగలుగు జెప్పవేగురువర్యా॥ ౧౯౯

శ్రీగురురువాచ॥ శ్లో॥ సమ్యక్పృష్టం త్వయావిద్వన్ సావధానేనతచ్ఛృణు।
ప్రామాణికీనభవతి భ్రాంత్యా మోహాత్మకల్పనా॥ ౧౯౬॥

శ్రీగురుండిట్లను॥ తే-గీ॥ బుద్ధిశాలివినీప్రశ్న పొగడదగును।
చకరిగావిను పాయునీ సంశయంబు।
భ్రాంతిచేదోచు కల్పన యింతెగాని।
యిదియథార్థముగాదు లేదెంచిచూడు॥ ౨౦౦॥

శ్లో॥ భ్రాంతింవినాత్వసంగస్య నిష్క్రియస్యనిరాకృతేః।
నఘటేతార్థసంబంధో నభసోనీలతాదివత్॥ ౧౯౭॥

తే-గీ॥ భ్రాంతిగాకున్న నెందునుబట్టుబడక।
మెదియుజేయక యెట్టియాకృతియులేక।
తనరునాత్మకు నర్థముల్దవులవంబ।
రంబునకునీలతాది వర్ణములువోలె॥ ౨౦౧॥

శ్లో॥ స్వస్యద్రష్టుర్నిర్గుణస్యాక్రియస్య।
ప్రత్యగ్బోధానంద రూపస్యబుద్ధేః।
భ్రాంత్యాప్రాప్తో జీవభావోనసత్యో।
మోహాపాయేనాస్త్య వస్తుస్వభావాత్॥ ౧౯౮॥

చ॥ గుణములులేకకర్మముల గూడకవెలుగుతెల్వియున్ సుఖం।
బునునయిసాక్షియాతనకు బాల్పెమతిభ్రమచేనసత్యమై।
పొనరెడిజీవభావమది మోహమువాసినబాసిపోవుచ।
య్యానదివస్తుభావమును నందనిదాటసుబుద్ధిజూడుమా॥ ౨౦౨॥

శ్లో॥ యావద్భ్రాంతిస్తావదేవాస్యసత్తా।
మిథ్యాజ్ఞానోజ్జృంభితస్య ప్రమాదాత్।
రజ్జ్వాంసర్పోభ్రాంతి కాలీనఏవ।
భ్రాంతేర్నాశేనైవ సర్పోఽపితద్వత్॥ ౧౯౯॥

ఆ-వె॥ మఱపువలన తెలివి మఱలిపుట్టినదిది।
యుంతు వెల్లభ్రాంతి యుండువఱకె।
భ్రాంతియుండునపుడు పాముతోచును త్రాట।
పాము లేదుగాదె భ్రాంతియుడుగ॥ ౨౦౩॥

శ్లో॥ అనాదిత్వమవిద్యాయాః కార్యస్యాపితథేష్యతే।
ఉత్పన్నాయాంతు విద్యాయా మావిద్య కమనాద్యపి॥ ౨౦౦॥
ప్రబోధే స్వప్నవత్సర్వం సహమూలంవినశ్యతి॥ ౨౦౦౫॥

తే-గీ॥ అయ్యవిద్యకు దానికార్యములకెల్ల।
నగు ననాదిత్వమిట్టిదే యదియనాది।
యయ్యు విద్యజనించిన హతమగును స।
మూలముగగల మెలకువఁ బోవునట్లు॥ ౨౦౪॥

శ్లో॥ అనాద్యపీదం నోనిత్యం ప్రాగభావ ఇవస్ఫుటం॥ ౨౦౬॥
అనాదేరపి విధ్వంసః ప్రాగభావస్యవీక్షితః।
యద్బుద్ధ్యుపాధి సంబంధా త్పరికల్పిత మాత్మని॥ ౨౦౭॥

క॥ ఇది ప్రాగభావమగుటఁ। మొదలులేనిదయ్యు నిత్యముగనుండదు బు।
ద్ధ్యాదితముకల్పితమాత్మను। మొదలులేని ప్రాగభావములుచెడుగాదే॥

శ్లో॥ జీవత్వం నతతోఽన్యత్తు స్వరూపేణవిలక్షణః।
సబంధస్స్వాత్మనోబుద్ధ్యా మిథ్యాజ్ఞాన పురస్సరః॥ ౨౦౩॥
వినివృత్తిర్భవేత్తస్య సమ్యక్ జ్ఞానేన నాన్యథా॥ ౨౦౩౫॥

తే గీ॥ సుమతిజీవత్వమన స్వరూపమునకంటె।
వేఱుగానిది యిది యవివేకమున జ।
నించునాత్మనుబుద్ధిలోనిల్పుకట్టు।
దాని ద్రెంచును లెస్సయౌ జ్ఞానమొకటె॥ ౨౦౬॥

శ్లో॥ బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానం సమ్యక్ జ్ఞానం శ్రుతేర్మతం॥ ౨౦౪॥

క॥ వినులెస్సమైనజ్ఞానం। బనగా బ్రహ్మంబు నేను ననునివియొకటే।
యను తేట తెలివియనుచున్ ।ఘనతరమగు శ్రుతివచించు గారుణ్యమునన్॥

శ్లో॥ తదాత్మానాత్మనోస్సమ్య గ్వివేకేనైవసిద్ధ్యతి।
తతో వివేకః కర్తవ్యః ప్రత్యగాత్మ సదాత్మనోః॥ ౨౦౫॥
జలంపంకవదత్యంతం పంకాపాయేజలంస్ఫుటం॥ ౨౦౫ ५॥

తే-గీ॥ అట్టివిజ్ఞానమాత్మనాత్మలెస్స।
గావిమర్శించుటనెగల్గు గాన ప్రత్య।
గాత్మపరమాత్మల నెఱుంగనగునుబురద।
నీటి పంకంబువో నీరు తేటగాదె॥ ౨౦౬॥

శ్లో॥ అసన్నివృత్తౌతు సదాత్మనాస్ఫుటం।
ప్రతీతిరేతస్య భవేత్ప్రతీచః।
తతో నిరాసః కరణీయఏవ।
సదాత్మనస్స్యాధ్వహమాదివస్తునః॥ ౨౦౭॥

క॥ లేనిదిమాన్పినలెస్సగ। గానంబడు బ్రత్యగాత్మ గానీతండే।
కాననన్నేననునది మొద। లైనయసత్తులను బాపనగు సత్తునకున్॥౨౦౮॥

శ్లో॥ అతో నాయం పరాత్మాస్యా ద్విజ్ఞానమయశబ్దభాక్।
వికారిత్వాజ్జడత్వాచ్చ పరిచ్ఛిన్నత్వహేతుతః॥ ౨౦౯॥
దృశ్యత్వాద్వ్యభిచారిత్వా న్నానిత్యోనిత్యఇష్యతే॥ ౨౦౯ ५॥

ఉ॥ కాన వికారియుం జడము గాంచగనైనది వేఱువేఱుగా।
గానబడున్ నిరంతరముగన్పడదొకరీతి విధంబునన్ సతం।
బైనది కాదు చూడుమిటులైనదినిత్యపరాత్మయానె వి।
జ్ఞానమయాఖ్య కోశమది కాదని నిశ్చయమొందుపుత్రకా॥ ౨౧౦॥

శ్లో॥ ఆనందప్రతిబింబచుంబితతనుర్వృత్తిస్తమోజృంభితా।
స్యాదానంద మయః ప్రియాది గుణకః స్వేష్టార్థలాభోదయః।
పుణ్యస్యానుభవే విభాతి కృతినామానంద రూపస్స్వయం।
భూత్వానందతి యత్ర సాధుతను భృన్మాత్రః ప్రయత్నంవినా॥

తే-గీ॥ విను తమోగుణభవవిజృంభణమువలన।
నిలుచువృత్తియానందంపు నీడ కెంది।
యయినయదియె యానందమయాఖ్యకోశ।
మదిప్రియాది గుణంబుల కాలయంబు॥ ౨౧౧॥

తే-గీ॥ పుణ్యపురుషులు తమపుణ్యములనుగుడుచు।
నపుడుతత్స్వరూపస్వరూపమై యలరునిదియె।
పురుషుడానందమిందె తా బొందులెస్స।
యత్నమేలేక దేహమున్నంతమాత్ర॥ ౧౨॥

శ్లో॥ ఆనందమయకోశస్య సుషుప్తౌస్ఫూర్తిరుత్కటా।
స్వప్నజాగరయోరీషదిష్టసందర్శనాదినా॥ ౨౧౫॥

క॥ ఈయానందమయంబను। కాయపు పొరతోచుస్ఫుటముగా నిద్దురలో॥
నీయదికలమెలకువలన। నాయతమగు నిష్టమించుకైతోచటచే॥ ౨౧౩

శ్లో॥ నైవాయమానంద మయః పరాత్మా।
సోపాధికత్వాత్ప్రకృతేర్వికారాత్।
కార్యత్వహేతోస్సుకృతక్రియాయా।
వికారసంఘాత సమాహితత్వాత్॥ ౨౧౦॥

తే-గీ॥ మితము ప్రకృతివికారనిర్మితము మఱియు।
పుణ్యకర్మవికారసమూహరూప।
మగుట నానందమయకోశ మదిపరాత్మ।
కాదనియెఱుంగుమయ్య సూక్ష్మమగుమతిని॥ ౨౧౪॥

శ్లో॥ పంచానామపికోశానాం నిషేధే యుక్తితశ్శ్రుతేః।
తన్నిషేధావధిస్సాక్షీ బోధరూపోఽవశిష్యతే॥ ౭౮.౧॥

ఆ వె॥ ఐదుకోశములును నాత్మకాదన్నెగ।
మోక్తిచేతమంచి యుక్తిచేత।
నిరసనంబుసేయ నిలిచెడుతెలివియా।
సాక్షిఁగిలియుండు సంగముడిగి॥ ౭౮.౫॥

శ్లో॥ యోఽయమాత్మాస్వయం జ్యోతిః పంచకోశవిలక్షణః।
అవస్థాత్రయసాక్షీస న్నిర్వికారోనిరంజనః॥ ౭౧.౪॥
సదానందస్సవిజ్ఞేయ స్స్వాత్మత్వేనవిపశ్చితా॥ ౭౧.౪౫॥

చ॥ వెలుగుదనంతదానెవడు వెలుగునెవ్వడుకోశపంచకా।
కులతకు మూడవస్థలనుగూడకచూచునిల్చునెవ్వడ।
స్ఖలితగతిన్వికారములగాంచమ నిర్మలుడైమదంబునన్।
వెలయు నతండెతానని యభిన్నతవిజ్ఞుడెఱుంగగాదగున్॥ ౭౧౬॥

శిష్యఉవాచ॥ శ్లో॥ మిథ్యాత్వేననిషిద్ధేషు కోశేష్వేతేషుపంచసు।
సర్వాభావంవినాకించి న్నపశ్యామ్యత్రహేగురో॥ ౭౧౩॥
విజ్ఞేయంకిమువస్త్వస్తి స్వాత్మనాత్మవిపశ్చితా॥ ౭౧౩౫॥

అనినశిష్యుడిట్లను॥ గీ॥ స్వామి యీయైదుకోశముల్వట్టివనుచు।
విడువనేమియు లేమికివేఱికేమి।
యునుగనంబడ దేదేనియున్నదేవి।
వేకితనరూపనితెఱుంగ విషయమొకటి॥ ౭౧౭॥

శ్రీగురురువాచ॥ శ్లో॥ సత్యముక్తంత్వయావిద్వ న్నిపుణోఽసివిచారణే।
అహమాదివికారాస్తే తదభావోఽయమప్యను॥ ౭౧౮॥

అనినశ్రీగురువిట్లను॥ గీ॥ నిజముబలికితి సువిచారనిపుణమతివి।
కాంచు మహమాది సకలవికారములును।

నీవిగద యవ్వి లేనిమేనీవుగావె।
యేమిలేమని నీవుగా నెఱిగితయ్య॥ ౨౧౪॥

శ్లో॥ సర్వేయేనానుభూయంతే యస్స్వయంనానుభూయతే।
తమాత్మానంవేదితారం విద్ధిబుద్ధ్యాసుసూక్ష్మయా॥ ౨౧౫॥

తే-గీ॥ అన్నివిషయంబులను నేది యనుభవించు।
ననుభవించంగ బడదెద్ది యట్టిసకల।
వేత్తనాత్మనుగాసువివేకబుద్ధి।
నెఱుగుమాసంశయంబిక నేమిగలదు॥ ౨౧౬॥

శ్లో॥ తత్సాక్షికంభవేత్తత్తద్యద్యద్యేనానుభూయతే।
కస్యాప్యననుభూతార్థే సాక్షిత్వంనోపయుజ్యతే। ౨౧౭॥

క॥ ఎదిదేనిననుభవించునో। యదిదానికిసాక్షియగు బరానుభూతం।
బెది యట్టివిషయమందున। నొదవునెసాక్షిత్వసిద్ధియుపయుక్తముగన్॥

శ్లో॥ అసౌస్వసాక్షికోభావో యతస్స్వేనానుభూయతే।
అతఃపరంస్వయంసాక్షాత్ ప్రత్యగాత్మానచేతరః॥ ౨౧౮॥

ఆ-వె॥ ఆత్మతన్నుదానె యరసియెఱుంగుట।
నతడుతనకుదానె సాక్షియగును।
కాన నదె పరంబు మానమౌరను సిద్ధ।
మైనప్రత్యగాత్మతానొకండె॥ ౨౨౦॥

శ్లో॥ జాగ్రత్స్వప్నసుషుప్తిషుస్ఫుటతరం యోఽసౌసముజ్జృంభతే।
ప్రత్యగ్రూపతయాసదాహ మహమిత్యంతస్స్ఫురన్నేకధా।
నానాకారవికారభాగినఇమా న్పశ్యన్నహంధీముఖా।
న్నిత్యానందచిదాత్మనాస్ఫురతితం విద్ధిస్వమేతంహృది॥ ౨౧౯॥

చ॥ సకలవిలక్షణుండగుచు జాగ్రత స్వప్నమునందు సుప్తిలో।
నొకటిగజొచ్చినేననుచు నొప్పుగనెప్పుడువెల్గులోపలన్।

వికృతములౌనహంమతులివే మొదలైనవినిత్యచిత్సుఖా।
త్మకుడమై చూచునట్టి పరతత్త్వమెనీవనిలోనెఱుంగుమా॥ ౨౨౨॥

శ్లో॥ ఘటోదకే బింబితమర్కబింబ।
మాలోక్యమూఢోరవిరేవమన్యతే।
తథావిదాభాస ముపాధిసంస్థం।
భ్రాంత్యాహమిత్యేవ జడోఽభిమన్యతే॥ ౨౧౯॥

ఆ-వె॥ కడవలోనినీట గన్పట్టురవిబింబ।
మరసిమూఢుడర్క డనియెతలచు।
నట్లెయీయుపాధి నగపడునాత్మబిం।
బంబె తానటంచు భ్రాంతుడెంచు॥ ౨౨౩॥

శ్లో॥ ఘటంజలం తద్గతమర్కబింబం।
విహాయసర్వం వినిరీక్ష్యతేఽర్కః।
తటస్థఏత త్త్రితయావ భాసక।
స్స్వయంప్రకాశో విదుషోయథాతథా॥ ౨౨౦॥

శ్లో॥ దేహంధియంచిత్ప్రతిబింబమేవం।
విసృజ్యబుద్ధౌ నిహితంగుహాయాం।
ద్రష్టారమాత్మాన మఖండబోధం।
సర్వప్రకాశం సదసద్విలక్షణం॥ ౨౨౧॥

శ్లో॥ నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మ।
మంతర్బహిశ్శూన్య మనన్యమాత్మనః।
విజ్ఞాయసమ్యజ్నిజ రూపమేత।
త్పుమాన్విపాప్మా విరజోవిమృత్యుః॥ ౨౨౨॥

సీ॥ కడవను నీటితద్గతమర్కబింబంబు నన్నింటి విడువ నందున్నయట్లు।
కన్పట్టి మూటివెల్లగజేయురవి తన్నయంత వెల్గుట విజ్ఞుడరయుమాడ్కి।

తనువును బుద్ధి తత్ప్రతిబింబమును చాయధీగుహానీమూటిదెలియుచుండు।
నాత్మ నొండగు తెల్వి నన్నింటి వెలిగించుసదసద్విలక్షణు సర్వగతుని॥

ఆ-వె॥ నిత్యు విభు సుసూక్ష్ము నిర్మలు లోవెలి।
లేని యేకరూపు లెస్స తనదు।
రూపుగా నెఱింగి పాపంబు కర్మంబు।
మరణభయము విడుచు మనుజవరుడు॥ ౨౩౪॥

శ్లో॥ విశోక ఆనందఘనో విపశ్చి త్స్వయం కుతశ్చిన్న బిభేతి కశ్చిత్।
నాన్యోఽస్తి పంథా భవబంధముక్తే ర్వినా స్వతత్త్వావగమం ముముక్షోః

ఆ-వె॥ అట్టివాడు శోకమంటడానందఘు।
నుండు భయము లేని పండితుండు।
తన్నువానెఱుంగు దారికంటెను భవ।
బంధముక్తి కన్య పథము లేదు॥ ౨౩౫॥

శ్లో॥ బ్రహ్మాభిన్నత్వవిజ్ఞానం భవమోక్షస్య కారణం।
యేనాద్వితీయమానందం బ్రహ్మ సంపద్యతే బుధైః॥ ౨౩౬॥

తే-గీ॥ తాను బ్రహ్మముకంటె వేఱైనవాడ।
గానసెడు తెల్వి భవమోక్షకారణంబు।
పెద్దలెల్లను దీనిచే నుద్ది లేని।
సుఖము బ్రహ్మము బొంది మించుదురు సుమ్మి॥ ౨౩౭॥

శ్లో॥ బ్రహ్మభూతస్తు సంసృత్యై విద్వాన్నావర్తతే పునః।
విజ్ఞాతవ్యమతస్సమ్యగ్బ్రహ్మాభిన్నత్వమాత్మనః॥ ౨౩౮॥

తే-గీ॥ బ్రహ్మమైయుండు ధన్యుండు బ్రహ్మమైన।
సంసృతికి నెన్నటికి రాదు జాతిమాలల।
కాన బ్రహ్మముకంటెను తాను వేఱు।
గాదనెడు తెల్వి లెస్సగా గలుగవలయు॥ ౨౩౮॥

శ్లో॥ సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ విశుద్ధంపరంస్వతస్సిద్ధం।
నిత్యానందైకరసంప్రత్యగభిన్నం నిరంతరంజయతి॥ ౨౧౬॥

మత్తకోకిల॥ హానిలేనిది జ్ఞానమైనది యెంతమొందనిదచ్ఛము।
న్మానహీనపరస్వరూప మమాయికైకసుఖాత్మకం।
బైనదన్నిటికిన్విలక్షణమైన సాక్షికివేఱుగా।
గానిబ్రహ్మమె సంతతంబు ప్రకాశమొందునఖండమై॥ ౨౧౭॥

శ్లో॥ సదిదంపరమాద్వైతం స్వస్మాదన్యస్యవస్తునోఽభావాత్।
నహ్యన్యదస్తికించిత్సమ్యక్పరమార్థతత్త్వబోధదశాయాం॥ ౨౧౭॥

తే గీ॥ చూడ దనకంటె నన్యవస్తువెటలేమి।
చెడనిదిది రెండవదిలేనిశ్రేష్ఠపదము।
తఱచిచెస్సగ పరమార్థతత్త్వమెఱుగు।
నట్టిస్థితినన్యవస్తువేమైనగలదె॥ ౨౧౮॥

శ్లో॥ యదిదంసకలంవిశ్వం నానారూపంప్రతీతమజ్ఞానాత్।
తత్సర్వంబ్రహ్మైవప్రత్యస్తాశేషభావనాదోషం॥ ౨౧౮॥

తే-గీ॥ దానిదెలియమి నానావిధస్వరూప।
మై కనంబడునయ్య బ్రహ్మాండమెల్ల।
నఖిలమిది భావనాదోషహారియయిన।
బ్రహ్మమేగాని వేఱొండుపగిదిగాదు॥ ౨౧౯॥

శ్లో॥ మృత్కార్యభూతోఽపి మృదోనభిన్నః।
కుంభోఽస్తిసర్వత్రతు మృత్స్వరూపాత్।
నకుంభరూపం పృథగస్తికుంభః।
కుతోమృషాకల్పిత నామమాత్రః॥ ౨౧౯॥

తే-గీ॥ మంటిచేనైనదయ్య కుంభంబుమంటి।
కంటె వేఱుగనుండ దామంటిరూపె।

యంతేటను గాన నదిగానియట్టికుంభ।
రూపమున్న దెయఃరక పేరొరనునెగాక॥ ౨౩౦॥

శ్లో॥ కేనాపిమృద్భిన్నతయాస్వరూపం।
ఘటస్యసందర్శ యితుంనశక్యతే।
అతోఘటఃకల్పిత ఏవమోహః।
న్మృదేవసత్యం పరమార్థభూతం॥ ౨౩౧॥

తే-గీ॥ మన్నుగాకుండునట్టి కుంభంపురూప।
మెవ్వడునుజూపలేడోట నీఘటంబు।
కల్పితము మోహమున నింతెగాని నిశ్చ।
యముగ జెడకుండునది మన్నె యరసిచూడ॥ ౨౩౧॥

శ్లో॥ సద్బ్రహ్మకార్యం సకలంసదేవ।
తన్మాత్రమేత న్నతతోఽన్యదస్తి।
అస్తీతియోవక్తి నతస్యమోహో।
వినిర్గతోఽనిద్రిత వత్ప్రజల్పః॥ ౨౩౨॥

తే-గీ॥ చెడనిబ్రహ్మముచేనైన సృష్టిచెడని।
బ్రహ్మమాత్రమె యిదియెల్లబ్రహ్మమునకు।
నన్యమేమియులేదున్న దనెడువాడు।
వదరుని దురనువలె మోహవశతనట్లు ॥ ౨౩౨॥

శ్లో॥ బ్రహ్మైవేదం విశ్వమిత్యేవవాణీ।
శ్రౌతీబ్రూతేఽథర్వనిష్ఠావరిష్ఠా।
తస్మాదేతద్బ్రహ్మ మాత్రంహివిశ్వం।
నాధిష్ఠానా ద్భిన్నతారోపితస్య॥ ౨౩౩॥

ఆ॥ వె॥ వెల్లడిగనధర్వ వేదంబులోవాణి।
పలుకనీజగంబు బ్రహ్మమెయని।

కానబ్రహ్మమాత్ర మానీజగమ్ము క
ల్పితము దానినిజము వేఱుగాదు॥ ౨౩౨॥

శ్లో॥ సత్యంయదిస్యా జ్జగదేత దాత్మనా
నతత్వహాని ర్నిగమాప్రమాణతా।
అసత్యవాదిత్వ మపీశితుస్స్యా
న్నైతత్త్రియంసాధు హితంమహాత్మనాం॥ ౨౩౩॥

తే-గీ॥ విశ్వమిట్టులె చెడనిదై వెలయుననిన
తత్వములుచెడవనవలె తప్పనవలె
వేదములు నీశ్వరుడసత్యవాదియగును
పెద్దలీమాటిలెస్సని ప్రీతిగనరు॥ ౨౩౪॥

శ్లో॥ ఈశ్వరోవస్తు తత్త్వజ్ఞో నచాహం తేష్వవస్థితః।
నచమత్స్థానిభూతానీ త్యేవ మేవవ్యచిక్లిపత్॥ ౨౩౪॥

ఆ-వె॥ వస్తుతత్త్వమెఱుగువాడగునీశ్వరుం
డేను దానియందు లేను భూత
కోటియదియులేదు గుఱుతింపనాయందు
ననుచుబలికె నిశ్చయంబుదెలియ॥ ౨౩౫॥

శ్లో॥ యదిసత్యంభవేద్విశ్వం సుషుప్తావుపలభ్యతాం।
యన్నోపలభ్యతేకించిదతోఽసత్స్వప్నవన్మృషా॥ ౨౩౫॥

తే-గీ॥ చెడకయెప్పుడునుండు నీసృష్టియనిన
నిద్రలో నిది యిటులె కాన్పింపవలదె
యప్పుడేమియు గనబడ దట్లుగాన
కల్లయిది వట్టిదయ్యె యీకలతెఱగున॥ ౨౩౬॥

శ్లో॥ అతఃపృథఙ్నాస్తిజగత్పరాత్మనః
పృథక్ప్రతీతిస్తుమృషాగుణాదివత్।

ఆరోపితస్యాస్తికిమర్థవత్తా।
ధిష్ఠానమాభాతితథాభ్రమేణ॥ ౨౩౬॥

తే-గీ॥ కానపరమాత్మగాని జగంబులేదు।
భేదముగదోచు భ్రమచే గుణాదులట్లు।
లుందునదియొందు నటుదోచుటొండు గలదె।
యొందునదెతోచు కల్పితంబున్నయట్లు॥ ౨౩౭॥

శ్లో॥ భ్రాంతస్యయద్యద్భ్రమతఃప్రతీతం।
బ్రహ్మైవతత్తద్రజతంహిశుక్తిః।
ఇదంతయాబ్రహ్మసదేవరూప్యతే।
త్వారోపితంబ్రహ్మణినామమాత్రం॥ ౨౩౮॥

తే-గీ॥ భ్రాంతునకుదోచు నదియెల్లబ్రహ్మమదియె।
చూడవెండిగదోచు నాశుక్తియెగద।
తలపజగమని నామమాత్రంబుచేత।
కల్పితంబిది బ్రహ్మమొకటియెసతము॥ ౨౩౯॥

శ్లో॥ అతఃపరంబ్రహ్మసదద్వితీయం।
విశుద్ధవిజ్ఞానఘనంనిరంజనం।
ప్రశాంతమాద్యంతవిహీనమక్రియం।
నిరంతరానందరసస్వరూపం॥ ౨౪౦॥

ఉ॥ కాన స్థిరంబు రెండవదిగల్గనిదొడ్డది నిర్మలంబు వి।
జ్ఞానఘనంబు కేవలము శాంత మనాదిలయంబు నక్రియం।
బైనది సంతతామితసుఖై కరసాకృతియు న్నిరాకృతా।
జ్ఞానవిభేదముక్ ధ్రువము శాశ్వతమైనది బ్రహ్మ మెన్నగన్॥ ౨౪౧॥

శ్లో॥ నిరస్తమాయాకృతసర్వభేదం।
నిత్యంధ్రువంనిష్కళమప్రమేయం।

అరూపమవ్యక్తమనాఖ్యామవ్యయం।
జ్యోతిస్స్వయంకించిదిదంచకాస్తి॥ ౨౩౯॥

తే-గీ॥ మఱియునిష్కళంబు మానాతిమారంబు।
నామరూపరహిత మేమియనియు।
చెప్పఁబోలనిది నశింపని ధ్రాకఁటి।
వెలుఁగునెపుడుతానె వేఱులేక॥ ౨౪౦॥

శ్లో॥ జ్ఞాతృజ్ఞేయజ్ఞానశూన్య మనంతంనిర్వికల్పకం।
కేవలాఖండచిన్మాత్రం పరంతత్త్వంవిదుర్బుధాః॥ ౨౪౦॥

తే-గీ॥ చూచునది తోఁచునదియును చూపులేక।
నంతమై నిర్వికల్పకమై యసంగ।
మై యఖండిత చిన్మాత్రమయినదీని।
తద్జ్ఞులందురు కడపలితత్త్వమనుచు॥ ౨౪౧॥

శ్లో॥ అహేయమనుపాదేయం మనోవాచామగోచరం।
అప్రమేయమనాద్యంతం బ్రహ్మపూర్ణమహంమహః॥ ౨౪౧॥

ఆ వె॥ విడువ బొందరాని విషయంబు మనసును।
మాట లందరాని బోటు బ్రహ్మ।
మఖిలమానమార మరయ మొదలొకన।
లేని నిండువెలుఁగు తానెసుమ్ము॥ ౨౪౨॥

శ్లో॥ తత్త్వంపదాభ్యామభిధీయమానయోః।
బ్రహ్మాత్మనోశ్శోధితయోర్యదీత్థం।
శ్రుత్యాతయోస్తత్త్వమసీతిసమ్యగ్।
గేకత్వమేవప్రతిపాద్యతేముహుః॥ ౨౪౨॥

తే-గీ॥ అదియునీవనుమాటల బొదలునట్టి।
బ్రహ్మమునునాత్మ నీరీతి బరగనరయు।

తత్త్వమసియను శ్రుతి నవి తడవతడవ।
క్రొక్కటిగనుండె లెస్స గానిక్కటమగును॥ ౨౪౩॥

శ్లో॥ ఐక్యంతయోర్లక్షితయోర్నవాచ్యయో।
ర్నిగద్యతేఽన్యోన్యవిరుద్ధధర్మిణోః।
ఖద్యోతభాన్వోరివరాజభృత్యయోః।
కూపాంబురాశ్యోఃపరమాణుమేర్వోః॥ ౨౪౩॥

తే-గీ॥ రవియునుమిడుంగురును మహారాజుభటుడు।
నుదధికూపంబు మేరువునొక్కటయణువు।
వలె విరుద్ధధర్మంబులౌ బ్రహ్మ మాత్మ।
లైక్యపడు లక్ష్యముననె వాచ్యమునగాదు॥ ౨౪౪॥

శ్లో॥ తయోర్విరోధోఽయముపాధికల్పితో।
నవాస్తవఃకశ్చిదుపాధిరేషః।
ఈశస్యమాయామహదాదికారణం।
జీవస్యకార్యంశ్రుణుపంచకోశం॥ ౨౪౪।

ఉ॥ వానికిరెంటికింగలుగు వైరముపాధికృతంబుపాధియే।
దేనినిజంబుగాదు విను మీశునకున్మహదాదికారణం।
బైనదిమాయ జీవునకు నైదగుకోశములన్నకార్యముల్।
జ్ఞానముడాచిలేనివి కనంబడజేయు నుపాధులారయన్॥ ౨౪౫॥

శ్లో॥ ఏతావుపాధీపరజీవయోస్తయో స్సమ్యఙ్నిరాసేనపరోనజీవః।
రాజ్యంనరేంద్రస్యభటస్యఖేటక స్తయోరపోహేనభటోనరాజా॥

తే-గీ॥ ఆపరాత్మజీవాత్మల యుపాధు।
లుడుపలెస్సగ పరుడు జీవుడును లేడు।
ప్రభువురాజ్యము భటునిదిపల్లె వీని।
బాపిచూచిన ప్రభుడును భటుడు లేడు॥ ౨౪౬॥

శ్లో॥ అథాతఆదేశ ఇతిశ్రుతిస్స్వయం।
నిషేధతి బ్రహ్మణికల్పితద్వయం।
శ్రుతిప్రమాణానుగృహీతబోధా।
త్తయోర్నిరాసఃకరణీయఏవ॥ ౨౬॥

తే-గీ॥ కాననిధియాజ్ఞయనిశ్రుతి తానెమాన్పె।
బ్రహ్మమునరెండుగాదోచు భ్రాంతినెల్ల।
శ్రుతియథార్థమైబోధించు ప్రతినజేసి।
కాననీరెండునునువి మానవనొప్పు॥ ౨౭॥

శ్లో॥ నేదంనేదంకల్పితత్వాన్నసత్యం।
రజ్జౌద్రష్ట వ్యాళవత్స్వప్నవచ్చ।
ఇత్థందృశ్యం సాధుయుక్త్యావ్యపోహ్యా।
జ్ఞేయఃపశ్చాదేకభావస్తయోర్యః॥ ౨౮॥

తే-గీ॥ కల్పితముగాన సత్యంబు గాదిది యిది।
యనుచుగనువాడు త్రాటబాముననుగలను।
మాడిక దృశ్యంబసత్తని మంచియుక్తి।
నెఱిగి యదిపాసి యొకటిగా దెలియవలయు॥ ౨౯॥

శ్లో॥ తతస్తుతౌ లక్షణయాసులక్ష్యౌ।
తయోరఖండైక రసత్వసిద్ధయే।
నాలం జహత్యా నతథాజహత్యా।
కింతూభయార్థాత్మికమైవభావ్యం॥ ౩౦॥

తే-గీ॥ వారినిరువుర లక్షణవలనబూడ।
బొసగువారికఖండైక రసమయత్వ।
మొనరదజహత్తునను జహత్తుననునైన।
దనరు జహదజహత్తను దానివలన॥ ౩౧॥

శ్లో॥ సదేవదత్తోఽహమితీవ చైకతా।
విరుద్ధధర్మాం శమపాస్యకథ్యతే।
తథాతథాత్త్వ మసీతివాక్యే।
విరుద్ధధర్మాను భయత్ర హిత్వా॥ ౨౪౯॥
శ్లో॥ సంలక్ష్యచిన్మాత్ర తయాసదాత్మనో।
రఖండభావః పరిచీయతే బుధైః।
ఏవంమహావాక్య శతేనకథ్యతే।
బ్రహ్మాత్మనోరైక్య మఖండభావః॥ ౨౫౦
చ॥ విడిచివిరుద్ధధర్మములవీడగువాడనియైక్యమొందున।
ట్లడరెడు సద్గిసీవయితి వన్నిగమోక్తి విరుద్ధధర్మము।
ల్విడిచిమహాత్ము లయ్యు భయవృత్తుల జిన్మయతన్సదాత్మతం।
దడవిశ్రుతిప్రసిద్ధమగు తత్త్వమఖండముగాంతురొందుగాక॥ ౨౫౧
శ్లో॥ అస్థూలమిత్యే తదసన్నిరస్య।
సిద్ధంస్వతో వ్యోమవదప్రతర్క్యం।
అతోమృషామాత్ర మిదంప్రతీతం।
జహీహి యత్స్వాత్మతయాగృహీతం॥ ౨౫౨॥
శ్లో॥ బ్రహ్మహమిత్యేవవిశుద్ధబుద్ధ్యా
విద్ధిస్వమాత్మానమఖండబోధం॥ ౨౫౩॥
ఉ॥ స్థూలము నేనుగాదనుచు దోచు నసత్తునుద్రోచివ్యోమముం।
బోలి తనంతసిద్ధమయి పొల్చు నతర్క్యమెటింగి కల్లయా।
జాలముదీని నేననక చక్కనిబుద్ధిన ఖండబోధమై।
క్రాలెదుబ్రహ్మమేననుచు గ్రక్కున నట్లయి యుండుమెప్పుడున్॥
శ్లో॥ మృత్కార్యం సకలంఘటాదిసతతం మృణ్మాత్రమేవాభిత।
స్తద్వత్సజ్జనితం సదాత్మకమిదం సన్మాత్రమేవాఖిలం।

యస్మాన్నాస్తి సతఃపరం కిమపితత్సత్యంసఆత్మాస్వయం।
తస్మాత్తత్త్వమసిప్రశాంతమమలంబ్రహ్మాద్వయంయత్పరం॥౨౨॥

ఉ॥ మృత్తునసౌఘటాదికముమృత్తికయేసకలంబు నట్టులే।
సత్తునబుట్టుసర్వమును సన్మయమీసకలంబు కావునన్।
సత్తునకన్నలేదొకటి సత్యమదే యదె యాత్మ గానన।
సత్తగుశుద్ధమద్వయము శాంతముబ్రహ్మము నీవెనైతిటన్॥౨౨॥

శ్లో॥ నిద్రాకల్పితదేశకాలవిషయ జ్ఞాత్రాదిసర్వంయథా।
మిథ్యాతద్వదిహాపిజాగ్రతి జగత్స్వాజ్ఞానకార్యత్వతః।
యస్మాదేవమిదంశరీరకరణ ప్రాణాహమాద్యప్యస।
త్తస్మాత్తత్త్వమసిప్రశాంతమమలం బ్రహ్మాద్వయంయత్పరం॥౨౩

మ॥ నిదురంబొచినదేశకాలముఖ రక్షేయంబులున్ జ్ఞాతయున్।
మొదలేలేనివి యెట్లైయీమెలకువ న్బొల్పొందుబ్రహ్మాండవహా।
నదిస్వాజ్ఞానకృతంబెయాట నటులేప్రాణేంద్రియాంగాదిసం।
పదలుంగానప్రశాంతనిర్మల పరబ్రహ్మంబవై తెకమై॥౨౩॥

శ్లో॥ జాతినీతికుల గోత్రదూరగం। నామరూపగుణ దోషవర్జితం।
దేశకాలవిషయాతివర్తియద్బ్రహ్మతత్త్వమసిభావయాత్మని॥౨౪

తే.గీ॥ జాతియునునీతి కులగోత్రచయముబాసి।
నామరూపాదికమును గుణంబగుణము।
లేక దిక్కాలములు నందరాకయుండు।
నదియెనీవైతి విదిమదిగుదురుపఱచు॥౨౪॥

శ్లో॥ యత్పరం సకలవాగగోచరం। గోచరం విమలబోధచక్షుషః।
శుద్ధచిద్ఘనమనాదివస్తుయద్బ్రహ్మతత్త్వమసిభావయాత్మని॥౨౫

తే.గీ॥ కడచి మాటలకందదకల్మషమగు।
జ్ఞానవేత్రమునకుగాని కానరాదు।

స్వచ్ఛమగునాకట- తెల్వి యనాదియేది।
యది యెనీవైతివిదిమది గుదురుపఱచు॥౨౫౫॥

శ్లో॥ షడ్భిరూర్మిభిర యోగియోగిహృ।
ధ్భావితంన కరణైర్విభావితం।
బుద్ధ్యవేద్యమన వద్యభూతియ।
ద్బ్రహ్మతత్త్వ మసిభావయాత్మని॥౨౫౬॥

తే-గీ॥ క్షుత్పిపాసాదికములాఱు జొరవుదేని।
యోగిహృద్ధ్యేయ మింద్రియోద్యోగదూర।
మరయరానిదిమతికి సమగ్రవిభవ।
మదియెనీవైతివిదిమది గుదురుపఱచు॥౨౫౬॥

శ్లో॥ భ్రాంతికల్పిత జగత్కలాశ్రయం।
స్వాశ్రయంచ సదసద్విలక్షణం।
నిష్కళం నిరుపమానబుద్ధిమ।
ద్బ్రహ్మతత్త్వమసిభావయాత్మని॥౨౫౭॥

తే-గీ॥ ఉన్నక్రియదోచుజగమున కునికిపట్టు।
తనకుదానుండునది యసత్సద్విభిన్న।
మిట్టిదనరాని తెల్వి మఱేమికాని।
దదియెనీవైతివిదిమది గుదురుపఱచు॥౨౫౭॥

శ్లో॥ జన్మవృద్ధిపరిణత్యపక్షయ వ్యాధినాశనవిహీనమవ్యయం।
విశ్వసృష్ట్యవవిఘాతకారణం బ్రహ్మతత్త్వమసిభావయాత్మని॥

తే-గీ॥ పుట్టుటయు పెరుగుట మాఱిపోవుటయును।
చిక్కుటయురోగియగుటయు చెడుటలేక।
యఖిలమును జేయు బెనుపసు నడపగలది।
యదియెనీవైతివిది మదిగుదురుపఱచు॥ ౨౫౮॥

శ్లో॥ అస్తభేదమనపాస్తలక్షణం నిస్తరంగజలరాశినిశ్చలం।
నిత్యముక్తమవిభక్తమూర్తియద్బ్రహ్మతత్త్వమసిభావయాత్మని॥
తే గీ॥ భేదములులేనిదియగు గుర్తుపెట్టరాని
దలలులేనిసముద్రంబు నట్లచలము।
కట్టుబడనిది యెపుడు భాగములుగాని
దదియెనీవైతివిదిమది గుదురుపఱచు॥౨౫॥
శ్లో॥ ఏకమేవ సదనేకకారణం కారణాంతర నిరాస్యకారణం।
కార్యకారణ విలక్షణంస్వయం బ్రహ్మతత్త్వ మసిభావయాత్మని॥
తే.గీ॥ ఒకటిసత్తైకారణము బహుత్వమునకు।
గారణాంతరముల జెడు గారణముల।
కారణము కార్య కారణదూరమేది।
యదియెనీవైతివిదమది గుదురుపఱచు॥౨౬॥
శ్లో॥ నిర్వికల్పక మనల్పమక్షరం యత్క్షరాక్షర విలక్షణంపరం।
నిత్యమవ్యయసుఖం నిరంజనం బ్రహ్మతత్త్వమసిభావయాత్మని॥
తే.గీ॥ కలఁగనిది ఘనమైనది కఱిగిపోని।
దక్షరక్షరములకు వేఱైనదితుద।
ధ్రువము తఱుగనిసుఖము పొందునుదగులని।
దదియెనీవైతివిదిమది గుదురుపఱచు॥౨౭॥
శ్లో॥ యద్విభాతి సదనేకధాభ్రమా।
న్నామరూపగుణ విక్రియాత్మనా।
హేమవత్స్వయమ విక్రియంసదా।
బ్రహ్మతత్త్వమసి భావయాత్మని॥౨౮॥
తే.గీ॥ ఏకమౌసత్తెభ్రమచే ననేకములగు।
పేర్లురూపులుగుణములు విక్రియలును।

గలిగినట్లుండునవికారి కనకమట్టు।
లదియెనీవైతివిదిమది గుదురుపఱచు॥౨౬౨॥

శ్లో॥ యచ్చకాస్త్యనపరం పరాత్పరం।
ప్రత్యగేకరసమాత్మలక్షణం।
సత్యచిత్సుఖ మనంతమవ్యయం।
బ్రహ్మతత్త్వ మసీభావయాత్మని॥౨౬౩॥

తే-గీ॥ అన్యమేమియులేని యవ్యయపదం బు।
నంత మఖిలాధికము సర్వ సాక్షి వేఱు।
గానిసచ్చిత్సుఖాత్మ లక్షణమునైన।
యదియెనీవైతవిదిమది గుదురుపఱచు॥౨౬౩॥

శ్లో॥ ఉక్తమర్థమిమ మాత్మనిస్వయం।
భావయేత్ప్రథిత యుక్తిభిర్ధియా।
సంశయాది రహితంకరాంబువ।
త్తేనతత్త్వనిగమో భవిష్యతి॥౨౬౪॥

తే-గీ॥ మంచియుక్తిని నీయర్థమంచితముగ।
నాత్మలో సూక్ష్మబుద్ధిచే నాకళింపు।
చేసుకొనుమిక సంశయచ్ఛేదమగుచు।
నాత్మతత్త్వంబు తెలియు గరాంబువట్లు॥౨౬౪॥

శ్లో॥ సంబోధమాత్రం పరిశుద్ధతత్త్వం।
విజ్ఞాయసంఘే నృపవచ్చసైన్యే।
తదాశ్రయస్స్వాత్మని సర్వదాస్థితో।
విలాపయబ్రహ్మణిదృశ్యజాతం॥౨౬౫॥

తే గీ॥ సేనలోరాజు నేతిగెడి చెలువున నఖి।
లార్థముల దెల్వి మాత్రమై యమలమైన।

తత్త్వముగ నెఱింగి యెడపక దానిఁ జేరి।
దృశ్యమాత్రబ్రహ్మమునఁ గల్పి స్థిరుఁడవగుము॥ ౨౬౫ ॥

శ్లో॥ బుద్ధౌ గుహాయాం సదసద్విలక్షణం।
బ్రహ్మాస్తి సత్యం పరమద్వితీయం।
తదాత్మనా యోఽత్ర వసేద్గుహాయాం।
పునర్న తస్యాంగగుహాప్రవేశః॥ ౨౬౬ ॥

తే.గీ॥ ధ్రువము సర్వాతిగమును రెండవది లేని।
పదము సదసద్విభిన్నము బ్రహ్మముండు।
బుద్ధిగుహ నది యై దాని బొందువాఁడు।
మఱల నీ దేహగుహఁ జొరంబడఁడు నిజము॥ ౨౬౬ ॥

శ్లో॥ జ్ఞాతే వస్తున్యపి బలవతీ వాసనానాదిరేషా।
కర్తా భోక్తాప్యహమితి దృఢా యాస్య సంసారహేతుః।
ప్రత్యగ్దృష్ట్యాత్మని నివసతా సాపనేయా ప్రయత్నా-
న్ముక్తిం ప్రాహుస్తదిహ మునయో వాసనాతానవం యత్॥ ౨౬౭ ॥

చ॥ నయముగ వస్తువుం దెలిసినన్ మను కర్తయు భోక్త నే యనన్।
ప్రియము బలీయమైన పలురీతుల వాసన బొల్చు దిట్టమై।
భయదభవాంకురంబిదియు బాపవలెన్ సకలాత్మవర్తితా।
నయి నిరతంబు వాసనల నంటమి ముక్తి యటండ్రు సన్మునుల్॥ ౨౬౭ ॥

శ్లో॥ అహం మమేతి యో భావో దేహాక్షాదావనాత్మని।
అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషా స్వాత్మనిష్ఠయా॥ ౨౬౮ ॥

తే.గీ॥ తెలిసి దేహేంద్రియాదిక దృశ్యమగున।
నాత్మనది నేను నాయది యనెడు భ్రాంతి।
నిరతమకలంకమౌ స్వాత్మనిష్ఠచేత।
నడపవలయును విజ్ఞుఁడౌనట్టివాఁడు॥ ౨౬౮ ॥

శ్లో॥ జ్ఞాత్వాస్వం ప్రత్యగాత్మానం బుద్ధితద్వృత్తిసాక్షిణం।
సోఽహమిత్యేవ తద్వృత్త్యా స్వాన్యత్రాత్మ మతింజహి॥ ౨౬౯॥

తే-గీ॥ బుద్ధికినిదానివృత్తుల పోకడలకు।
సాక్షియగు ప్రత్యగాత్మ నీవంచు నెఱిగి।
యదియె నేనని యదియె నీవగుచునిల్చి।
నీవుగానిదినీవను భావముడుపు॥ ౨౬౯॥

శ్లో॥ లోకానువర్తనంత్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనం।
శాస్త్రానువర్తనంత్యక్త్వా స్వాధ్యాసాపనయంకురు॥ ౨౭౦॥

తే-గీ॥ లోకమునుబూచి దానికిలోబడకయు।
తనువుగనిదానివృత్తుల దగులబోక।
శాస్త్రములగాంచియారీతి జరుపకురక।
నీవుగానిదినీవను భావముడుపు॥ ౨౭౦॥

శ్లో॥ లోకవాసనయాజంతో శ్శాస్త్రవాసనయాపిచ।
దేహవాసనయాజ్ఞానం యథావన్నైవజాయతే॥ ౨౭౧॥

తే-గీ॥ లోకమేమనునోయని వ్యాకులపడ।
శాస్త్రవిధితప్పునోయని జంకుచున్న।
కాయమేమగునోయని కలగుచున్న।
జ్ఞానమున్నదియున్నట్లు కల్గదెపుడు॥ ౨౭౧॥

శ్లో॥ సంసారకారాగృహమోక్షమిచ్ఛో।
రయోమయం పాదనిబద్ధశృంఖలం।
వదంతితద్జ్ఞాః పటువాసనాత్రయం।
యోఽస్మాద్విముక్తస్స ఉపైతిముక్తిం॥ ౨౭౨॥

తే-గీ॥ ఇలనుసంసార మను నాకయింటి నుండి।
తలగగోరెడువాని పాదములబడిన।

యిసుపసంకెల కూడువాసనలబంధ।
మది యెవనిబాయు ముక్తుడౌనతడె నిజము॥ ౨౩౨॥

శ్లో॥ జలాదిసంపర్కవశాత్ప్రభూత।
దుర్గంధధూతా గురుదివ్యవాసనా।
సంఘర్షణేనైవ విభాతిసమ్య।
గ్విధూయమానే సతిబాహ్యగంధే॥ ౨౩౩॥

తే-గీ॥ జలమున్నగువాని సంసర్గమునను।
బుట్టుచెడుకంపుగప్పిన బోలుపుచెడెడి।
యగురుపరిమళమది సానయందుచాడి।
బయటిచెడుకంపు బాపచూపట్టులెస్స॥ ౨౩౩॥

శ్లో॥ అంతస్స్రితానంతదురంతవాసనా।
ధూళీవిలిప్తా పరమాత్మవాసనా।
ప్రజ్ఞాతిసంఘర్షణతోవిశుద్ధా।
ప్రతీయతేచందనగంధవత్స్ఫుటా॥ ౨౩౪॥

తే గీ॥ అటులెలోపలి పెకురులునధికములగు।
వాసనలదుమ్ము గ్రమ్మిచూపట్టకుండు।
నట్టిపరమాత్మవాసన యతిదృఢముగ।
ప్రజ్ఞశోధింపశోభిల్లు ప్రవిమలముగ॥ ౨౩౪॥

శ్లో॥ అనాత్మవాసనాజాలైస్తిరోభూతాత్మవాసనా।
నిత్యాత్మనిష్ఠయాతేషాం నాశేభాతిస్వయంస్ఫుటా॥ ౨౩౫॥

క॥ వినుముపరమాత్మవాసన। యనాత్మవాసనలుగప్పనగపడకుండుఙ్।
ఘనమైనయాత్మనిష్ఠ మె। తనరిన నవియెల్లపొలిసి తానే వెలయుఙ్॥

శ్లో॥ యథాయథాప్రత్యగవస్థితంమన।
స్తథాతథాముంచతిబాహ్యవాసనాం।

నిశ్శేషమోక్షే సతివాసనానా।
మాత్మానుభూతిః ప్రతిబంధనూన్యా॥ ౨౭౬॥

ఆ-వె॥ మనసు మఱలినిలువ స్థితిగాడుకొల్పదిని।
బయటివాసనలను వదలుచుండు।
సర్వవాసనలును సమసిన వాత్మాను।
భవముకొంకులేక పరగుచుండు॥ ౨౭౬॥

శ్లో॥ స్వాత్మన్యేవసదాస్థిత్వా మనోనశ్యతియోగినః।
వాసనానాంక్షయశ్చాత స్వాధ్యాసాపనయంకురు॥ ౨౭౭॥

ఆ-వె॥ యోగిమనము స్వాత్మ యోగంబువిడువక।
పొంద నదెనశించు పొలియుసర్వ।
వాసనలును దానివలననే కావున।
నీవుగానిదాని నేననకుము॥ ౨౭౭॥

శ్లో॥ తమోద్వాభ్యాంరజస్సత్వా త్సత్వంశుద్ధేననశ్యతి।
తస్మాత్సత్వమవష్టభ్య స్వాధ్యాసాపనయంకురు॥ ౨౭౮॥

తే-గీ॥ తమసు పెంరెంట రజసుసత్వంబువలన।
సత్వమునునిర్మలాత్మచే సమయుగాన।
సత్వమునెనిత్యమును నీవుశరణమొంది।
నీవుగానిదినీవనుభావముడుపు॥ ౨౭౮॥

శ్లో॥ ప్రారబ్ధంపుష్యతివపు రితినిశ్చిత్యనిశ్చలః।
ధైర్యమాలంబ్యయత్నేన స్వాధ్యాసాపనయంకురు॥ ౨౭౯॥

తే-గీ॥ తనువుబోషించు ప్రారబ్ధమనుచుదెలిసి।
నిశ్చయంబూని కలగకనిలిచిధైర్య।
మాలవాలంబుగా నెట్టులయినలోన।
నీవుగానిదినీవను భావముడుపు॥ ౨౭౯॥

శ్లో॥ నాహంజీవఃపరంబ్రహ్మే త్యేతద్వ్యావృత్తిపూర్వకం।
వాసనావేగతఃప్రాప్త స్వాధ్యాసాపనయంకురు॥౫౦॥

తే-గీ॥ వాసనావేగమునబడు వాడవైన।
యపుడుజీవుడగాను బ్రహ్మంబునేను।
టంచునవి గానివెల్లను నవలద్రోచి।
నీవు గానిదినీవను భావముడుపు॥౫౦॥

శ్లో॥ శ్రుత్యాయుక్త్యా స్వానుభూత్యా।
జ్ఞాత్వాసార్వాత్మ్యమాత్మనః।
క్వచిదాభాసతఃప్రాప్త।
స్వాధ్యాసాపనయంకురు॥౫౧॥

తే-గీ॥ ఎప్పుడైననుమతి భ్రమను నెవనినేని।
నంతయునునేనయనుచు వేదార్థమునను।
యుక్తిచేస్వానుభవమున నానరదెలిసి।
నీవుగానిదినీవను భావముడుపు॥౫౧॥

శ్లో॥ అనాదానవిసర్గాభ్యా మీషన్నాస్తిక్రియామునేః।
తదేకనిష్ఠయానిత్యం స్వాధ్యాసాపనయంకురు॥౫౨॥

తే-గీ॥ వెలివిడానీకలోనివి వెలువరించు।
చుండుటకుమించి మునికిలేదొండుపనియు।
కింతయునుగాన నెపుడు దదేకనిష్ఠ।
నీవు గానిదినీవను భావముడుపు॥౫౨॥

శ్లో॥ తత్త్వమస్యాదివాక్యోత్థ బ్రహ్మాత్మైకత్వబోధతః।
బ్రహ్మణ్యాత్మత్వదార్ఢ్యాయ స్వాధ్యాసాపనయంకురు॥౫౩॥

తే-గీ॥ అదియెనీవైతివను మొదలైననిగమ।
వాక్యములబట్టినీవె యాబ్రహ్మమనుచు।

నెఱిగిబ్రహ్మమెనీవాట దృఢమగుటకు।
నీవు గానిదినీవనుభావముడుపు॥౨౮౩॥

శ్లో॥ అహంభావస్య దేహేఽస్మి న్నిశ్శేషవిలయావధి।
సావధానేనయుక్తాత్మా స్వాధ్యాసాపనయంకురు॥౨౮౪॥

తే-గీ॥ ఈశరీరముగని బుదినేననియెడు।
భ్రాంతితుదముట్ట నశియించువఱకు నేక।
చిత్తమున నైక్య భావంబుచెదరకుండ।
నీవు గానిదినీవనుభావముడుపు॥౨౮౪॥

శ్లో॥ ప్రతీతిర్జీవజగతో స్స్వప్నవద్భాతియావతా।
తావన్నిరంతరంవిద్వన్ స్వాధ్యాసాపనయంకురు॥౨౮౫॥

తే-గీ॥ తోడరిజీవుండుజగమును దోచుటెల్ల।
కేవలముస్వప్నమునవలె కృత్రిమముగ।
దోచునందాక విడువక తొలగిపోక।
నీవు గానిదినీవనుభావముడుపు॥౨౮౫॥

శ్లో॥ నిద్రాయా లోకవార్తాయా శ్శబ్దాదే రపివిస్మృతేః।
క్వచిన్నావసరందత్వా చింతయాత్మా నమాత్మని॥౨౮౬॥

తే-గీ॥ నిద్రకునులోకవార్త లన్నిటికిశబ్ద।
ముఖరవిషయంబులకు మఱపునకుగూడ।
నించుకేనియునెడమీక యెంచుచుండు।
మాత్మయందాత్మ నెపుడుప్రయత్నమునను॥౨౮౬॥

శ్లో॥ మాతాపిత్రోర్మలోద్భూతం మలమాంసమయంవపుః।
త్యక్త్వాచండాలవద్దూరం బ్రహ్మీభూయకృతీభవ॥౨౮౭॥

క॥ తలిదండ్రులమలమునజని।మలమాంసశరీరమయ్యేమాలనినట్లే।
తలవిడిచిదూరంబుగదీనిందలగిపరబ్రహ్మమవయిధన్యుడవగుమా॥౨౮౭॥

శ్లో॥ ఘటాకాశంమహాకాశ ఇవాత్మానంపరాత్మని।
విలాప్యాఖండభావేన తూష్ణీంభవసదామునే॥౭౭॥

తే-గీ॥ కడవలోనియాకాశంబుఘనతరమగు।
నాకసంబునగలయునట్లాత్మబ్రహ్మ।
మందుఁగలిపి యఖండతనొందిమౌన।
భావముననుండుమిక ననవరతమీవు॥౭౭॥

శ్లో॥ స్వప్రకాశమధిష్ఠానం స్వయంభూయసదాత్మనా।
బ్రహ్మాండమపిపిండాండం త్యజ్యతాంమలభాండవత్॥౭౮॥

తే-గీ॥ తనకుదావెల్గు నట్టియాధారమైన।
సత్తునీవయినిల్చి యసహ్యాఖలుగ।
నుండుబ్రహ్మాండ పిండాండతంశములను।
విడువుమలభాండములబోలె తడయకిపుడె॥౭౮॥

శ్లో॥ చిదాత్మనిసదానందే దేహారూఢామహంధియం।
నివేశ్యలింగముత్సృజ్య కేవలోభవసర్వదా॥౮౦॥

తే-గీ॥ తనువున దృఢంబుగా గీలుకొనినయట్టి।
నేననెడుబుద్ధి ధ్రువము విజ్ఞానమయము।
నిరతిశయసౌఖ్యరూపమౌ పరమునందు।
నిలిపిసూక్ష్మాంగమెడలి కేవలుడవగుము॥౮౦॥

శ్లో॥ యత్రైషజగదాభాసో దర్పణాంతఃపురంయథా।
తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వా కృతకృత్యోభవిష్యసి॥౮౧॥

తే-గీ॥ అద్దమునదోచుపట్టణం బట్లుజగము।
నీడయేదానియందు గాన్పించునట్టి।
బ్రహ్మమేనని తెలిసినవాడవైన।
ధన్యుడవునీవెయగుదువు మాన్యచరిత॥౮౧॥

శ్లో॥ యత్సత్యభూతం నిజరూపమాద్యం।
చిదద్వయానంద మరూపమక్రియం।
తదేత్యమిథ్యావపురుత్సృజేత।
శైలూషవద్వేషముపాత్తమాత్మనః॥ ౨౯౨॥

తే-గీ॥ సత్యమైనది మొదటిది సాటిలేని।
చిత్సుఖ మరూప మేమియు జేయనిదియు।
నైనస్వనిజరూపంబు నంది వట్టి।
నటుని వేషమువంటి యీఘటమువిడువు॥ ౨౯౨॥

శ్లో॥ సర్వాత్మనాదృశ్యమిదంమృషైవ।
నైవాహమర్థః క్షణికత్వదర్శనాత్।
జానామ్యహం సర్వమితిప్రతీతిః।
కుతోఽహమాదేః క్షణికస్యసిద్ధ్యేత్॥ ౨౯౩॥

తే-గీ॥ ఎట్లుజూచిన దృశ్యమిదెల్లకల్ల।
క్షణమునననశించునహము నిశ్చయముగాది।
దంతయును నేనెఱుంగుదుననుప్రతీతి।
క్షణమునననశించునహమాదికమునకగునె॥ ౨౯౩॥

శ్లో॥ అహంపదార్థస్త్వహమాదిసాక్షీ।
నిత్యస్సుషుప్తావపిభావదర్శనాత్।
బ్రూతేహ్యజోనిత్య ఇతిశ్రుతిస్స్వయం।
తత్ప్రత్యగాత్మా సదసద్విలక్షణః॥ ౨౯౪॥

తే-గీ॥ నేననెడువస్తువు సతంబు నిద్రయందు।
నైతముండుట నహమాది సాక్షియిదియె।
శ్రుతియుదియు దీని నిత్యుడజుండను నిదె।
సత్తును నసత్తు గానిది సర్వసాక్షి॥ ౨౯౪॥

శ్లో॥ వికారిణాం సర్వవికారవేత్తా।
నిత్యోఽవికారో భవితుంత్వమర్హసి।
మనోరథస్వప్నసుషుప్తిషుస్ఫుటం।
పునఃపునర్దృష్టమసత్త్వమేతయోః॥ ౨౯౫॥

తే-గీ॥ నెమకి సవికారముల వికారముల నెల్ల।
నెఱుగు నిత్యుఁడ వవికారి వీవ యగుదు।
వవియసత్యములగుట సర్వానుభవము।
గాదె తలపుల గలల నిద్రాదులందు॥ ౨౯౫॥

శ్లో॥ అతోఽభిమానం త్యజమాంసపిండే।
పిండాభిమానిన్యపి బుద్ధికల్పితే।
కాలత్రయాబాధ్యమఖండబోధం।
జ్ఞాత్వా స్వమాత్మాన ముపైహి శాంతిం॥ ౨౯౬॥

తే-గీ॥ కాన నీమాంసపిండంబు నేనని దీని।
నేననెడు బుద్ధికల్పితు నేని నేను।
నేనగను మూఁడుకాలాల నేకమును న।
ఖండమగు తెల్వి నేనని కనుము శాంతి॥ ౨౯౬॥

శ్లో॥ త్యజాభిమానం కులగోత్రనామ।
రూపాశ్రమేష్వార్ద్రశవాశ్రితేషు।
లింగస్యధర్మానపి కర్తృతాదీం।
స్త్యక్త్వా భవాఖండసుఖస్వరూపః॥ ౨౯౭॥

తే-గీ॥ పచ్చిపీనుగునంటి చూపట్టుచుండు।
నట్టి కుల గోత్ర నామ రూపాశ్రమముల।
నంటకయు కర్తృతాది లింగాంగ వికృతు।
లొందక యఖండసుఖరూప మొందుమయ్య॥ ౨౯౭॥

శ్లో॥ సంత్యన్యే ప్రతిబంధాః పుంసస్సంసారహేతవో దృష్టాః
తేషామేషో మూలం ప్రథమవికారో భవత్యహంకారః॥ ౨౯౭

క॥ పురుషునిసంసరణమునకు। బరికింపఁగబహువిరోధములు హేతువులౌ।
ధరనీయన్నిటిమూలం। బరఁగుమొదటివిక్రియయగునహంకారమగుట

శ్లో॥ యావత్స్యాత్స్వస్య సంబంధోఽహంకారేణ దురాత్మనా।
తావన్న లేశమాత్రాపి ముక్తివార్తా విలక్షణా॥ ౨౯౮॥

ఆ వె॥ దుష్టమైనయహము తోడిపొత్తాత్మకు।
నెంతకాలముండు నంతవఱకు।
లేటమైనముక్తి మాటరవంతయు।
చెవినిసోఁకదుముక్తి జెప్పనేల॥ ౨౯౯॥

శ్లో॥ అహంకారగ్రహాన్ముక్తః స్వరూపముపపద్యతే।
చంద్రవద్విమలః పూర్ణః సదానందస్స్వయంప్రభః॥ ౩౦౦॥

తే గీ॥ ఈయహంకారమను రాహు వెప్పుడూవిడుచు।
నపుడు నిజరూపమొంది సుధాంశునట్లు।
విమలుడును పూర్ణుడు దనంతవెలుగువాడు।
నిత్యసుఖరూపుడై యాత్మ నెగడుచుండు॥ ౩౦౦॥

శ్లో॥ యో వా పురే సోఽహమితి ప్రతీతో।
బుద్ధ్యా ప్రక్లృప్తస్తమసాతిమూఢయా।
తస్యైవ నిశ్శేషతయా వినాశే।
బ్రహ్మాత్మభావః ప్రతిబంధశూన్యః॥ ౩౦౧॥

తే గీ॥ తమముచేనేమియెఱుఁగక స్థూలమొంది।
యున్నబుద్ధిని కడుమితినొంది యుండు।
నేననెడు వీడె యుదియెల్ల మాని నేని।
బ్రహ్మమా నడ్డమేమియు రాదుమేలు॥ ౩౦౧॥

శ్లో॥ బ్రహ్మానంద నిధిర్మహాబలవతా హంకార ఘోరాహినా।
సంవేష్ట్యాత్మని రక్ష్యతే గుణమయై శ్చండైస్త్రిభిర్మస్తకైః।
విజ్ఞానాఖ్య మహాసినా శ్రుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం।
నిర్మూల్యాహిమిమంనిధిం సుఖకరం ధీరోఽనుభోక్తుం క్షమః॥

మ॥ గుణశీర్షంబులు మూడుగల్గి బలవద్ఘోరాకృతింబూని నే।
నను పెన్పాము సుబుద్ధిగుప్తమగు బ్రహ్మానందనిక్షేపముం।
బెనలంజుట్టును జుట్టికాచు శ్రుతిమద్విజ్ఞానమహాకత్తినా।
ఫణిశీర్షంబులు ద్రెంచిచంపుఘను డేపాత్రుండు తద్భుక్తికిన్॥ ౩౦౨॥

శ్లో॥ యావద్వా యత్కించిద్విష దోషస్ఫూర్తిరస్తిచేద్దేహే।
కథమారోగ్యాయభవే త్తద్వదహంతాపియోగినోముక్త్యై॥ ౩౦౩॥

ఆ-వె॥ ఎంతకాలమైన నెంతకొంచమైన।
విషము దేహమందు వెలసియున్న।
సుఖముగలుగదట్టి సుంతయు నహమున్న।
యోగివరుడుముక్తి నొందలేడు॥ ౩౦౩॥

శ్లో॥ అహమోఽత్యంత నివృత్త్యా తత్కృతనానావికల్ప సంహృత్యా।
ప్రత్యక్తత్త్వవివేకాది మహమస్మీతివిందతేతత్త్వం॥ ౩౦౪॥

తే-గీ॥ అహముని శ్శేషముగబాపి యందుబుట్టు।
నఖిలవివిధవికల్పంబు లణచి సర్వ।
భిన్నుడగుసాక్షి నెఱిగిన వేగనిది యె।
యేనని స్వరూపమును నీవె యెఱుగవచ్చు॥ ౩౦౪॥

శ్లో॥ అహంకారే కర్తర్యహమితి మతింముంచసహసా।
వికారాత్మన్యాత్మ ప్రతిఫల జుషిస్వస్థితిముషి।
యదధ్యాసాత్ప్రాప్తా జని మృతిజరాదుఃఖబహులా।
ప్రతీచశ్చిన్మూర్తే స్తవసుఖతనోస్సంసృతిరియం॥ ౩౦౫॥

చ॥ సకలవికారరూపమును స్వప్రతిబింబము నాత్మభావమో।
చకమును గర్తయౌనహము చయ్యన నేసనబోకు మట్లనన్।
సకలవిలక్షణుండవును జ్ఞానవినిర్మల మూర్తివైననీ।
కకట ఘటించెజన్మ మరణాదికసంసృతి దుఃఖసంతతుల్॥ ౩౦౫॥

శ్లో॥ సదైకరూపస్య చిదాత్మనో విభో।
రానందమూర్తే రనవద్యకీర్తేః।
నైవాన్యథా క్వాప్య వికారిణస్తే।
వినాహమధ్యా సమముష్యసంసృతిః॥ ౩౦౬॥

తే॥గీ॥ సతత మొకతీరుగా నుండు జ్ఞానమూర్తి।
పూర్ణుడానందమయుఁడును పూతయశుడు।
నైన నీ వహమేనన వేని నిర్వి।
కారునకునీకు సంసృతిగలుగదెందు॥ ౩౦౬॥

శ్లో॥ తస్మాదహంకార మిమంస్వశత్రుం।
భోక్తుర్గళేకంటకవత్ప్రతీతం।
విచ్ఛిద్య విజ్ఞాన మహాసినాస్ఫుటం।
భుజ్క్ష్వాత్మసామ్రాజ్య సుఖంయథేష్టం॥ ౩౦౭॥

తే.గీ॥ కూడుతినువాని గొంతులో గ్రుచ్చుకొన్న।
ముల్లువలెనీకు శత్రువై పొల్చుచుండు।
నహము విజ్ఞానఖడ్గనిహతము జేసి।
వలసినట్లాత్మసుఖము సర్వముభుజించు॥ ౩౦౭॥

శ్లో॥ తతోఽహమాదే ర్వినివర్త్య వృత్తిం।
సంత్యక్తరాగః పరమార్థలాభాత్।
తూష్ణీంసమాస్స్వాత్మసుఖానుభూత్యా।
పూర్ణాత్మనా బ్రహ్మణి నిర్వికల్పః॥ ౩౦౮॥

తే-గీ॥ కానసేనను మొదలైన వానిబాడము।
నీక హెచ్చైనపదవి నీకొసగియుంట।
గోరికలుమాని సుఖపడుచూరకుండు।
నిండెచెదరని బ్రహ్మమై నిల్చియెప్పుడు॥ ౩౦౮॥

శ్లో॥ సమూలకృత్తోఽపి మహానహంపున।
ర్వ్యుల్లేఖితస్స్యాద్యదిచేతసాక్షణం।
సంజీవ్యవిక్షేప శతంకరోతి।
నభస్వతాప్రావృషి వారిదోయథా॥ ౩౦౯॥

తే-గీ॥ అధికసారమహంకార మడుగుముట్ట।
దీసి ఛేదించినను బోక తెరిగిమనసు।
చెదరగనెపుట్టి చేయువిక్షేపశతము।
గాలివర్షర్తువున మేఘ గణముబోలె॥ ౩౦౯॥

శ్లో॥ నిగృహ్యశత్రో రహమోఽవకాశః।
క్వచిన్నదేయో విషయానుచింతయా।
సఏవసంజీవ నహేతురస్య।
ప్రక్షీణజంబీర తరోరివాంబు॥ ౩౧౦॥

తే.గీ॥ అహమనెడు వైరిజంపిన యువల విషయ।
చింతచేదానికెవ్వుడు నొకిటియత్నమైన।
నెడమువిడరా దదే ప్రాణమిచ్చుటదాని।
కెండునిమ్మకు నుదకంబునిడినయట్లు॥ ౩౧౦॥

శ్లో॥ దేహాత్మనాసంస్థితఏవకామీ।
విలక్షణఃకామయితాకథంస్యాత్।

అతోఽర్థసంధాన పరత్వమేవ।
భేదప్రసక్త్యా భవబంధ హేతుః॥౩౧౧॥

తే-గీ॥ కాయమే తానయిన వాఁడె కాముకుండు।
కాయమంటనివాఁడెట్లు కామియగును।
కానవిషయంబులను బొందు కాంక్షయదియె।
భేదకల్పనచే భవబీజమగును॥౩౧౧॥

శ్లో॥ కార్యప్రవర్ధనాద్బీజ ప్రవృద్ధిః పరిదృశ్యతే।
కార్యనాశాద్బీజనాశ స్తస్మాత్కార్యం నిరోధయేత్॥౩౧౨॥

ఆ-వె॥ కార్యమధికమైనఁ గారణంబధికమౌ।
కార్యమణఁగ నణఁగుఁ గారణమును।
గాన విషయవాంఛఁ బూనిక నణఁచిన।
గారణంబహము కలుగిపోవు॥౩౧౨॥

శ్లో॥ వాసనావృద్ధితః కార్యం కార్యవృద్ధ్యా చ వాసనా।
వర్ధతే సర్వథా పుంస స్సంసారో న నివర్తతే॥౩౧౩॥

తే-గీ॥ వాసనలు పెంపునొందిన ప్రబలు క్రియలు।
క్రియలు పెంపొంద వాసనల్ వృద్ధిబొందు।
నిట్టులన్యోన్యవృద్ధిచే నెన్నటికిని।
పురుషునకుమానకుండు సంసరణసరణి॥ ౩౧౩॥

శ్లో॥ సంసారబంధవిచ్ఛిత్త్యై తద్ద్వయం ప్రదహేద్యతిః।
వాసనావృద్ధిరేతాభ్యాం చింతయా క్రియయా బహిః॥ ౩౧౪॥

తే-గీ॥ తవిరి సంసారమను కట్టు ద్రెంపవీని।
రెంటి యతి కాల్చుటొప్పు సంప్రీతి విషయ।
చింత చేలోన బయట ప్రసిద్ధములగు।
క్రియలనీ రెంట వాసనల్ వృద్ధినొందు॥ ౩౧౪॥

శ్లో॥ తాభ్యాంప్రవర్ధమానాసా సూతేసంసృతిమాత్మనః।
త్రయాణాంచక్షయోపాయ స్సర్వావస్థాసుసర్వదా॥ ౩౧౫॥

శ్లో॥ సర్వత్రసర్వతస్సర్వం బ్రహ్మమాత్రావలోకనైః।
సద్భావవాసనాదార్ఢ్యా త్తత్త్రయంలయమశ్నుతే॥ ౩౧౬॥

ఆ-వె॥ వానిరెంటబెఱుగువాసనయదిమొసం।
సారిమాత్మకెప్పుడుజరుపునట్టి।
మూటిగోనిసమూలముగ నాశనముసేయ।
గలదుపాయమొకటి ఘనమువినుము॥ ౩౧౫॥

క॥ సర్వావస్థలవిడువక । సర్వస్థలములను మనసుచనుపలుదెసలన్।
సర్వముబ్రహ్మమెయంచున। ఖర్వతసద్దృష్టినిలుపు కఱగునుమూడున్॥

శ్లో॥ క్రియానాశేభవేచ్చింతా నాశోఽస్మాద్వాసనాక్షయః।
వాసనాప్రక్షయోమోక్షస్సాజీవన్ముక్తిరిష్యతే॥ ౩౧౭।

తే-గీ॥ క్రియనడంచిన విషయచింతయునశించు।
నదినశించినవాసనలవినశించు।
వాసనలుమొదలంట జెడ్డదుమెముక్తి।
యనిమొసుమ్ము జీవన్ముక్తియనెడిపదవి॥ ౩౧౭॥

శ్లో॥ సద్వాసనాస్ఫూర్తివిజృంభణేస।
త్యసావిలీనాప్యహమాదివాసనా।
అతిప్రకృష్టాప్యరుణప్రభాయాం।
విలీయతేసాధుయథాతమిస్రా॥ ౩౧౮॥

తే-గీ॥ బ్రహ్మవిషయికవాసన ప్రబలినప్పు।
డణగునహమాదివాసన యందులోన।
దట్టమైనను చీకటి తరణికిరణ।
కాంతిలోలెస్సయణగును గాదెచూడు॥ ౩౧౮॥

శ్లో॥ తమ స్తమః కార్యమనర్థజాలం నదృశ్యతే సత్యుదితే దినేశే,
తథాద్వయానందరసానుభూతౌ నైవాస్తి బంధో నచ దుఃఖగంధః॥

తే-గీ॥ భానుడుదయింప నిరులును వానికార్య,
మగునసర్థము జూపట్టదట్లెనరుడు,
సాటిలేనియానందంబు చవిగొనగన్న,
సమయుబంధంబు దుఃఖవాసనయునపుడె॥ ౩౧౯॥

శ్లో॥ దృశ్యంప్రతీతంప్రవిలాపయన్ సన్,
సన్మాత్రమానందఘనంవిభావయన్,
సమాహితస్సన్ బహిరంతరంవా,
కాలంనయేథాస్సతికర్మబంధే॥ ౩౨౦॥

తే-గీ॥ తోచుదృశ్యంబును హరించిధ్రువము సుఖఘ,
నంబుతాననియెటు చలనంబులేక,
కర్మశేషంబుగలయంత కాలముండు,
లోనవెలినైనదృఢ సమాధానమలర॥ ౩౨౦॥

శ్లో॥ ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం నకర్తవ్యః కదాచన,
ప్రమాదోమృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణస్సుతః॥ ౩౨౧॥

క॥ గుఱిదప్పి బ్రహ్మనిష్ఠను, మఱచుటెప్పుడుదగదు బ్రహ్మమానసపుతుడా,
మఱపేమృత్యువుసుమ్మని, గుఱిగాబోధించెమున్ను కురుకులపతికిన్॥

శ్లో॥ నప్రమాదాదనర్థోఽన్యో జ్ఞానినస్స్వస్వరూపతః,
తతో మోహస్తతోఽహంధీ స్తతోబంధస్తతోవ్యథా॥ ౩౨౨॥

తే-గీ॥ గుఱి నిజస్థితినుండి యేమఱుటకన్న,
జ్ఞానికికనొండుకీడెందు గలుగబోదు,
తనుమఱువమోహము జనించు దానివలన,
నగునహము దానబంధంబు నవలవెతయు॥ ౩౨౨॥

శ్లో॥ విషయాభిముఖందృష్ట్వా విద్వాంసమపివిస్మృతిః।
విక్షేపయతిధీదోషై ర్యోషాజారమివప్రియం॥ ౩౨౩॥

తే.గీ॥ విషయములదెస మఱలెడివిజ్ఞుఁడైన।
గని మఱపు బుద్ధియందు వికారములను।
బెకుఁలొనరించి జారుఁడౌ ప్రియునిఁ గాంత।
వలెనె వలపించి తన వశవర్తి జేయు॥ ౩౨౩॥

శ్లో॥ యథాప్రకృష్టంశైవాలం క్షణమాత్రంనతిష్ఠతి।
ఆవృణోతితథామాయా ప్రాజ్ఞంవాపిపరాఙ్ముఖం॥ ౩౨౪॥

తే.గీ॥ నీటిపైచికఁటిఁజా పాఁచినట్టివైవ।
నొకఁటిక్షణమైన నటునిల్చియుండనిక్రియ।
మాయ యంతర్ముఖునినైన మహితుఁడైన।
జ్ఞానినైననువిడువక కప్పుచుండు॥ ౩౨౪॥

శ్లో॥ లక్ష్యచ్యుతంచేద్యదిచిత్తమీష।
ద్బహిర్ముఖంసన్నిపతేత్తతస్తతః।
ప్రమాదతఃప్రచ్యుతకేళికందుక।
స్సోపానపఙ్క్తౌపతితోయథాతథా॥ ౩౨౫॥

ఆ.వె॥ ఇంచుకైనజిత్తమిటు నటుజలియించి।
గుఱినివిడిచిబయటకూలెనేని।
చేయితప్పిజాఱిచెండుసోపానప।
ఙ్క్తులనుబడినయట్లుదొర్లిపోవు॥ ౩౨౫॥

శ్లో॥ అతఃప్రమాదాన్నపరోఽస్తిమృత్యు।
ర్వివేకినోబ్రహ్మవిదస్సమాధౌ।
స్సమాహితస్సిద్ధిముపైతిసమ్య।
క్సమాహితాత్మాభవసావధానః॥ ౩౨౬॥

అ-వె॥ అగుటనెఱుక గలుగు నాత్మజ్ఞునిసమాధి।
యందు భాసగుమ అపుకన్న వేఱె।
మృత్యువేమిలేదు నిత్యసమాధిచే।
సిద్ధిగలుగు నెఱిగి చేయుమదియు॥ ౩౨౬॥

శ్లో॥ విషయేష్వావిశచ్చేతః సంకల్పయతి తద్గుణాన్।
సమ్యక్సంకల్పనాత్కామః కామాత్పుంసః ప్రవర్తనం॥ ౩౨౭॥

ఆ॥వె॥ మనసు విషయములను మఱిగి చొచ్చినవాటి।
గుణములెపుడు దలచు కొనుచునుండు।
మిగుల వాటిదలప దగులును కోరిక।
పురుషున దె ప్రవృత్తి బొందజేయు॥ ౩౨౭॥

శ్లో॥ తతస్స్వరూపవిభ్రంశో విభ్రష్టస్తు పతత్యధః।
పతితస్య వినా నాశం పునర్నారోహ ఈక్ష్యతే॥ ౩౨౮॥

తే-గీ॥ అంత దనరూపు విడుచు స్వరూపాంతరంబు।
నొందివపుడెయధో గతినొందునట్టు।
లైనవాడు నశించుటే గాని మఱల।
పైకి నెక్కుట యెందుం జూపట్టదకట॥ ౩౨౮॥

శ్లో॥ సంకల్పం వర్జయేత్తస్మాత్సర్వానర్థస్య కారణం।
జీవతో యస్య కైవల్యం విదేహే చ స కేవలః॥ ౩౨౯॥

తే-గీ॥ కానదుం వస్తువులను నెల్ల గారణమగు।
తలపు విడువంగవలె దేహ తలపులేక।
దేహముండియు నంటదా దేహమతడు।

యత్కించిత్పశ్యతో భేదం భయం బ్రూతే యజుశ్శ్రుతిః॥ ౩౨౯ ౪॥

శ్లో॥ యదా కదా వాపి విపశ్చిదేష బ్రహ్మణ్యనంతేప్యణుమాత్రభేదం।

పశ్యత్యథాముష్యభయంతదైవ యద్వీక్షితంభిన్నత యాప్రమాదాత్॥

తే-గీ॥ భేదమొకింతయైనభావించువాని।
కగుభయంబనిరెండవనిగమవాణియె।
భయముగలుగుటతనకంబెపరుడొకండు।
కలిగినఁకాదెయెందులోకంబునందు॥ ౩౩౦॥

వ॥ ఎప్పుడేనేమఱుపాటుచేత నిపుణుండేనైనసుజ్ఞానిబ్ర
హ్మపదంబంతములేనిదాని నొకటంబాపించియున్నప్పుడు।
స్వపదార్థంబణుమాత్రమైన మదిలోనంటూచెనేనిభయం।
బపుడేపుట్టు ప్రమాదమేమరణమౌ నన్వాకుతప్పేనొకో॥ ౩౩౧

శ్లో॥ శ్రుతిస్మృతిన్యాయశతైర్నిషిద్ధే।
దృశ్యేఽత్రయస్స్వాత్మమతింకరోతి।
ఉపైతిదుఃఖోపరిదుఃఖజాతం।
నిషిద్ధకర్తాసమలిమ్లుచోయథా॥ ౩౩౧॥

తే-గీ॥ శ్రుతులుస్మృతులును న్యాయసంతతులు వట్టి।
దనెడియీదృశ్యమేనను నతడెపొందు।
తుములముగవచ్చు దుఃఖజాతములనెల్ల।
చేయవలదన్నపని చేయుస్తేనుడట్లు॥ ౩౩౨॥

శ్లో॥ సత్యాభిసంధానరతోవిముక్తో।
మహత్త్వమాత్మీయముపైతినిత్యం।
మిథ్యాభిసంధానరతస్తునశ్యే।
ద్దృష్టంతదేతద్యదచోరచోరయోః॥ ౩౩౨॥

తే-గీ॥ సత్యమగుదాన నాసక్తిసలుపువాడు।
ముక్తుడై యాత్మమహిమదాఁబొందునెపుడు।
వట్టిదగుదాననాసక్తిబుట్టెనేని।

చెడు నచోఁటని చోఁటని చెలువమునను॥ ౩౩౩॥

శ్లో॥ యతిరసదనుసంధింబంధహేతుంవిహాయ।
స్వయమయమహమస్మీత్యాత్మదృష్ట్యైవతిష్ఠేత్।
సుఖయతిననునిష్ఠాబ్రహ్మణిస్వానుభూత్యా।
హరతిపరమవిద్యాకార్యదుఃఖంప్రతీతం॥ ౩౩౩॥

ఉ॥ యతి తగులంబు లానస్సు నసదర్థములం గడద్రోచి శుద్ధమౌ।
మతి బరమాత్మ తానని యె మానక యెప్పుడునుండ నోప్పనం।
తత పరమాత్మనిష్ఠసుఖదంబగు సమ్మునిజానుభూతిచే।
ద్రుతగతి నద్దిభ్రాంతికృత దుఃఖమశేషముబాపుబ్రతకా॥ ౩౩౪॥

శ్లో॥ బాహ్యానుసంధిఃపరివర్ధయేత్ఫలం।
దుర్వాసనామేవతతస్తతోఽధికాం।
జ్ఞాత్వావివేకైఃపరిహృత్యబాహ్యం।
స్వాత్మానుసంధింవిదధీతనిత్యం॥ ౩౩౪॥

ఆ-వె॥ వెలిపదార్థములనె తలచుచుండిన చేష్ట।
వాసనలఫలంబె ప్రబలుచెఱిగి।
కాన తెలివిగలిగి కడద్రోచి వెలివాని।
స్వాత్మనిష్ఠ నెపుడు నలరవలయు॥ ౩౩౫॥

శ్లో॥ బాహ్యేనిరుద్ధేమనసఃప్రసన్నతా।
మనఃప్రసాదేపరమాత్మదర్శనం।
తస్మిన్సుదృష్టేభవబంధనాశో।
బహిర్నిరోధఃపదవీవిముక్తేః॥ ౩౩౫॥

తే-గీ॥ వెలివిషయముల వాపిన వెలుగుమనసు।
మనసు వెలిగిన బరమాత్మ గనగవచ్చు।

పరగనదిగాంచ సంసారబంధమూడు।
గాన వెలివాకుటదియె మోక్షంబుపట్టు॥ ౩౩౬॥

శ్లో॥ కః పండితస్సన్ సదసద్వివేకీ।
శ్రుతిప్రమాణః పరమార్థదర్శీ
జానన్ హికుర్యాదసతోఽవలంబం।
స్వపాతహేతోశ్శిశువన్ముముక్షుః॥ ౩౩౭॥

చ॥ చదువరియై స్థిరాస్థిరవిచార మెఱింగి శ్రుతిన్నిజంబుగా।
మదినెఱనమ్మి యెక్కువగుమంచి స్థితింగనిముక్తిగోరువా।
డివిసకలంబువట్టిదని దృశ్యమెఱింగియుదీనిపట్టునం।
బొదలునెచాలుబోలితనుముంచెదు దానినినమ్మి యెవ్వడేన్॥ ౩౩౭॥

శ్లో॥ దేహాదిసంసక్తిమతోనముక్తి।
ర్ముక్తస్య దేహాద్యభిమత్యభావః।
సుప్తస్యనోజాగరణంనజాగ్రత।
స్స్వప్నస్తయోర్భిన్న గుణాశ్రయత్వాత్॥ ౩౩౭॥

చ॥ తనువుమొదల్సమస్తమును తానను వానికిముక్తిలేదు ము।
క్తునకవి యెల్లదాననెదు దుర్భ్రమయుండదు నిద్రబోవునా।
తనికిలవేగియుండుటయు తథ్యమమేల్కొనియుండునట్టియా।
తనికిగలల్ పొసంగని విధంబునభిన్నగుణంబులౌటచేన్॥ ౩౩౮॥

శ్లో॥ అంతర్బహిస్స్వం స్థిరజంగమేషు।
జ్ఞాత్వాత్మనాధారతయావిలోక్య।
త్యక్తాఖిలోపాధిరఖండరూపః।
పూర్ణాత్మనాయస్స్థిత ఏషముక్తః॥ ౩౩౮॥

తే-గీ॥ తానెస్థిరచరములనుందులోను బయట।
ననియెఱిగి తానె యాధారమన్నిటికని।

కని యుపాధులవిడిచి యఖండుడగుచు।
నిండియుండు నతండె ముక్తుండుజగతి॥ ౩౩౯॥

శ్లో॥ సర్వాత్మనాబంధవిముక్తిహేతు।
స్సర్వాత్మ భావాన్నపరోఽస్తికశ్చిత్।
దృశ్యాగ్రహేసత్యుపపద్యతేఽసౌ।
సర్వాత్మభావోఽస్యసదాత్మ నిష్ఠయా॥ ౩౩౯॥

తే గీ॥ అంతయును దానెయైయుండునంతకన్న।
నొండువేరవెద్దియును కట్టులుడుప లేదు।
సర్వమును దానెయగుట దృశ్యంబుపేక్షు।
చేసితనుదానెవిడువకెంచినలభించు॥ ౩౪౦॥

శ్లో॥ దృశ్యస్యాగ్రహణం కథన్నుఘటతేదేహాత్మనాతిష్ఠతో।
బాహ్యార్థాను భవప్రసక్త మనసస్తత్తత్క్రియాంకుర్వతః।
సన్న్యస్తాఖిలధర్మ కర్మవిషయైర్నిత్యాత్మనిష్ఠాపరై।
స్తత్త్వజ్ఞైఃకరణీయ మాత్మనిసదానందేచ్ఛుభిర్యత్నతః॥ ౩౪౦॥

చ॥ గుణములు కర్మముల్విషయకోటులు మాని సదాత్మనిష్ఠచే।
ననిశమునిత్యసౌఖ్యరతులై పరతత్త్వమెఱుంగునట్టిస।
న్మునులకుగాక దృశ్యమునుబొందమిగల్గునె తాను దేహమే।
యనివిషయాశ్రితుఁడై వెలిసినయ్యాయిచెయ్వులు చేయువానికిన్॥ ౩౪౧

శ్లో॥ సర్వాత్మసిద్ధయేభిక్షోః కృతశ్రవణ కర్మణః।
సమాధింవిదధాత్యేషా శాంతోదాంత ఇతిశ్రుతిః॥ ౩౪౧॥

తే-గీ॥ వినదగిన వెల్లగురు ముఖమునననువినిన।
యవల యోగికి నంతయు నతడెయగుట।
యనుభవముగల్గవలయుటకై సమాధి।
గనుమనియెశాంతుడును దాంతుడేనెడి శ్రుతియు॥ ౩౪౨॥

---

* శ్రు॥ శాంతో దాంత ఉపరత స్తితిక్షుస్సమాహితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యేత్॥

శ్లో॥ అస్మాథశక్తేరహమోవినాశః।
కర్తుంనశక్యస్సహసాపిపండితైః।
యేనిర్వికల్పాఖ్య సమాధినిశ్చలా।
స్తానంతరానంత భవాహవాసనాః॥ ౩౪౨॥

తే-గీ॥ కలకలేనిసమాధిలో గదలకుండు।
వారేలకుదకగ నెంతవిద్వాంసులకును।
ప్రబలమౌనహము నణపంగరాదు।
వాసనలునిల్వలేకచూపట్టుకతన॥ ౩౪౩॥

శ్లో॥ అహంబుద్ధ్యైవమోహాన్యా యోజయిత్వావృతేర్బలాత్।
విక్షేపశక్తిఃపురుషం విక్షేపయతితద్గుణైః॥ ౩౪౩॥

తే-గీ॥ మోహమొదవించుశేసను బుద్ధితోడ।
నావరణశక్తిబలమున సంటగట్టి।
పురుషునాబుద్ధిగుణములసరణినెగర।
జిమ్ముచుండునుసుమ్ము విక్షేపశక్తి॥ ౩౪౪॥

శ్లో॥ విక్షేపశక్తివిజయోవిషమోవిధాతుం।
నిశ్శేషమావరణశక్తినివృత్త్యభావే।
దృగ్దృశ్యయోస్స్ఫుటపయోజలవద్విభాగే।
నశ్యేత్తదావరణమాత్మనిచ స్వభావాత్॥ ౩౪౪॥

తే-గీ॥ ఆవరణశక్తిమొదలంట నణచువఱకు।
నెచ్చువిక్షేపశక్తిజయింపనరిది।
యావృతినశించుపాలునీరట్లుచూపు।
రూపునేర్పడియాత్మస్వరూపమొంద॥ ౩౪౫॥

శ్లో॥ నిస్సంశయేనభవతిప్రతిబంధశూన్యో।
విక్షేపణంనహితదాయదిచేన్మృషార్థే।

సమ్యగ్వివేకస్ఫుటబోధజన్యా।
విభజ్యదృగ్దృశ్య పదార్థతత్త్వం।
శ్లో॥ భిన త్తిమాయా కృత మోహబంధం।
యస్మాద్విముక్తస్య పునర్నసంసృతిః॥ ३౪౫॥
ఉ॥ సందియముల్లసిల్లింప ననిశంబునునడ్డములేక యాత్మవే।
ల్పొందు మృషార్థసంగతిని లోలతబోడాకవేళబోవ జ్ఞ।
త్రిందగఁజూపురూపువెస వేఁగొనరించి నిజస్వరూపముం।
బొందినమాయకట్లుడుగు ముక్తుడగుంబడడింక సంస్మృతిఁ॥ ३౪౬॥
శ్లో॥ పరావరైకత్వ వివేకవహ్ని। ర్దహత్యవిద్యా గహనంహ్యశేషం।
కింస్యాత్పునస్సంసరణస్యబీజ।మద్వైతభావంసముపేయుషోఽస్య॥
తే గీ॥ ఆత్మపరమాత్మయును నొకండనెడు తెలివి।
కాఱుచిచ్చిదిస్వాజ్ఞాన కాననంబు।
సర్వమునుగాల్చునింక సంసారబీజ।
మెద్దిదనకేకమనుభావమెనసెనేని॥ ३౪౭॥
శ్లో॥ ఆవరణస్యనివృత్తి ర్భవతిచసమ్యక్పదార్థ సందర్శనతః।
మిథ్యాజ్ఞానవినాశ స్తద్విక్షేప జనితదుఃఖనివృత్తిః॥ ३౪౮॥
క॥ పరతత్త్వము తెస్సగదా। నరసికనిననావరణముహతమైపోవుఁ।
దిరముగ లేనిదిదోచుట। విరమించినమానుసకల విక్షేపార్తుల్॥ ३౪౯॥
శ్లో॥ ఏతత్త్రితయందృష్టం సమ్యగ్రజ్జుస్వరూపవిజ్ఞానాత్।
తస్మాద్వస్తుసతత్త్వం జ్ఞాతవ్యంబంధముక్తయే విదుషా॥ ३౫౦॥
తే గీ॥ భ్రాంతికాధారమైన యాత్రాటినిజము।
దెలియ సదసద్వివేకము దెలియుమూఁడు।
కట్టువిడుపించుకొనఁగోరు ఘనులుబ్రహ్మ।
వస్తుపుసలక్షణము గనవలయు నరసి॥ ३౫౧॥

శ్లో॥ అయోఽగ్నియోగాదివ సత్సమన్వయాత్
మాత్రాదిరూపేణ విజృంభతే ధీః।
తత్కార్యమేతత్త్రితయం యతో మృషా
దృష్టం భ్రమస్వప్నమనోరథేషు॥ ౩౮౯॥

తే.గీ॥ వహ్నిగూడినయినుము కైవడిని సత్తు
గలిసి మతి యింద్రియాద్యాకృతులను బొందు
దానివని రెయిమూడును గానవిదియు
భ్రమను గల తలపున దోచుపగిది కల్ల॥ ౩౯౦॥

శ్లో॥ తతో వికారాః ప్రకృతేరహంముఖా
దేహావసానా విషయాశ్చ సర్వే।
క్షణేఽన్యథాభావితో హ్యమీషా
మసత్త్వమాత్మా తు కదాపి నాన్యథా॥ ౩౯౦॥

క॥ విను మేనను నది మొదలుగ
తనువు వఱకు విషయగణ యుతంబుగ బ్రకృతిం
దనరు వికారంబుల ను
క్షణము నొందెడు మిథ్య లాత్మ గనఁ జేమార్పున్॥ ౩౯౧॥

శ్లో॥ నిత్యాద్వయాఖండచిదేకరూపో
బుద్ధ్యాదిసాక్షీ సదసద్విలక్షణః।
అహంపదప్రత్యయలక్షితార్థః
ప్రత్యక్సదానందఘనః పరాత్మా॥ ౩౯౧॥

శ్లో॥ ఇత్థం విపశ్చిత్సదసద్విభజ్య
నిశ్చిత్య తత్త్వం నిజబోధదృష్ట్యా।
జ్ఞాత్వా స్వమాత్మాన మఖండబోధం
తేభ్యో విముక్తః స్వయమేవ శామ్యతి॥ ౩౯౨॥

సీ॥ సుస్థిరంబైనది జోడు లేనిది వేఱు - వేఱుగానిది యొకట విధమైన।
బోధరూపైనది బుద్ధ్యాదులకు సాక్షి - సదసత్తులకు విలక్షణము పరము।
నేననుగుటుతుచేఁగానంగబడునది - తనకు దానైదేని దగులనియది।
యన్నియు నేకమై యెన్నడు మాఱని - యానందముల సారమది యె బ్రహ్మ॥

తే-గీ॥ మనుచు విజ్ఞుండు నిజముకల్ల విమర్శ।
జేసి స్థిరుడయి తన ప్రజ్ఞచేత తను స।
ఖండమగు తెల్విగా గనియుండెనేని।
సకలవికృతులు వీడి ప్రశాంతుడగును॥ ౩౫౨॥

శ్లో॥ అజ్ఞానహృదయగ్రంథేర్నిశ్శేషవిలయస్తదా॥
సమాధినావికల్పేన యదాద్వైతాత్మదర్శనం॥ ౩౫౩॥

క॥ రెండవది లేక నీవా।
గకండవఖండముగ నిర్వికల్పసమాధి।
న్నుండినపుడె యెఱుగమియను
మొండిముడియు మదిని మొదలుముట్టగ విడుచున్॥ ౩౫౩॥

శ్లో॥ త్వమహమిదమితీయం కల్పనాబుద్ధిదోషా।
త్ప్రభవతి పరమాత్మన్యద్వయే నిర్విశేషే।
ప్రవిలసతి సమాధావస్య సర్వోవికల్పో।
విలయనముపగచ్ఛేద్వస్తుతత్త్వావధృత్యా॥ ౩౫౪॥

ఉ॥ ఎన్నడు దన్ను మించినది యేనియు రెండవదేది లేనిదై।
యున్న పరాత్మునందు మతి యుండు వికారము బట్టియున్నయ।
ట్లున్నవి నేను నీ విదియు నుండుట కల్ల సమాధి నిల్చినీ।
వున్నచిచూడు లేక మతినూరక తోచునవెల్ల మాసెడున్॥ ౩౫౪॥

శ్లో॥ శాంతో దాంతః పరముపరతః క్షాంతియుక్తస్సమాధిం।
కుర్వన్నిత్యం కలయతి యతిః స్వస్య సర్వాత్మభావం।

తేనావిద్యాతిమిరజనితాన్ సాధుదగ్ధ్వావికల్పాన్।
బ్రహ్మీకృత్యానివసతిసుఖం నిష్క్రియోనిర్వికల్పః॥ ౩౫౫॥

తే.గీ॥ శమముదమముపరతితితిక్షలునుగలిగి।
నిత్యముసమాధిఁదానెయున్నియయుపరగు।
వాడవిద్యావికారముల్వాడగాల్చి।
కలకక్రియలేక బ్రహ్మమైకాంచుసుఖము॥ ౩౫౫॥

శ్లో॥ సమాహితాయే ప్రవిలాప్యబాహ్యం।
శ్రోత్రాదిచేతస్స్వమహంచిదాత్మని।
తఏవముక్తాభవపాశబంధైః।
ర్నాన్యేతుపారోక్ష్యకథాభిధాయినః॥ ౩౫౬॥

తే.గీ॥ వెలుపలనుపోచునింద్రియ విషయములను।
జిత్తమునహమ్మునుసమాధి జిత్స్వరూప।
మునగలుపువారె భవపాశముక్తులనగ।
ననుభవములేని కథకులిట్లగుదురయ్య॥ ౩౫౬॥

శ్లో॥ ఉపాధిభేదాత్స్వయమేవభిద్యతే।
చోపాధ్యపోహే.స్వయమేవ కేవలః।
తస్మాదుపాధేర్విలయాయ.విద్వాన్।
వసేత్సదాకల్పసమాధినిష్ఠయా॥ ౩౫౭॥

తే.గీ॥ పెక్కులగునుపాధిని దాను పెక్కులగును।
తలగిననుపాధి తానుమాత్రంబునిలుచు।
గానయెప్పుడు విజ్ఞుండుకలకలేని।
యంచితసమాధిని నుపాధినణచవలయు॥ ౩౫౭॥

శ్లో॥ సతిసక్తోనరోయాతి సద్భావం హ్యేకనిష్ఠయా।
కీటకోభ్రమరంధ్యాయన్ భ్రమరత్వాయకల్పతే॥ ౩౫౮॥

తే-గీ॥ చెదరకనరుండు సద్వస్తుచింతసేయ।
తానుసద్వస్తువై నిల్చిధన్యుడగును।
పురుగుతుమ్మెదదనమదిగుఱిదలంచి।
తానుతుమ్మెదయగుగాదె ధరణియందు॥ ౩౫౭॥

శ్లో॥ క్రియాంతరాసక్తిమపాస్యకీటకో।
ధ్యాయన్నలిత్వం హ్యళిభావమృచ్ఛతి।
తథైవయోగీ పరమాత్మతత్త్వం।
ధ్యాత్వాసమాయాతితదేకనిష్ఠయా॥ ౩౫౮॥

తే-గీ॥ వేఱుపనిసేయునాసక్తివిడిచిపుఱుగు।
తుమ్మెదనుమదిధ్యానించి తుమ్మెదయగు।
యోగియుమనస్సె యేకాగ్రమొందునిష్ఠ।
బ్రహ్మతత్త్వముధ్యానించిబ్రహ్మమగును॥ ౩౫౮॥

శ్లో॥ అతీవసూక్ష్మం పరమాత్మతత్త్వం।
నస్థూలదృష్ట్యాప్రతిపత్తుమర్హతి।
సమాధినాత్యంత సుసూక్ష్మవృత్త్యా।
జ్ఞాతవ్యమార్యై రతిశుద్ధబుద్ధిభిః॥ ౩౬౦॥

క॥ పరతత్త్వంబతిసూక్ష్మం। బరయబడదు స్థూలదృష్టి నార్యులచేసు।
స్థిరశుద్ధబుద్ధినెఱుగం। దరమగునతిసూక్ష్మవృత్తిదగినసమాధిన్॥ ౩౬౦

శ్లో॥ యథాసువర్ణం పుటపాకశోధితం।
త్యక్త్వామలం స్వాత్మగుణం సమృచ్ఛతి।
తథామనస్సత్త్వరజస్తమోమలం।
ధ్యానేనసంత్యజ్యసమేతి తత్త్వం॥ ౩౬౧॥

తే-గీ॥ మంచిపుటమునబంగారు మైలవిడిచి।
తనదురూపగు మేల్మియైతనరునట్లె।
మానసముదోషగుణముల మైలవిడిచి।
ధ్యానమునశుద్ధతత్త్వమై తనరుచూవె॥ ౩౬౧॥

శ్లో॥ నిరంతరాభ్యాస వశాత్తదిత్థం
పక్వంమనోబ్రహ్మణి లీయతేయదా।
తదాసమాధి స్సవికల్పవర్జిత।
స్స్వతోఽద్వయానందరసానుభావకః॥ ౩౬౨॥

తే-గీ॥ నిత్యమీరీతినభ్యాస నియతిజరుప।
పక్వమైమానసమడంగు బ్రహ్మమందు।
నప్పుడునిరతిశయానంద మారగింప।
నిచ్చునవికల్పకసమాధి వచ్చుదాన॥ ౩౬౨॥

శ్లో॥ సమాధినానేన సమస్తవాసనా।
గ్రంథేర్వినాశోఽఖిలకర్మనాశః।
అంతర్బహిస్సర్వ తఏవసర్వదా।
స్వరూపవిస్ఫూర్తి రయత్నతస్స్యాత్॥ ౩౬౩॥

తే-గీ॥ ఈసమాధినిచెడునెల్ల వాసనలును।
కర్మములుమాయుమేలాటన్న గలయపోలె।
నెల్లపుడులోనఁబయటను నెల్లదెసల।
దానెయైయుంటయూరక కానవచ్చు॥ ౩౬౩॥

శ్లో॥ శ్రుతేశ్శతగుణంవిద్యా న్మననంమననాదపి।
నిధిధ్యాసంలక్షగుణ మనంతంనిర్వికల్పకం॥ ౩౬౪॥

తే-గీ॥ వినుటకంటెనూటింతలు ఘనముమనన।
మంతకంటెనులక్షగుణాధికంబు।

ధ్యాన మికనంతకంబెననంతగుణము।
లధికమవికల్పకసమాధి యనఘచరిత॥౩౬౪॥

శ్లో॥ నిర్వికల్పకసమాధినాస్ఫుటం బ్రహ్మతత్త్వమవగమ్యతేధ్రువం।
నాన్యథాచలతయామనోగతేః ప్రత్యయాంతరవిమిశ్రితంభవేత్॥

తే-గీ॥ నిర్వికల్పసమాధిచే నికుఁవముఁగ।
బ్రహ్మతత్త్వంబెఱుంగనౌస్పష్టముగను।
వేఱువిధమునగాదది వివిధవిషయ।
మిశ్రితమగుమానసంబు చంచలముగాన॥౩౬౫॥

శ్లో॥ అతస్సమాధత్స్వయతేంద్రియస్సనిర్నంతరంశాంతమనాఃప్రతీచి
విధ్వంసయధ్వాంతమనాద్యవిద్యయా కృతంసదేకత్వవిలోకనేన॥

తే-గీ॥ కాననింద్రియములనరికట్టి మనసు।
చలనమునుమాన్పిబ్రహ్మంబు గలిపి యట్లె।
నిలువుమెడపకసన్మాత్ర నిష్ఠచేన।
నాదియగుమాయాచీకటి నఖిలమణచు॥౩౬౬॥

శ్లో॥ యోగస్యప్రథమంద్వారంవాఙ్నిరోధోఽపరిగ్రహః।
నిరాశాచనిరీహాచనిత్యమేకాంతశీలతా॥౩౬౭॥

క॥ పలుకమి యేవిషయములో।పలికిగొనమి యాసలేమి వలవమి యొంటి
న్నిలుచుటనునివియెయోగ।స్థలము మొదలివాకిలియిదిదాటుము వేగన్॥

శ్లో॥ ఏకాంతస్థితిరింద్రియోపరమణే హేతుర్దమశ్చేతసః।
స్సంరోధేకరణంశమేనవిలయంయాయాదహంవాసనా।
తేనానందరసానుభూతిరచలా బ్రాహ్మీసదాయోగిన।
స్తస్మాచ్చిత్తనిరోధఏవసతతంకార్యః ప్రయత్నాన్మునేః॥౩౬౮॥

ఉ॥ ఊరకయుందునింద్రియములొంటిగనున్న దమంబుచేసినన్।
వారితమానుచిత్తగతి నాశమున్బొందు శమంబుచేనహం।

కారణపువాసనల్విదపగల్గు దిరంబగుబ్రహ్మసౌఖ్యముకె।
వారకచిత్తమెప్పుడును వారణసేయగనొప్పమానికిౕ॥ ౩౬౮॥

శ్లో॥ వాచంనియచ్ఛాత్మనితంనియచ్ఛ।బుద్ధౌధియంయచ్ఛచబుద్ధిసాక్షిణి।
తంచాపిపూర్ణాత్మనినిర్వికల్పే। విలాప్యశాంతింపరమాంభజస్వ॥

తే.గీ॥ మాటమనమును మనసులో మనసునురిచు।
బుద్ధిబుద్ధిని జేర్పుము బుద్ధిసాక్షి
బుద్ధిసాక్షినిగోని పరిపూర్ణమైన।
నిర్వికల్పాత్మగలిపి శాంతినివహించు॥ ౩౬౯॥

శ్లో॥ దేహప్రాణేంద్రియమనో బుద్ధ్యాదిభిరుపాధిభిః।
యైర్యైర్వృత్తేస్సమాయోగస్తత్తద్భావోఽస్యయోగినః॥ ౩౭౦॥

తే.గీ॥ తనువుప్రాణేంద్రియములును మనసుబుద్ధి।
మొదలగునుపాధులనువృత్తి పొదలుచుండి।
దేనిదేనినిదాగూడు దానిదాని।
యట్లైతానగుచుండు నిట్లైవయోగి॥ ౩౭౦॥

శ్లో॥ తన్నివృత్త్యాముసేస్సమ్యక్సర్వోపరమణంసుఖం।
సందృశ్యతేసదానంద రసానుభవవిప్లవః॥ ౩౭౧॥

తే.గీ॥ అట్టివృత్తియె లేకుండునట్టిమునికి।
నంతయునుమాను సుఖమగు నపుడుగాదె।
విడువకానందరసవృష్టి వెల్లివిరియ।
గని తనివితీఱ దానిద్రాగంగగల్గు॥ ౩౭౧॥

శ్లో॥ అంతస్త్యాగో బహిస్త్యాగో విరక్తస్యైవయుజ్యతే।
త్యజత్యంతర్బహిస్సంగం విరక్తస్తుముముక్షయా॥ ౩౭౨॥

తే.గీ॥ వెలివిమానగమతియు లోపలివిమాన।
వశమువిరక్తునికెగాని పరునకౌనె।

ముక్తి గలకోరిక వైరాగ్యయుక్తుడరసి।
బయటిలోపలికూటముల్వరగమాను॥౩౭౨॥

శ్లో॥ బహిస్తువిషయైస్సంగం తథాంతరహమాదిభిః।
విరక్త ఏవశక్నోతి త్యక్తుంబ్రహ్మణిసంస్థితః॥౩౭౩॥

క॥ ఉరువిషయసంగము న్వెలి సరిలేనియహంక్రియాదిసంగములోనం।
బరిమార్చబ్రహ్మనిష్ఠం బరగువిరక్తునకెగాక పరులకుదరమే॥౩౭౩॥

శ్లో॥ వైరాగ్యబోధౌపురుషస్యపక్షివ।
త్పక్షౌవిజానీహివిచక్షణత్వం।
విముక్తిసౌధాగ్రలతాధిరోహణం।
తాభ్యాంవినానాన్యతరేణసిద్ధ్యతి॥౩౭౪॥

తే.గీ॥ ఎట్లుపక్షికి వృక్షాగ్రమెక్క రెక్క।
లట్లులేముక్తిమేడపైకెట్టుచేర।
బురుషునకుసాధనంబులువిరతి తెలివి।
యివిగలుగకొండ్ల సిద్ధి గాదెఱుగుసుమతి॥౩౭౪॥

శ్లో॥ అత్యంతవైరాగ్యవతస్సమాధి।
స్సమాహితస్యైవదృఢప్రబోధః।
ప్రబుద్ధతత్త్వస్యహిబంధముక్తి।
ర్ముక్తాత్మనోనిత్యసుఖానుభూతిః॥౩౭౫॥

తే.గీ॥ అధికవైరాగ్యయుతునకే యగుసమాధి।
యాసమాధినినిల్చువాడందు తెలివి।
తెలివిగలవానికే కట్లు తెగినవిడుపు।
విడుపుగలవాడె యెప్పుడు బడయుసుఖము॥౩౭౫॥

శ్లో॥ వైరాగ్యాన్నపరంసుఖస్య జనకంపశ్యామివశ్యాత్మన।
స్తచ్చేచ్ఛుద్ధతరాత్మబోధ సహితంస్వారాజ్యసామ్రాజ్యధుక్।

ఏతద్ద్వారమజస్రముక్తియువతే ర్యస్మాత్త్వమస్మాత్పరం।
సర్వత్రాస్పృహయాసదాత్మని సదా ప్రజ్ఞాంకురుశ్రేయసే॥

చ॥ మనసునునిల్పుపుణ్యునకు మంచిసుఖంబొసగన్విరక్తిగా।
కొనరవివేకవి యావిరతియు న్విమలంబగు తెల్విగూడినన్।
ఘనమగుబ్రహ్మరాజ్య పదగౌరవమిచ్చునుముక్తికామినిం।
గను తెరువిద్ది గాన పరుగల్పుమతిన్ భ్రమమాని మేలగన్॥ ౩౭౬

శ్లో॥ ఆశాంఛిందివిషోపమేషు విషయేష్వేషైవమృత్యోఃకృతి।
స్త్యక్త్వాజాతికులాశ్రమేష్వభి మతింముంచాతిదూరాత్క్రియాః॥
దేహాదావసతిత్యజాత్మధిషణాం ప్రజ్ఞాంకురుష్వాత్మని।
త్వంద్రష్టాస్యమలోఽసినిర్ద్వయి పరబ్రహ్మాసియద్వస్తుతః॥ ౩౭౭

చ॥ విడువిషమట్లుమృత్యుపదమై ప్రదమౌవిషయాశకొంచెముం।
దడవకుజాతినీతికులధర్మములం గ్రియలుంచుదవ్వులన్।
జడములదేహముఖ్యముల నల్పక నేననుబుద్ధిబ్రహ్మమం।
దడపుముసాక్షివద్వయ శివాకృతిబ్రహ్మమవై తికావునన్॥ ౩౭౭॥

శ్లో॥ లక్ష్యేబ్రహ్మణిమానసం దృఢతరంసంస్థాప్యబాహ్యేంద్రియం।
స్వస్థానేవినివేశ్యనిశ్చలతను శ్చోపేక్ష్యదేహస్థితిం।
బ్రహ్మాత్మైక్యముపేత్యతన్మయతయాచాఖండవృత్త్యానిశం।
బ్రహ్మానందరసంపిబాత్మ నిముదాశూన్యైఃకిమన్యైర్భృశం॥ ౩౭౮

చ॥ మనమునుబ్రహ్మమన్గురినమర్పుము గట్టిగ నింద్రియంబులం।
బొనరుచువానిచోట్ల దనువుంగుదిలింపకుదానిబోలినీ।
వనుకొనకీవెబ్రహ్మమని యట్లయ్యెవేళ్పడకెప్పుడున్ముదం।
బునగొనుబ్రహ్మసౌఖ్యరసము న్వృథలన్యములెల్ల నేటికిన్॥ ౩౭౮॥

శ్లో॥ అనాత్మచింతనంత్యక్త్వా కశ్మలందుఃఖకారణం।
చింతయాత్మానమానంద రూపంయన్ముక్తికారణం॥ ౩౭౯॥

తే-గీ॥ మతికిద్ధియొదుఃఖములకెల్ల మూలమైన।
యీయనాత్మనుదలపకు మెన్నటికిని।
మొనసియానందరూపంబు ముక్తిహేతు।
వైనపరమాత్మదలచు నీకగువిముక్తి॥ ౩౭౯॥

శ్లో॥ ఏషస్స్వయం జ్యోతిరశేషసాక్షీ।
విజ్ఞానకోశేవిలసత్యజస్రం।
లక్ష్యంవిధాయైన మసద్విలక్షణ।
మఖండవృత్త్యాత్మ తయానుభావయ॥ ౩౮౦॥

తే-గీ॥ తానెవెలుగొందు సకలంబుతానెచూచు।
నితడువిజ్ఞానకోశ మందెప్పుడునుండి।
యిట్టిసకలంబుకానిదే యేననిగుఱి।
పెట్టి వేఱ్ఱడకుండెడి వృత్తినొందు॥ ౩౮౦॥

శ్లో॥ ఏతమచ్ఛిన్నయావృత్త్యా ప్రత్యయాంతరశూన్యయా।
ఉల్లేఖయన్విజానీయా త్స్వస్వరూపతయాస్ఫుటం॥ ౩౮౧॥

క॥ చెదరక మతియొండేదియు। నొదవక స్థిరమైనవృత్తి నొకగుఱుతుననే।
మ్మదిగుదిరిచియదెతానని। సదమలగతినుండనొప్పు స్పష్టముగాగ॥

శ్లో॥ అత్రాత్మత్వందృఢీకుర్వ న్నహమాదిషుసంత్యజన్।
ఉదాసీనతయాతేషు తిష్ఠేద్ఘటపటాదివత్॥ ౩౮౨॥

తే-గీ॥ అదియెతాననిస్థిరముగా నండగొనుచు।
నహము మొదలగు నన్నికాననివదలుచు।
ఘటపటాదులవలె వానిగాంచునపుడు।
నిస్పృహుండయుండ నొనిజమొతింగి॥ ౩౮౨॥

శ్లో॥ విశుద్ధమంతఃకరణంస్వరూపే నివేశ్యసాక్షిణ్యవబోధమాత్రే।
శనైశ్శనైర్నిశ్చలతాముపానయ న్పూర్ణత్వమేవానువిలోకయేత్తతః॥

తే-గీ॥ విమలమైనయంతః కరణమునుబట్టి।
సాక్షియగు తెల్విమాత్రతనా నాత్మజేర్చి।
యెల్లనల్లన కదలమినంది పిదప।
నిండియుండుటనే చూచుచుండవలయు॥ ౩౮౩॥

శ్లో॥ దేహేంద్రియ ప్రాణమనోఽహమాదిభి।
స్స్వాజ్ఞానక్లృప్తైరఖిలైరుపాధిభిః।
విముక్తమాత్మాన మఖండరూపం।
పూర్ణంమహాకాశమి వావలోకయేత్॥ ౩౮౪॥

శా॥ తానేతన్నెఱుఁగంగలేమి మితినొందండో చుదేహేంద్రియ।
ప్రాణాహంకృతిమానసాది సకలోపాధుల్వెసన్వీడగా।
నానాత్వంబిసుమంతలేక వెలి లోనందా మహాకాశమ।
ట్లునిత్యంబునునిండియుండుట సుబుద్ధి చూచుచుండందగున్॥ ౩౮౪॥

శ్లో॥ ఘటకలశకుసూలసూచిముఖ్యై।
గ్గగనముపాధిశతైర్విముక్తమేకం।
భవతినవివిధంతథైవశుద్ధం।
పరమహామాదివిముక్తమేకమేవ॥ ౩౮౫॥

ఆ-వె॥ సూదిమొంతకడవగాదె మున్నగును పా।
ధులనువిడిచి యొకటెనిలుచుగగన।
మట్లెవివిధములగు నహామాదులనుబాసి।
విమలమగుపరంబు వెలయునొకటె॥ ౩౮౫॥

శ్లో॥ బ్రహ్మాది స్తంబపర్యంతా మృషామాత్రాఉపాధయః।
తతఃపూర్ణంస్వమాత్మానం పశ్యేదేకాత్మనాస్థితం॥ ౩౮౬॥

ఆ-వె॥ బ్రహ్మమొదలుగడ్డిపఱకదాకనుమిథ్య।
లెల్ల వట్టికల్ల లింతె కాన

నాకఁగడగుచునిండియుండుబ్రహ్మంబుగా।
తన్నె కాంచుటొప్పు ధన్యతముఁడు॥ ౩౯౬॥

శ్లో॥ యత్రభ్రాంత్యాకల్పితంతద్వివేకే।
తత్తన్మాత్రంనైవతస్మాద్విభిన్నం।
భ్రాంతేర్నాశేభాతిదృష్టాహితత్త్వం।
రజ్జుస్తద్వద్విశ్వమాత్మస్వరూపం॥ ౩౯౭॥

చ॥ భ్రమపడిచూచువేళ నితరంబుగ నెయ్యదితోఁచు నద్దియే।
భ్రమచననిల్చు భ్రాంతిచెడిన పామునిజంబగు పగ్గమైనయా।
క్రమమున బ్రహ్మమందు భ్రమకల్పితమైనప్రపంచమెల్లనా।
భ్రమచనబ్రహ్మమేయితరవస్తువుకాదు నిజంబెఱుంగుమా॥ ౩౯౭॥

శ్లో॥ స్వయంబ్రహ్మాస్వయంవిష్ణు స్స్వయమింద్రస్స్వయంశివః।
స్వయంవిశ్వమిదంసర్వం స్వస్మాదన్యన్నకించన॥ ౩౯౮॥

తే-గీ॥ తానెబ్రహ్మయువిష్ణువు తానెశివుడు।
తానెయింద్రుండువిశ్వమంతయును దానె।
తానుగానిదియుసుమంతయైనలేదు।
కానసర్వంబుతానుగా గాంచవలయు॥ ౩౯౮॥

శ్లో॥ అంతస్స్వయంచాపి బహిస్స్వయంచ।
స్వయంపురస్తాత్స్వయమేవపశ్చాత్।
స్వయంహ్యవాచ్యాంస్వయమప్యుదీచ్యాం।
తథోపరిష్టాత్స్వయమప్యధస్తాత్॥ ౩౯౯॥

క॥ లోపలవెలుపలముందర।దాపలవలపలనువెనుకతానెయఖిలది।
గ్వ్యాపియయిక్రిందుమీదను।నేపట్టునబాడదానెయేప్పారుజుమీ॥

శ్లో॥ తరంగఫేన భ్రమబుద్బుదాది।
సర్వం స్వరూపేణ జలంయథాతథా।

చిదేవ దేహః ద్వయహామంత మేత।
త్సర్వంచిదేవై కరసంవిశుద్ధః॥ ౩౯॥

తే-గీ॥ అలలునురుగులుసుళ్లు బుగ్గలు మొదలగు।
నన్నిరూపుల జలమెయున్నట్లు తెలియ।
తనువు మొదలుగ నహము దాకను సకలము।
విమల మొకతీరునగు తెలివేకదయ్య॥ ౩౯॥

శ్లో॥ సచేవేదంసర్వం జగదవగతం వా జ్ఞనసయో।
స్సతోఽన్యన్నాస్త్యేవ ప్రకృతి పరసీమ్నిస్థితవతః।
పృథక్కిం మృత్స్నాయాః కలశఘటకుంభాద్యవగతం।
వదత్యేషభ్రాంత స్త్వమహమితి మాయామదిరయా॥ ౩౯॥

చ॥ మనసునుమాటలందెడమ సమస్తజగంబును సత్తె సత్తుక।
న్నను మతియొండులే దరసినం బ్రకృతిం గడతేరియుండునా।
మునికి ఘటాదులేవయిన.బొల్చునెమృత్తిక గాకవేఱుగా।
నను జడుడేను నీవనుచు నా భ్రమయ న్గలుద్రావిమత్తుడై॥ ౩౯॥

శ్లో॥ క్రియాసమభిహారేణ యత్రనాన్యదితిశ్రుతిః*।
బ్రవీతిద్వైతరాహిత్యం మిథ్యాధ్యాసనివృత్తయే॥ ౩౯॥

క॥ లేనిదియున్నట్లుండుట। మానుప రెండవదిలేమిమతిమతి వేదం।
బూనిపలుకు నట నన్యము। గానవిననెఱుంగలేదు ఘనమదియనుచున్॥

శ్లో॥ ఆకాశవన్నిర్మల నిర్వికల్ప।
నిస్సీమనిష్పందన నిర్వికారం।
అంతర్బహిశ్శూన్యమనంత మధ్యయం।
స్వయంపరంబ్రహ్మకిమ స్తిబోధ్యం॥ ౩౯3॥

* శ్రు॥ యత్రనాన్యత్పశ్యతినాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతిసభూమా॥

మ త్తకోకిల॥ ఆకసంబునుబోలి నిర్మలమై వికల్పము లేనిదై।
యేకమైమితి లేనిదైస్థిర మేవికారము లేనిదై।
జోక లో వెలి లేనిదై తుద జోడు వేఱును లేనిదై।
ప్రాకటంబగు బ్రహ్మమీతడె పలికి యేమిక దెల్పుదున్॥

శ్లో॥ వక్తవ్యంకిము విద్యతేఽత్ర బహుధా బ్రహ్మైవజీవస్స్వయం।
బ్రహ్మైతజ్జగదాతతంను సకలం బ్రహ్మాద్వితీయం శ్రుతిః।
బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయస్సంత్యక్త బాహ్యాస్స్ఫుటం।
బ్రహ్మీభూయవసంతి సంతతచిదానందాత్మనైతద్ధ్రువం॥ ౩౯౪॥

ఉ॥ ఏమిక వేయుజెప్పవలె నిట్టిపరాత్ముడె జీవుడాపరం।
ధాముడెయీజగంబు సతతంబును నిండి వెలుంగు వేదమా।
స్వామినె జోడులేనిదను ప్రాజ్ఞులు వెల్పలివానిమానితా।
మామహమంచు నిక్కమటులై తెలివిన్సుఖియింతు రెప్పుడున్॥ ౩౯౪

శ్లో॥ జహిమలమయకోశేఽహంధియోత్థాపితాశాం।
ప్రసభమనిలకల్పేలింగదేహేఽపిపశ్చాత్।
నిగమగదితకీర్తింనిత్యమానంద మూర్తిం।
స్వయమితిపరిచీయ బ్రహ్మరూపేణతిష్ఠ॥ ౩౯౫॥

మ॥ విడుమీమాంసమలంపు తిత్తిగని యీహంకారమునేనటంచు రతిన్।
విడువెన్వెంటనె గాలిబోలిచలనై వేదోచులింగాంగమం।
దెడమీకుండెడునాశ నంత నిగమంబే దేవు గీర్తించునె।
ప్పడునానందమయుండెవండతడె నేముమ్మాటికంచుండుమా॥ ౩౯౫

శ్లో॥ శవాకారం యావద్భజతిమనుజస్తావదశుచిః।
పరేభ్యస్స్యాత్క్లేశో జననమరణవ్యాధినిలయః।
యదాత్మానంశుద్ధం కలయతి శివాకారమచలం।
తదా తేభ్యోముక్తోభవతి హితదాహ శ్రుతిరపి॥ ౩౯౬॥

మ॥ శివరూపంబు నరుండు మానవుఁడుగాఁ శోచంబులేదార్తియు।
ద్భవమానస్యులచేఁ జన్మ మృతి బాధల్వ్యాధులుంబోవుతా।
శివరూపంబమలంబె తానని మదింజింతించి నిశ్చేష్టుఁడై।
నవిముక్తుండగువాఁడు వానివలనన్ బ్రాబలుఁడిట్లాడెడిన్॥ ౩౯౬॥

శ్లో॥ స్వాత్మన్యారోపితాశేషా భాసవస్తునిరాసతః।
స్వయమేవపరంబ్రహ్మ పూర్ణమద్వయమక్రియం॥ ౩౯౭॥

క॥ తనమతిని లేనివన్ను। ట్లనవరతము తోఁచుచుండుటంత యసాపదా।
దనరుచున్నిండిన కడపటి। యనన్య మక్రియము నైన యాబ్రహ్మంబై॥

శ్లో॥ సమాహితాయాం సతి చిత్తవృత్తౌ।
పరాత్మని బ్రహ్మణి నిర్వికల్పే।
నదృశ్యతే కశ్చిదయం వికల్పః।
ప్రజల్పమాత్రః పరిశిష్యతేతతః॥ ౩౯౮॥

తే-గీ॥ చిత్తవృత్తిసమాధిలో జిక్కి నిర్వి।
కల్పమైన బ్రహ్మంబున గలిసిపోవ।
నీవికల్పంబులొకటియు నెఱుకపడవు।
వదరుటొక్కఁటె మిగులు నాస్పదములేక॥ ౩౯౮॥

శ్లో॥ అసత్కల్పో వికల్పోఽయం విశ్వమిత్యేకవస్తుని।
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదాకుతః॥ ౩౯౯॥

తే-గీ॥ ఒకటిదైయుండు బ్రహ్మమందకట ప్ర।
పంచమనెడి వికల్పంబు వట్టిదయ్యె।
నేవికారంబు రూపును హెచ్చులేని।
బ్రహ్మమున భేదమెందుండి వచ్చుఁజూడు॥ ౩౯౯॥

శ్లో॥ ద్రష్టృదర్శన దృశ్యాది భావశూన్యైకవస్తుని।
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదాకుతః॥ ౪౦౦॥

తే-గీ॥ చూచువాడును చూపును చూడనైన।
విట్టివేమియులేనిది యేకవస్తు।
చేవికారంబు రూపును హెచ్చులేని।
బ్రహ్మమున భేదమెందుండివచ్చు జూడు॥ ४००॥

శ్లో॥ కల్పార్ణవ ఇవాత్యంత పరిపూర్ణైకవస్తుని।
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదాకుతః॥ ४०౧॥

తే-గీ॥ ప్రళయకాల సముద్రంబు పగిదివిశ్వ।
మంతటనునిండియుండు నేకాత్మకుడను।
నేవికారంబు రూపును హెచ్చులేని।
బ్రహ్మమున భేదమెందుండివచ్చు జూడు॥ ४०౧॥

శ్లో॥ తేజసీవతమోయత్ర ప్రలీనంభ్రాంతి కారణం।
అద్వితీయే పరేతత్త్వే నిర్విశేషే భిదాకుతః॥ ४०౨॥

తే-గీ॥ ఒకటి మఱియొకటిగదోచుటకునిమిత్త।
మైనచీకటివలె తమస్సణగు వెలుగు।
బోలు నేతనయందు నాపురుడు హెచ్చు।
లేని పరతత్త్వమును భేదమానదెట్లు॥ ४०౨॥

శ్లో॥ ఏకాత్మకే పరేతత్త్వే భేదవార్తా కథంవసేత్।
సుషుప్తౌసుఖమాత్రాయాం భేదఃకేనావలోకితః॥ ४०౩॥

క॥ పెక్కులనుమాటలైనను।నొక్కండగు బ్రహ్మమందు నుండంగలదే।
చొక్కపుసుఖమగునిద్దుర। బెక్కులెవండైన జూచిపేర్కొనియున్నే॥

శ్లో॥ నహ్యస్తి విశ్వం పరతత్త్వబోధా।
త్సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే।
కాలత్రయేనా ప్యహిరీక్షితేగుణే।
నహ్యంబు బిందుర్మృగతృష్ణికాయాం॥ ४०४॥

తే-గీ॥ స్థిరముసై కలఁగాంచక సిద్ధమైన।
బ్రహ్మమెఱిఁగిన లేదు విశ్వంబుచూడ।
కలదెసర్వంబు త్రాటను జలముతెండ।
మావులను దిక్కాలంబుల మలసిచూడ॥ ౪౦౪॥

శ్లో॥ మాయామాత్ర మిదంద్వైత మద్వైతం పరమార్థతః।
ఇతి బ్రూతే శ్రుతిస్సాక్షా త్సుషుప్తావనుభూయతే॥ ౪౦౫॥

క॥ ఈరెండుగ గనుపించుట।
యారయుగామాయ మాత్రమగు నొకఁటెని।
ర్ధారణజేసిన నను శ్రుతి।
వారకనిద్దురను ననుభవంబిదె కాదే॥ ౪౦౫॥

శ్లో॥ అనన్యత్వమధిష్ఠానా దారోప్యస్య నిరీక్షితం।
పండితై రజ్జుసర్పాదౌ వికల్పో భ్రాంతిజీవనః॥ ౪౦౬॥

తే-గీ॥ నిజముగా నుండునదియు భ్రాంతినటదోచు।
నన్యమును రెండునొక్కటేయందు పెద్ద।
లరసియెఱిగిరి రజ్జుసర్పాదులందు।
నగుగలకయుండు భ్రాంతియున్నంతవఱకె॥ ౪౦౬॥

శ్లో॥ చిత్తమూలో వికల్పోఽయం చిత్తాభావే న కశ్చన।
అతశ్చిత్తం సమాధేహి ప్రత్యగ్రూపే పరాత్మని॥ ౪౦౭॥

తే-గీ॥ ఈవికల్పమునకు బుట్టి నిల్లుచిత్త।
మిది నశించిన లేకుండునేవికల్ప।
మట్లగుట సాక్షియగు పరమాత్మయందు।
చిత్తమడచి సమాధిసుస్థితుడవగుము॥ ౪౦౭॥

శ్లో॥ కిమపి సతతబోధం కేవలానందరూపం।
నిరుపమమతివేలం నిత్యముక్తం నిరీహం.

నిరవధిగగనాభం నిష్కలం నిర్వికల్పం।
హృదికలయతి విద్వాన్ బ్రహ్మపూర్ణం సమాధౌ॥ ౪౦౮॥

చ॥ సతిమెడలేని తెల్వి పరసౌఖ్యపు రూపము సాటిలేనిదై।
మితిగన కాశసంబువలె మేరలుమీఱి మతేమిగాక యే।
గతితగులంబుకప్పటను గాంచక కోరక కలఁలేకనే।
మ్మతి నెఱినిండుబ్రహ్మను సమాధినివిజ్ఞుడెదంగనుంగొనున్॥ ౪౦౮॥

శ్లో॥ నిగమవచన సిద్ధం నిత్యమస్మత్ప్రసిద్ధం।
ప్రకృతి వికృతిశూన్యం భావనాతీతభావం।
సమరసమసమానం మానసంబంధదూరం।
హృదికలయతి విద్వాన్ బ్రహ్మపూర్ణం సమాధౌ॥ ౪౦౯॥

చ॥ మతిదలపోయరానిది సమానము లేనిది హెచ్చుతగ్గులే।
కతిసమభావమైనది ప్రయాస ప్రమాణము లందరానిదై।
శ్రుతిదెలియంగనైనది యశుద్ధవికారము లేక నిత్యమా।
తతము నేననంబరగు దాని బుధుండు సమాధిగన్గొనున్। ౪౦౯॥

శ్లో॥ అజరమమరమస్తాభావవస్తుస్వరూపం।
స్తిమితసలిలరాశిప్రఖ్యమాఖ్యావిహీనం।
శమితగుణవికారం శాశ్వతం శాంతమేకం।
హృదికలయతి విద్వాన్ బ్రహ్మపూర్ణం సమాధౌ॥ ౪౧౦॥

చ॥ ముదిమియుచావు నాశమును బొందనివస్తువు నిత్యమేకమున్।
గదలనిసంద్రమట్టిది గుణమ్ములబుట్టువికార సంతతుల్।
జ్జిదిమిన దెట్టిపేరునను జెప్పగరానిదియైన బ్రహ్మమున్।
మదిదలపోయువిజ్ఞుడు సమాధిని నిండివెలుంగనెప్పుడున్॥ ౪౧౦॥

శ్లో॥ సమాహితాంతః కరణస్స్వరూపే।
విలోకయాత్మాన మఖండవైభవం।

విచ్ఛిందిబంధం భవగంధ గంధితం।
యత్నేనపుంస్త్వం సఫలీకురుష్వ॥ ౪౧౧॥

తే-గీ॥ నిలిపియంతఃకరణమును నీదురూపు।
నందునేకాకృతి వెలుంగునాత్మఁగాంచి।
సంసరణ్వాసనలఁబెనసాగుబంధ।
మడచి కనుమయ్య మగవాడవైన ఫలము॥ ౪౧౧॥

శ్లో॥ సర్వోపాధి వినిర్ముక్తం సచ్చిదానంద మద్వయం।
భావయాత్మాన మాత్మస్థం నభూయః కల్పసేఽధ్వనే॥ ౪౧౨॥

తే-గీ॥ మిథినిగల్పించు నన్నింటి మీఱినదియు।
నునికి తెలివియు సుఖమునానొప్పచుండు।
రెండవదిలేని బ్రహ్మంబు నిందుమతిని।
నుండగను మింక నీ త్రోవగుండరావు॥ ౪౧౨॥

శ్లో॥ ఛాయేవ పుంసఃపరి దృశ్యమాన।
మాభాసరూపేణ ఫలాను భూత్యా।
శరీరమారాచ్ఛవ వన్నిరస్తం।
పునర్నసంధత్త ఇదంమహాత్మా॥ ౪౧౩॥

తే-గీ॥ నరునిమైనీడవలె నిజంబరయ లేక।
చేయుపులఫలంబు గుడుచుచు జేష్టలొంది।
తోచునీమేని బీనుంగుద్రోచినట్లు।
ద్రోచి మఱిదానిముట్టడు దొడ్డవాడు॥ ౪౧౩॥

శ్లో॥ సతతవిమల బోధానందరూపం సమేత్య।
త్యజజడమల రూపోపాధిమేతంసుదూరే।
అథపునరపినైషస్స్మర్యతాంవాంతవస్తు
స్మరణవిషయభూతం కల్పతే కుత్సనాయ॥ ౪౧౪॥

తే.గీ॥ ఎప్పుడునిర్మలచిత్సుఖాకృతిని బొంది।
జడముమలయిాపముగ మేనివిడువు దవుల।
నంతమతిదీనిదలపకు వాంతమైన।
వస్తువుదలంప గదునేవ వచ్చుగాదె॥ ౪౧౫॥

శ్లో॥ సమూలమేతత్పరిదహ్యవహ్నౌ సదాత్మని బ్రహ్మణినిర్వికల్పే।
తతస్స్వయంనిత్యవిశుద్ధబోధానందాత్మనాతిష్ఠతివిద్వరిష్ఠః॥౪౧౬॥

తే.గీ॥ అచలమై కల్గలేని ప రాత్మయను నెడు।
నగ్గినీమేని మొదలంట సమరమాడ్చి।
వీడకెప్పుడు తేటతెల్వియౌ సుఖంబు।
తానెమైనిల్చు బ్రహ్మవిద్వరుడు ఘనుడు॥౪౧౫॥

శ్లో॥ ప్రారబ్ధసూత్రగ్రథితంశరీరం ప్రయాతువాతిష్ఠతుగోరివస్రక్।
నతత్పునఃపశ్యతితత్త్వవేత్తా నందాత్మనిబ్రహ్మణిలీనవృత్తిః॥౪౧౫॥

తే.గీ॥ ఆవు మెడనుండు పూదండయట్టులెనకు।
తొంటికర్మంబ నెడు త్రాటగంటువడిన।
మేనుపోయిన నున్న విజ్ఞాని గనడు।
వృత్తియానందమగు బ్రహ్మమెనసియుంట॥౪౧౬॥

శ్లో॥ అఖండానందమాత్మానం విజ్ఞాయస్వస్వరూపతః।
కిమిచ్ఛన్కస్యవాహేతో ర్దేహంపుష్ణాతితత్త్వవిత్॥౪౧౬॥

క॥ తననిజరూపము వేత్తా। ఎనయనిసౌఖ్యమగు బ్రహ్మమేయని మదిలో।
గనినంత నేమికావలె।నని యెవ్వనికొఱకువిజ్ఞుడంగము బెంచున్॥౪౧౭॥

శ్లో॥ సంసిద్ధస్యఫలంత్వేత జ్జీవన్ముక్తస్యయోగినః।
బహిరంతస్సదానంద రసాస్వాదనమాత్మని॥౪౧౭॥

క॥ యోగికిజీవన్ముక్తియె। బాగుగగురుతుటకుఫలముబయటన్ లోనన్।
సాగిసుఖరసము నెప్పుడు। త్రాగుచుమతిజొక్కియుంటె తథ్యముసుమ్మీ॥

శ్లో॥ వైరాగ్యస్యఫలంబోధో బోధస్యోపరతిఃఫలం।
స్వానందానుభవాచ్ఛాంతి రేషైవోపరతేఃఫలం॥౪౧౭॥

క॥ తెలివియెఫలమగువిరతికి।నలతెలివికిఫలము పరతియందులఫలమై।
వెలయుఁ బ్రహ్మానందము। చెలువనుభవమొందిశాంతిజెందుటెచూ వే॥

శ్లో॥ యద్యుత్తరోత్తరాభావే పూర్వపూర్వంతునిష్ఫలం॥౪౧౮॥

క॥ వినుమీవైరాగ్యంబును।ననుపమబోధోపరతులుననుమూడింట।
న్వెనువెనుకటివిజనింపమి।మునుమునుపటివెల్లవ్యర్థములుదలపోయఁ॥

శ్లో॥ నివృత్తిఃపరమాతృప్తి రానందోఽనుపమస్స్వతః।
దృష్టదుఃఖేష్వనుద్వేగో విద్యాయాఃప్రస్తుతంఫలం।౪౨౦॥

తే-గీ॥ తగులమెడలుటయును లెస్సతనివిగనుట।
సాటిలేనియానందంబుచవిగొనుటయు।
తోచుదుఃఖంబులను వెతదొరగుటయును।
విద్యవలనిఫలంబిదివిశ్రుతంబు॥౪౨౧॥

శ్లో॥ యత్కృతంభ్రాంతివేళాయాం నానాకర్మజుగుప్సితం।
పశ్చాన్నరోవివేకేన తత్కథంకర్తుమర్హతి॥౪౨౧॥

క॥ భ్రమపడియుండినతఱిహే।యములగునేపనులుమంచివనిచేసెనవే।
విమలజ్ఞానముగల్గిన।సమయంబుననరుడుసేయజనునేచెపుమా॥౪౨౬॥

శ్లో॥ విద్యాఫలంస్యాదసతోనివృత్తిః।
ప్రవృత్తిరజ్ఞానఫలంతదీక్షితం।
తజ్జ్ఞానయోర్యన్మృగతృష్ణికాదౌ।
నోచేద్విదాందృష్టఫలంకిమస్మాత్॥౪౨౨॥

ఉ॥ జ్ఞానముగల్గినన్నిజముగానెదిలేదదితోపకుండు నా।
జ్ఞానములేమి నట్టిదెనిజంబుగదోచు మరీచికాదులౌ।
వానినిజంబెఱుంగుటను వాన్నినెఱుంగమి నెట్టులట్టులే।

కానిమెడం బరాత్మునెఱుగక ఫలమేమిక విజ్ఞకోటకిక॥౪౨౨॥

శ్లో॥ అజ్ఞానహృదయగ్రంథే ర్వినాశోయద్యశేషతః।
అనిచ్ఛోర్విషయఃకిన్ను ప్రవృత్తేఃకారణంస్వతః॥౪౨౩॥

క॥ ఎఱుగమియను నెదలోముడికఱకున మొదలంట దెగినఘనునకుఁగోరికల్।
నెఱయమి నెందులకైదబ్బఱగనినిజమంచునతదుపమవిద్వద్దానక॥

శ్లో॥ వాసనానుదయోభోగ్యే వైరాగ్యస్యతదావధిః।
అహంభావోదయాభావో బోధస్యపరమావధిః।
లీనవృత్తేరనుత్పత్తి ర్మర్యాదోపరతేస్తుసా॥౪౨౪॥

తే గీ॥ అనుభవించంగ దగువానినను కొనమియె।
యగువిరక్తికితుద మదినహముపుట్ట।
కుండుటే తెల్విచివరలేకుండువృత్తి।
మొలకమెత్తమి యుపరతి తలపొలంబు॥౪౨౪॥

శ్లో॥ బ్రహ్మాకారతయాసదాస్థితతయానిర్ముక్తబాహ్యార్థధీ
రన్యావేదితభోగ్యభోగకలనోనిద్రాళువద్బాలవత్।
స్వప్నాలోకితలోకవజ్జగదిదంపశ్యక్క్వచిల్లబ్ధధీ।
రాస్తేకశ్చిదనంతపుణ్యఫలభుగ్ధన్యస్సమాన్యోభువి॥౪౨౫

మ॥ నిరతంబుంబరమాత్మరూపమున దా నిల్వన్వెలిందోచుస।
ర్వరతుల్బుద్ధినిపీడ నిద్రితుని శేవన్బాలునట్లన్నిటిం।
బరులర్పించిన రీతినొందుచెప్పుడైనక బుద్ధి స్వప్నాకృతిక।
ధరణీలోకముజూచుపుణ్యు డెవడో ధన్యుండుపూజ్యుండిలక॥ ౪౨౬॥

శ్లో॥ స్థితప్రజ్ఞోయతిరయం యస్సదానందమశ్నుతే।
బ్రహ్మణ్యేవవిలీనాత్మా నిర్వికారో వినిష్క్రియః ౪౨౭

తే-గీ॥ ఎపుడు నానందమును బొందు నీయతీంద్రు।
డేస్థితప్రజ్ఞుడనబడు నితడుబుద్ధి।

నెప్పుడును బ్రహ్మమున గల్పితమే వికార।
మే పనియులేక వెలుగొందు నెలుగుమయ్య॥ ౪౨౭॥
శ్లో॥ బ్రహ్మాత్మనో శ్శోధితయో రేకభావా వగాహినీ।
నిర్వికల్పాచ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే॥ ౪౨౭॥
క॥ ఏవృత్తి పరబ్రహ్మము। జీవుని శోధించి యొకటె సిద్ధంబనుచు।
న్భావించునట్టి చెదరని। పావనచిన్మాత్ర వృత్తి ప్రజ్ఞయనబడున్॥
శ్లో॥ సుస్థితా సా భవేద్యస్య స్థితప్రజ్ఞస్స ఉచ్యతే।
యస్యస్థితా భవేత్ప్రజ్ఞా తస్యానందో నిరంతరః। ౪౨౮॥
ప్రపంచో విస్మృతప్రాయ స్సజీవన్ముక్త ఇష్యతే॥ ౪౨౮ ౫॥
తే-గీ॥ ఎవనికీవృత్తి సుస్థిరంబవునతండె।
యగు స్థితప్రజ్ఞుఁ డతడె నిరంతరముఁగ।
బొందువానంద మీలోకమును మఱచిన।
యట్టులుండు జీవన్ముక్తుఁడతఁడె సుమ్మా॥ ౪౨౯॥
శ్లో॥ లీనధీరపి జాగర్తి యో జాగ్రద్ధర్మవర్జితః।
బోధో నిర్వాసనో యస్య సజీవన్ముక్త ఇష్యతే॥ ౪౨౯॥
తే-గీ॥ బుద్ధియణఁగియు మేలుకాంచి పొదలుచుండు।
మెలకువను జేయుపనులు చాసలుపకుండ।
తెలివి వాసనలొందదే ధీమహితున।
కట్టివాడె జీవన్ముక్తుఁడనగ బరగు॥ ౪౩౦॥
శ్లో॥ శాంతసంసారకలనః కలావానపి నిష్కలః।
యస్యచిత్తం వినిశ్చిత్తం సజీవన్ముక్త ఇష్యతే॥ ౪౩౦॥
తే-గీ॥ ఎంచి సంసృతిమెలఁగ జాలించునెవడు।
గుణములుండియు వానిజేకొనఁడెవండు।
చిత్తమెవనిది యే చింత జేయకుండు।
నట్టివాఁడె జీవన్ముక్తుఁడనఁగ బరగు॥ ౪౩౧॥

శ్లో॥ వర్తమానేఽపిదేహేఽస్మిన్ ఛాయావదను వర్తిని।
అహంతా మమతాభావో జీవన్ముక్తస్యలక్షణం॥ ౪౩౧॥

తే-గీ॥ తనను మైనీడవలెనె యీ తనువు వెంట।
దగిలియున్నను నదితాను తనదియని యు।
టంచు నెన్నడు దలపడేయమలమూర్తి।
యట్టివాడెజీవన్ముక్తుడనగ బరగు॥ ౪౩౨॥

శ్లో॥ అతీతాననుసంధానం భవిష్యదవిచారణం।
ఔదాసీన్యమపి ప్రాప్తం జీవన్ముక్తస్య లక్షణం॥ ౪౩౨॥

తే-గీ॥ గడిచిపోయినవానిని గడన గొనక।
రాగలుగువాని దలపక ప్రాప్తములగు।
వానివలవక యుండు నేమాననీయు।
డట్టివాడె జీవన్ముక్తుడనగ బరగు॥ ౪౩౩॥

శ్లో॥ గుణదోష విశిష్టేఽస్మిన్ స్వభావేన విలక్షణే।
సర్వత్ర సమదర్శిత్వం జీవన్ముక్తస్యలక్షణం॥ ౪౩౩॥

తే-గీ॥ బాగునోగునుగలిసి స్వభావమునెనె।
తనకువేఱగు నీ పదార్థంబు లందు।
నంతటను నొకటేరూపుగా నలరుచుండు।
నట్టివాడె జీవన్ముక్తుడనగ బరగు॥ ౪౩౪॥

శ్లో॥ ఇష్టానిష్టార్థ సంప్రాప్తౌ సమదర్శితయాత్మని।
ఉభయత్రావికారిత్వం జీవన్ముక్త స్యలక్షణం॥ ౪౩౪॥

తే-గీ॥ ప్రియములైనవియేని నప్రియము లేని।
కార్యములుగూడినప్పుడు కలక లేక।
రెండిటిని నొకటిగజూచుచుండు నెవ్వ।
డట్టివాడెజీవన్ముక్తు డనగ బరగు॥ ౪౩౫॥

శ్లో॥ బ్రహ్మానంద రసాస్వాదా సక్తచిత్తతయాయతేః।
అంతర్బహిరవిజ్ఞానం జీవన్ముక్తస్యలక్షణం॥ ౪౩౫॥

తే-గీ॥ అసమమైన బ్రహ్మానంద రసముచవిని।
మఱిగియటుజొక్కి చిత్తంబు మఱలకున్నికి।
లోన వెలుపల నేదియుగ్గాన డెవ్వ।
డట్టివాడె జీవన్ముక్తుడనగ బరగు॥ ౪౩౬॥

శ్లో॥ దేహేంద్రియాదౌ కర్తవ్యే మమాహంభావ వర్జితః।
ఔదాసీన్యేన యస్తిష్ఠే త్సజీవ న్ముక్తలక్షణః॥ ౪౩౬॥

తే-గీ॥ అంగమున నింద్రియాదుల నంటదగిన।
నేను నాయది యనుటను మానివాని।
తలపుసేయక చెదరక నిలుచు నెవ్వ।
డట్టివాడె జీవన్ముక్తుడనగ బరగు॥ ౪౩౭॥

శ్లో॥ విజ్ఞాత ఆత్మనోయస్య బ్రహ్మభావ శ్రుతేర్బలాత్।
భవబంధ విసర్ముక్త స్సజీవ న్ముక్తలక్షణః॥ ౪౩౭॥

తే-గీ॥ గురుముఖంబున విన్నట్టిగుఱుతు పటిమ।
సకలసంసార బంధముల్సరగ విడిచి।
తానెబ్రహ్మంబని యెఱుంగు ధన్యుడెవ్వ।
డట్టివాడె జీవన్ముక్తుడనగబరగు॥ ౪౩౮॥

శ్లో॥ దేహేంద్రియేష్వహంభావ ఇదంభావ స్తదన్యకే।
యస్యనోభవతఃక్వాపి సజీవన్ముక్త ఇష్యతే॥ ౪౩౮॥

తే-గీ॥ తనువునను నింద్రియముల నేననెడుమఱియు।
నితరముల నివియను బుద్ధి యెప్పుడు నెందు।
బాడను దేహమాత్రమైన నేపుణ్యమతికి।
నట్టివాడె జీవన్ముక్తుడనగ బరగు॥ ౪౩౯॥

శ్లో॥ నప్రత్యగ్బ్రహ్మణోర్భేదం కదాపి బ్రహ్మసర్గయోః।
ప్రజ్ఞయాయోవిజానాతి సజీవన్ముక్త లక్షణః॥ ౪౩౯॥

తే.గీ॥ అరయ బ్రహ్మంబునకు బ్రత్యగాత్మునకును।
సృష్టికిని బ్రహ్మమునకును నించుకైన।
భేదమే లేమి ప్రజ్ఞ గాన్పించు నెవ్వని।
కట్టివాడె జీవన్ముక్తుడనగ బరగు॥ ౪౪౦॥

శ్లో॥ సాధుభిః పూజ్యమానేఽస్మి న్పీడ్యమానేఽపి దుర్జనైః।
సమభావో భవేద్యస్య సజీవన్ముక్త లక్షణః॥ ౪౪౦॥

తే-గీ॥ మంచివారలు తన్ను బూజించుచున్న।
చెడ్డవారలు కడునొప్పి సేయుచున్న।
రెంటి సమముగనే చూచు దంట యెవ్వ।
డట్టివాడె జీవన్ముక్తుడనగ బరగు॥ ౪౪౧॥

శ్లో॥ యత్ర ప్రవిష్టా విషయాః పరేరితా।
నదీప్రవాహా ఇవ వారిరాశౌ।
లీయంతి సన్మాత్రతయా న విక్రియా।
ముత్పాదయంత్యేష యతిర్విముక్తః॥ ౪౪౧॥

తే-గీ॥ కడలిలో నేఱులట్టు లే ఘనుని యందు।
నొరులొసంగెడు విషయలంబులో లిజొచ్చి।
మాయు సన్మాత్రమై మాఱ్పు సేయకుండ।
నట్టి యతియె విముక్తుఁడా యనయె మౌని॥ ౪౪౨॥

శ్లో॥ విజ్ఞాత బ్రహ్మతత్త్వస్య యథాపూర్వం నసంసృతిః।
అస్తి చేన్న సవిజ్ఞాత బ్రహ్మభావో బహిర్ముఖః॥ ౪౪౨॥

తే-గీ॥ బ్రహ్మతత్త్వంబెఱింగిన భవ్యమతికి।
మఱల సంసృతి ఘనుపట్టి మాటికి దోప।

దట్లుతోచిన నతఁడు బ్రహ్మంబెఱుంగ।
డనియు బయటనె యుండువాడనియు నెఱుగు॥౪౪౩॥

శ్లో॥ ప్రాచీనవాసనావేగా దసౌ సంసరతీతి చేత్।
న సదేకత్వవిజ్ఞానా న్మందీభవతి వాసనా॥౪౪౩॥

తే-గీ॥ వాడు మునుపటి వాసనవలన నట్లు।
సంస్కృతి జరించు నంటివా జరుగ దట్లు।
వెలయు సత్తొక్కటే యని తెలిసినపుడు।
వాసనల బలమణఁగుట వాస్తవంబు॥౪౪౪॥

శ్లో॥ అత్యంతకాముకస్యాపి వృత్తిః కుంఠతి మాతరి।
తథైవ బ్రహ్మణి జ్ఞాతే పూర్ణానందే మనీషిణః॥౪౪౪॥

తే-గీ॥ మిక్కుటంబుగ కామంబు మీఱువాని।
కైన దల్లినిగన వృత్తి యణఁగు గాదె।
యట్లె నిండుసుఖంబైన యాపరాత్ము।
గన్న పెద్దలకును వృత్తి సున్నయగును॥౪౪౫॥

శ్లో॥ నిదిధ్యాసనశీలస్య బాహ్యప్రత్యయ ఈక్ష్యతే।
బ్రవీతి శ్రుతి రేతస్య ప్రారబ్ధం ఫలదర్శనాత్॥౪౪౫॥

తే-గీ॥ నిరతమును బరమాత్మ ధ్యానించుచుండు।
వానికిని వెలివిషయముల్గానుపించు।
నిది ఫలంబౌట దీనికి హేతువరసి।
యతని ప్రారబ్ధమిదియని శ్రుతివచించు॥౪౪౬॥

శ్లో॥ సుఖాద్యనుభవో యావ త్తావత్ప్రారబ్ధమిష్యతే।
ఫలోదయః క్రియాపూర్వో నిష్క్రియో న హి కుత్రచిత్॥౪౪౬॥

తే-గీ॥ సుఖము మున్నగునవి పొడచూపునంత।
వఱకు ప్రారబ్ధముండును ఫలముగల్గు।

హేతువగుక్రియగల్గుచో నెందునైన।
గలుగునే క్రియలేనిదే ఫలముభువిని॥౪౪౭॥

శ్లో॥ అహంబ్రహ్మేతివిజ్ఞానా త్కల్పకోటిశతార్జితం।
సంచితంవిలయంయాతి ప్రబోధాత్స్వప్నకర్మవత్॥౪౪౭॥

తే-గీ॥ నేనెబ్రహ్మంబనెడి తెల్వినెగడెనేని।
సమయు శతకోటిబ్రహ్మకల్పములగలిగి।
యున్నసంచితమెల్ల మేలొకన్ననరుడు।
కలనుజేసినపనియట్లు క్షణములోన॥౪౪౮॥

శ్లో॥ యత్కృతంస్వప్నవేళాయాం పుణ్యంవాపాపముల్బణం।
సుప్తోత్థితస్యకింతత్స్యాత్ స్వర్గాయనరకాయవా॥౪౪౮॥

తే-గీ॥ నరుడుకలగనువేళ నొనర్చుపనులు।
పుణ్యములుగాని కడుపాపములవి గాని।
నిదురలేచినవానికి నిక్కవముగ।
స్వర్గమేనరకమునే నొసంగగలవె॥౪౪౯॥

శ్లో॥ స్వమసంగముదాసీనం పరిజ్ఞాయనభోయథా।
నశ్లిష్యతిచయతికించి త్కదాచిద్భావికర్మభిః॥౪౪౯॥

తే-గీ॥ ఆకసముబోలిదేనిని నంటకయును।
కోరకయునుండునట్లు త న్గూర్చి నెఱిగిన।
రానయునకర్మముల నెద్ది యేనినెవుడు।
నెంతమాత్రంబు దనునంట వింతనిజము॥ ౪౫౦॥

శ్లో॥నభోఘటయోగేన సురాగంధేన లిప్యతే।
తథాత్మోపాధియోగేన తద్ధర్మైర్నైవలిప్యతే॥ ౪౫౦॥

తే-గీ॥ కుండనంటుటవలన నాకుండలోని।
కల్లుకంపును బొందదాకాశమట్లు।

పాధిశేరుటవలన నా బ్రహ్మమునకు।
పాధికర్మంబులేవియు బట్టుపడవు॥ ౪౫౧॥

శ్లో॥ జ్ఞానోదయాత్పురారబ్ధం కర్మజ్ఞానాన్ననశ్యతి।
అదత్వాస్వఫలంలక్ష్య ముద్దిశ్యోత్సృష్టబాణవత్॥ ౪౫౧॥

తే-గీ॥ ఆత్మనెఱుగక మున్ను చేయంగబడిన।
కర్మమా తెల్విచేతనే కఱగిపోదు।
వడిగుఱినిగూర్చి విడువంగబడినతూపు।
దానిఫలమీకన మమ నెట్లైనపోనె॥ ౪౫౨॥

శ్లో॥ వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణఃపశ్చాత్తు గోమతౌ।
నతిష్ఠతిభినత్త్యేవ లక్ష్యంవేగేననిర్భరం॥ ౪౫౨॥

తే-గీ॥ పెద్దపులి యనుకొని యెక్కుపెట్టివిడువ।
బడినబాణంబుపిమ్మట. పాడిమొదవ।
టంచువానినెఱింగన నాగిపోనె।
తెంపుమెయిబోయి గుఱినిభేదించుగాక॥ ౪౫౩॥

శ్లో॥ ప్రారబ్ధంబలవత్తరం ఖలువిదాం భోగేనతస్యక్షయః।
సమ్యగ్జ్ఞానహుతాశనేన విలయః ప్రాక్సంచితాగామినాం।
బ్రహ్మాత్మైక్యమవేక్ష్యతన్మయతయా యేసర్వదాసంస్థితా।
స్తేషాంతత్త్రితయం నహిక్వచిదపి బ్రహ్మైవతేనిర్గుణం॥ ౪౫౩॥

శా॥ ప్రారబ్ధంబుకడుంబలీయము భుజింపం బోవు విజ్ఞాళికిం।
దారుంబ్రహ్మమునేకమ న్నిఖిలవేదం దత్సంచితాగాములు।
న్సారంబారసితామెబ్రహ్మమయి యశ్రాంతంబు నేపారునా।
ధీరుల్నిర్గుణమైనబ్రహ్మమయు సక్తింబోరు కర్మత్రయిన్॥ ౪౫౪॥

శ్లో॥ఉపాధితాదాత్మ్య విహీనకేవల।
బ్రహ్మాత్మనైవాత్మ నితిష్ఠతోమునేః।
ప్రారబ్ధసద్భావ కథానయుక్తా।
స్వప్నార్థసంబంధ కథేవజాగ్రతి॥ ౪౫౪॥

తే-గీ॥ ఏయుపాధియు గాక యేదేనినంట।
కేకమగుబ్రహ్మమాత్రమై యెసగుమునికి।
తగదు ప్రారబ్ధమనుమాట తగులమైన।
మేల్కని నవాని కల లంటి మెలగగలవె॥ ౪౫౫

శ్లో॥నహిప్రబుద్ధః ప్రతిభాసదేహే।
దేహోపయోగి న్యపిచప్రపంచే।
కరోత్యహంతాం మమతామిదంతాం।
కింతుస్వయంతిష్ఠతి జాగరేణ॥ ౪౫౫॥

చ॥ కలగనిమేలుకాంచి కలగాంచినకార్యము దానికింపుగా।
నిలిచినలోకముందలచి నేనును నాయది యిద్దియంచుదా।
మెలగుచునెంచునేనరుడు మేల్కని యా సకలంబుకల్లగా।
మలయక ద్యజించు గాక వినుమా యనుమానమికేలనీకిటన్॥ ౪౫౬॥

శ్లో॥నతస్యమిథ్యార్థ సమర్థనేచ్ఛా।
నసంగ్రహ స్తజ్జగతోఽపి దృష్టః।
తత్రానువృత్తిర్యదిచేన్మృషార్థే।
ననిద్రయాముక్త ఇతీష్యతేధ్రువం॥ ౪౫౬॥

తే గీ॥ వట్టియవ్వానిగోరబో డట్టివాడు।
కలియడావట్టి లోకంబు కార్యములను।
కలిసిపనిచేయుచుండెనా కలవరంపు।
నిద్ర వానికివిడువమి నిజముసుమ్మ॥ ౪౫౭॥

శ్లో॥ తద్వత్పరే బ్రహ్మణి వర్తమాన।
సదాత్మనాతిష్ఠతి నాన్యదీక్షతే।
స్మృతిర్యథా స్వప్నవిలోకితార్థే।
తథావిదః ప్రాశన మోచనాదౌ॥ ౪౫౭॥

తే-గీ॥ అటులె పరమాత్మయందుండు ననఘుఁడెపుడు।
నుండుసన్మాత్రుఁడై యన్య మొండు గనఁడు।
కుడుపువిడుపును మున్నగునెడలనతని।
జ్ఞప్తి కలగన్న విషయంబుకరణినుండు॥ ౪౫౭॥

శ్లో॥ కర్మణానిర్మితో దేహః ప్రారబ్ధంతస్యకల్ప్యతాం।
నానాదేరాత్మనోయుక్తం నైవాత్మాకర్మనిర్మితః॥ ౪౫౮॥

తే-గీ॥ కర్మమునబుట్టినట్టిది కాయమగుట।
తిరిగిప్రారబ్ధమొకవేళ దీనిదగులు।
నంతెగాని మూలములేని యాత్మనొందు।
దాత్మకర్మముచేనైన యదియుగాదు॥ ౪౫౮॥

శ్లో॥అజోనిత్యశ్శాశ్వతఇతి బ్రూతే శ్రుతిర మోఘవాక్।
తదాత్మనా తిష్ఠతోఽస్య కుతః ప్రారబ్ధకల్పనా॥ ౪౫౯॥

తే-గీ॥ అజుఁడునిత్యుండుశాశ్వతుండనుచు నాత్మ।
జెప్పశ్రుతి సందియములేక చెల్లునట్లు।
గాన నాయాత్మనైయుండు వానినంటు।
నేవిచారింపబ్రారబ్ధ మెన్నడైన॥ ౪౬౦॥

శ్లో॥ ప్రారబ్ధంసిద్ధ్యతితదా యదాదేహాత్మ నాస్థితః।
దేహాత్మభావో నైవేష్టః ప్రారబ్ధంత్యజ్యతామతః॥ ౪౬౦॥

తే-గీ॥ తనువుతానయియుండు నత్తఱినిజెప్ప।
నగునతండు ప్రారబ్ధంబునందునందు।

తనువు తానయియుండుట తగదుగాన।
విడువు ప్రారబ్ధమనుమాటవిజ్ఞతెలక॥ ४౬౧॥

శ్లో॥ శరీరస్యాపి ప్రారబ్ధ కల్పనాభ్రాంతిరేవహి।
అధ్యస్తస్య కుతస్సత్త్వ మసత్త్వస్యకుతోజనిః॥ ४౬౧॥

తే-గీ॥ తనువునకును ప్రారబ్ధంబు దగులుననుట।
భ్రాంతిమాత్రంబె యెట్లన్న భ్రాంతివలన।
నున్నదనుకొన్నదానికి నునికిగలదె।
లేనిదానికిపుట్టువెంకైనగలదె॥ ४౬౭॥

శ్లో॥ అజాతస్యకుతోనాశః ప్రారబ్ధమసతఃకుతః॥४౬౧౪॥

క॥ పుట్టుటయె లేనిదానికి। నెట్టులగున్నాశ మ్మునికి యే లేక భ్రమ।
నెట్టననున్నట్టగుపడు। నట్టిది ప్రారబ్ధమెట్టు లందుం జెపుమా॥४౬౩॥

శ్లో॥ జ్ఞానేనాజ్ఞానకార్యస్య సమూలస్యలయోయది।
తిష్ఠత్యయంకథందేహ ఇతిశంకావతోజడాన్॥४౬౨॥

శ్లో॥ సమాధాతుంబాహ్యదృష్ట్యా ప్రారబ్ధంవదతిశ్రుతిః।
నతుదేహాది సత్యత్వ బోధనాయవిపశ్చితాం॥ ४౬౩॥

తే-గీ॥ తెలియ దెలియమి నున్నట్లు వెలయుచుండి।
నవి మొదలుముట్టనశియించు ననిన యెడల।
దేహమెట్లుండుననుచు సందేహపడెడు।
నజ్ఞులకుదృష్టి సేయంగనాత్మదలచి॥ ४౬४॥

తే-గీ॥ బయటికనె శ్రుతి ప్రారబ్ధవశత దేహ।
ముండుననియంతెకాని యఖండతత్త్వ।
విదులకెల్లను దేహాది విశ్వమెపుడు।
నుండుననితెల్పుటకుగాదు యుక్తినెలుగు॥ ౬౫॥

శ్లో॥ పరిపూర్ణమనాద్యంత మప్రమేయమవిక్రియం।
ఏకమేవాద్వయంబ్రహ్మ నేహనానాస్తికించన॥ ౪౬౪॥

తే-గీ॥ అంతటనునిండి తుదమొదలందకెట్టు।
తెలుగరాక యెట్టివికృతియులేక।
రెండవదిలేనిబ్రహ్మ మొకటెయుండు।
లేదు వేవ్వేఱగుటయిందు లేశమైన॥ ౪౬౬॥

శ్లో॥ సద్ఘనంచిద్ఘనంనిత్య మానందఘనమవ్యయం।
ఏకమేవాద్వయంబ్రహ్మ నేహనానాస్తికించన॥ ౪౬౫॥

తే-గీ॥ మొత్తమైవేఱుపడకుండు సత్తుచిత్తు।
సుఖమునైచేటులేనిదై సుస్థిరమయి।
రెండవదిలేనిబ్రహ్మమొక్కండెయుండు।
లేదువెవ్వేఱగుటయిందు లేశమైన॥ ౪౬౭॥

శ్లో॥ ప్రత్యగేకరసంపూర్ణ మనంతంసర్వతోముఖం।
ఏకమేవాద్వయంబ్రహ్మ నేహనానాస్తికించన॥ ౪౬౬॥

తే-గీ॥ అఖిలసాక్షియు నొకటెరూపైనసుఖము।
నిండితుదలేక యెటుజూడ నుండునట్టి।
రెండవదిలేని బ్రహ్మమొకటెయుండు।
లేదువెవ్వేఱగుటయిందు లేశమైన॥ ౪౬౮॥

శ్లో॥ అహేయమను పాదేయ మనాదేయమనాశ్రయం।
ఏకమేవాద్వయంబ్రహ్మ నేహనానాస్తికించన॥ ౪౬౭॥

తే-గీ॥ పాయగారాని డాయంగదీయరాని।
మొత్తియియ్యగరాని యెందేనిబోని।
రెండవదిలేని బ్రహ్మమొకటెయుండు।
లేదువెవ్వేఱగుట యిందు లేశమైన॥ ౪౭౦॥

శ్లో॥ నిర్గుణంనిష్కలంసూక్ష్మం నిర్వికల్పంనిరంజనం।
ఏకమేవాద్వయంబ్రహ్మ నేహనానాస్తికించన॥౪౭౮॥

తే-గీ॥ గుణములేకయు పలుతెఱంగులునుగాక।
సన్నమైకలలేక యెచ్చట దవులక।
రెండవదిలేనిబ్రహ్మ మొకండెయుండు।
లేదువెవ్వేఱగుటయిందు లేశమైన॥౪౭౦॥

శ్లో॥ అనిరూప్యస్వరూపంయ న్మనోవాచామగోచరం।
ఏకమేవాద్వయంబ్రహ్మ నేహనానాస్తికించన॥౪౭౯॥

తే-గీ॥ ఇట్టిదనిచూపరానిదై యెట్టిదైన।
మాటలకుమానసమునకు సూటిపడని।
రెండవదిలేనిబ్రహ్మ మొకండెయుండు।
లేదువెవ్వేఱగుటయిందు లేశమైన॥౪౭౧॥

శ్లో॥ సత్సమృద్ధంస్వతస్సిద్ధం శుద్ధంబుద్ధమనీదృశం।
ఏకమేవాద్వయంబ్రహ్మ నేహనానాస్తికించన॥౪౭౦॥

తే-గీ॥ వెలయునెప్పుడు దండిగానిలుచుదానె।
తేటమైసాటిలేనిదై తెలియుచుండు।
రెండవదిలేనిబ్రహ్మ మొకండెయుండు।
లేదువెవ్వేఱగుట యిందులేశమైన॥౪౭౨॥

శ్లో॥ నిరస్తరాగా వినిరస్తభోగా।
శ్శాంతాస్సుదాంతాయతయోమహాంతః।
విజ్ఞాయతత్త్వం పరమేతదంతే।
ప్రాప్తాఃపరాంనిర్వృతిమాత్మయోగాత్॥౪౭౧॥

తే-గీ॥ కోరికలజంపి సుఖములజేరనీక।
శమము దమమునుగల యతులున్నమహాత్ము।

లిట్టిపరమాత్మ నెఱిగియే చిట్టచివర।
కందుగలిసి విముక్తులైరయ్యావినుము॥౪౭౩॥

శ్లో॥ భవానపీదం పరతత్త్వమాత్మన।
స్స్వరూపమానంద ఘనం విచార్య।
విధూయ మోహం స్వమనః ప్రకల్పితం।
ముక్తః కృతార్థో భవతు ప్రబుద్ధః॥౪౭౪॥

మత్తకోకిల॥ నీవునీపరమాత్మ తత్త్వమునిత్యచిత్సుఖమేకము।
న్సావధానముగావిచారణసల్పి నిశ్చయమొంది దు।
ర్భావమైనమనంబుచేసిన భ్రాంతిపైకెగజిమ్మియా।
కేవలంబగుముక్తి మేడను క్రీడసేయుముధన్యతన్॥౪౭౪॥

శ్లో॥ సమాధినాసాధు వినిశ్చలాత్మనా।
పశ్యాత్మతత్త్వంస్ఫుటబోధచక్షుషా।
నిస్సంశయంసమ్యగవేక్షితశ్చే।
చ్ఛ్రుతఃపదార్థోనపునర్వికల్పతే॥౪౭౩॥

మత్తకోకిల॥ వాటమైచలనంబులేకలవాటుపడ్డసమాధిలో।
తేటతెల్వినిజూడుముచ్చటదీఱగాబరతత్త్వమున్।
ధాటిగామఱుమాటలేక శ్రుతస్వరూపముతెల్లమై।
సూటినిల్చిననింకబుట్టవుసుమ్మునీకువికల్పముల్॥౪౭౫॥

శ్లో॥ స్వస్యావిద్యాబంధసంబంధమోక్షా।
త్సత్యజ్ఞానానందరూపాత్మలబ్ధౌ।
శాస్త్రంయుక్తిర్దేశికోక్తిః ప్రమాణం।
నాతస్సిద్ధాస్వానుభూతిః ప్రమాణం॥౪౭౪॥

తే-గీ॥ నీకెఱుంగమిచేబాల్చి నిల్చియున్న।
కట్లువిడిచిన సచ్చిత్సుఖస్వరూప।

మొప్పుశన నండ శాస్త్రింబుయుక్తి గురువు।
నాన యువిచాలకున్న నీయనుభవంబు॥౪౭౬॥

శ్లో॥ బంధో మోక్షశ్చతృప్తిశ్చ చింతారోగ్యక్షుదాదయః।
స్వేనైవ వేద్యాయజ్జ్ఞానం పరేషామానుమానికం॥౪౭౫॥

తే గీ॥ కట్టు విడుపును తృప్తి దుఃఖంబుసుఖము।
నాకలియుడప్పిమున్నగు నవి గలిగిన।
వారె యెఱుగంగదగినవి వారికెట్టి।
వెనసియుండుట నన్యులూహింపవలయు॥౪౭౭॥

శ్లో॥ తటస్థితాబోధయంతి గురవశ్శ్రుతయోయథా।
ప్రజ్ఞయైవతరేద్విద్వా నీశ్వరానుగృహీతయా॥౪౭౬॥

తే-గీ॥ దరిని తాముండి గురువు లాదరముతోడ।
వేదములరీతి బోధింతు రిదు తెఱగు।
నీశ్వరానుగ్రహంబుచే వృద్ధిబొందు।
తెలివిసేదాటవలయును జలధిబుధుడు॥౪౭౮॥

శ్లో॥ స్వానుభూత్యాస్వయంజ్ఞాత్వా స్వమాత్మానమఖండితం।
సంసిద్ధస్సన్సుఖంతిష్ఠే న్నిర్వికల్పాత్మనాత్మని॥౪౭౭॥

తే-గీ॥ ఒకరుడైయుండుతను చానె యోపికగని।
చెదరకుండుసమాధి సంసిద్ధుడగుచు।
సుఖముగానుండి తనుచానెచూచుచెవుడు।
నాత్మమాత్రతనేమఱ కలరవలయు॥౪౭౯॥

శ్లో॥ వేదాంతసిద్ధాంతనిరుక్తిరేషా బ్రహ్మైవజీవస్సకలంజగచ్చ।
అఖండరూపస్థితిరేవ మోక్షో బ్రహ్మాద్వితీయేశ్రుతయఃప్రమాణం॥

తే-గీ॥ నిగమములతుదనుండెడి నిశ్చయమిది।
బ్రహ్మమేజీవుడెల్లవిశ్వంబుగూడ।

నేకమ్మై వేఱుపడకుండు నేవిముక్తి।
బ్రహ్మమద్వయమనియొప్పబలుకుశ్రుతులు॥౪౮౦॥

శ్లో॥ ఇతిగురువచనాచ్ఛ్రుతి ప్రమాణా।
త్పరమవగమ్య స తత్త్వమాత్మయుక్త్యా।
ప్రశమితకరణ స్సమాహితాత్మా।
క్వచిదచలాకృతిరాత్మనిష్ఠతోఽభూత్॥ ౪౭౯॥

చ॥ అనియిటులన్నసద్గురుని యా పలుకుల్విని వేదనిశ్చయం।
బునుగని యుక్తిగూర్చి పరముం గుఱితించి సమాధినిష్ఠచే।
తనసకలేంద్రియంబుల మదంబణగించి చలింపకుండ నా।
త్మనిరతినద్రియట్లు మతిమంతుఁడుశిష్యుఁడు నిశ్చలత్వజెన్॥ ౪౮౧॥

శ్లో॥ కంచిత్కాలం సమాధాయ పరేబ్రహ్మణి మానసం।
వ్యుత్థాయ పరమానందా దిదంవచనమబ్రవీత్॥ ౪౮౦॥

క॥ కొండొకతడవుమనంబును। నిండుపరబ్రహ్మమందునిలిపియచలుఁడై।
యుండిపదంపడిపరమా। ఖండానందమునగురువుగని యిట్లనియెన్॥

శ్లో॥ బుద్ధిర్వినష్టా గళితా ప్రవృత్తి।
ర్బ్రహ్మాత్మనో రేకతయా ధిగత్యా।
ఇదంనజానేఽప్యనిదం నజానే।
కింవాకియద్వా సుఖమస్యపారం॥ ౪౮౧॥

తే గీ॥ బ్రహ్మమును నేను నొకటిగానెఱిగినిలువ।
బుద్ధినశియించె సంసృతి పొలువుమాసె।
నిదియును నెఱుంగ నిదిగానిదెదియు నెఱుగ।
నాసుఖంబేమొయదియెంతో యదియు నెఱుగ॥ ౪౮౩॥

శ్లో॥ వాచావక్తుమశక్యమేవమనసా మంతుంనవాస్వాద్యతే।
స్వానందామృతపూరపూరిత పరబ్రహ్మాంబుధేర్వైభవం

అంభోరాశివిశీర్ణ వార్షికశిలా భావంభజన్మేమనో,
యస్యాంశాంశలవే విలీనమధునానందాత్మనా నిర్వృతం॥ ౪౮

ఉ॥ మాటలఁజెప్పరాదు మఱి మానసమందగజాల దాచవిక్।
సాటియె లేనియాత్మసుఖ సారసుధారసముబ్బిపొర్లు ము।
న్నీటిని బ్రహ్మమెన్నగల నే మనసిప్పుడు దానిలో త్రస।
న్మేటిసుఖంబెమైకి అగ్ర నీరధిలోవడగంటి కైవడిక్॥ ౪౮౪॥

శ్లో॥ క్వగతంకేనవానీతం కుత్రలీనమిదంజగత్।
అధునైవమయాదృష్టం నాస్తికింమహదద్భుతం॥ ౪౮౩॥

ఆ-వె॥ అకట యిప్పుడేగదా నేనుజూచితి।
నీజగంబునెల్ల నేదియిప్పు।
డెందుబోయెనయ్య యెవ్వడుగొనిపోయె।
నెందడంగెనయ్య యేమివింత॥ ౪౮౫॥

శ్లో॥ కిం హేయం కిముపాదేయం కిమన్యత్కింవిలక్షణం।
అఖండానందపీయూష పూర్ణే బ్రహ్మమహార్ణవే॥ ౪౮౪॥

ఆ-వె॥ ఏకరూపమైన యీసుఖామృతముచే।
నిండిపికరిట్టిల్లు నీరధియగు।
బ్రహ్మమందు నేది పాయుదు నెదికొందు।
నన్యమేది వేఱైనదేది॥ ౪౮౬॥

శ్లో॥ నకించిదత్రపశ్యామి నశ్రుణోమినవేద్మ్యహం।
స్వాత్మనైవసదానంద రూపేణాస్మి విలక్షణః॥ ౪౮౫॥

ఆ-వె॥ ఇచ్చోట కింతయైన నేజూడనేవిన।
నేనెఱుంగనెదియు నేకరూప।
మైనసుఖమునగుచు నన్నింటివిడిచియు।
న్నాడసతతంబు నాకుసేవ॥ ౪౮౭॥

శ్లో॥ నమోనమస్తే గురవేమహాత్మనే।
విముక్తసంగా యసదుత్తమాయ।
నిత్యాద్వయానంద రసస్వరూపిణే।
భూమ్నేసదా పారదయాంబుధామ్నే॥ ౪౬౭।

తే గీ॥ దేనినంటకనిండి సందీనివాడ।
తెగనిజత లేని సుఖరసంబగుమహాత్మ।
నిజమెఱుగు ప్రోడకడలేని నెనరుకడలి।
వందనమునీకు నాస్వామి వందనంబు॥ ౪౬౮॥

శ్లో॥ యత్కటాక్ష శశిసాంద్రచంద్రికా।
పాతధూతభవతాపజశ్రమః।
ప్రాప్తవానహమఖండవైభవా।
నందమాత్మపదమక్షయం క్షణాత్॥ ౪౬౯॥

ఉ॥ చల్లనిపండువెన్నెల వెసన్మొయిసోకిన తాపదుఃఖముల్।
జల్లనిపాసిహాయిగను చాడ్పున నీకడకంటిచూపునా।
యుల్లముసోకి సంసృతి మహోగ్ర తపంబడగెన్ క్షణంబులో।
చెల్లెనొకండెతానైచెడని చిత్సుఖ దివ్యపదంబు నాకిటన్॥౪౭౦॥

శ్లో॥ ధన్యోఽహంకృతకృత్యోఽహం విముక్తోఽహంభవగ్రహాత్।
నిత్యానందస్వరూపోఽహం పూర్ణోహం త్వదనుగ్రహాత్॥ ౪౭౧॥

క॥ కడతేరితినీదయచే। విడిచె భవగ్రహమునన్ను విడువనిసుఖమా।
కడజేరితి నిండితిని। లఖండనంతటా నింక లేదుకార్యము నాకున్॥౪౭౨॥

శ్లో॥ అసంగోఽహమనంగోఽహ మలింగోఽహమభంగురః।
ప్రశాంతోఽహమనంతోఽహ మమలోహంచిరంతనః॥ ౪౭౩॥

తే.గీ॥ ఏమియునునంటనేమేని నేసినొందద।
నేగుఱుతులేనివాడనే నెందుచెడను।

మిగులశాంతుడ తుదలేకమిగులువాడ।
నిర్మలుడనెప్పుడొకరీతి నిలుచువాడ॥౪౯౧॥

శ్లో॥ అకర్తాహమభోక్తాహ మవికారోఽహమక్రియః।
శుద్ధబోధస్వరూపోఽహం కేవలోఽహంసదాశివః॥౪౯౨॥

తే-గీ॥ దేనిజేయను గుడువనే దేనినేని।
నేవికారంబుగర్మంబు నేనుబొరయ।
నెప్పుడును నొకరూపమౌ తెల్వినే నెయవుడు।
తేటగా తేలి హాయిగా తెలియుచుండు॥౪౯౨॥

శ్లో॥ ద్రష్టుశ్శ్రోతుర్వక్తుః కర్తుర్భోక్తుర్విభిన్నఏవాహం।
నిత్యనిరంతరనిష్క్రియనిస్సీమాసంగపూర్ణబోధాత్మా॥౪౯౩॥

తే-గీ॥ కనుచు వినుచును పలుకుచు కర్తనగుచు।
ఫలముగుడుచుచునుండెడు వాడగాను।
విడువకెప్పుడు క్రియలేక గడువబడక।
దేనినంటకనిండిన తెలివినేను॥౪౯౩॥

శ్లో॥ నాహమిదంనాహమదోప్యుభయోరవభాసకంపరంశుద్ధం।
బాహ్యాభ్యంతరశూన్యం పూర్ణంబ్రహ్మాద్వితీయమేవాహం॥౪౯౪॥

తే-గీ॥ నేనుగానిది యదియు రెండిటి వెలుంగ।
చేయుఁగడపలి తేటయౌచిత్తు నేను।
లోనువెలుపలయును నవి లేనివాడ।
రెండవది లేనిబ్రహ్మమై నిండినాడ॥౪౯౪॥

శ్లో॥ నిరుపమమనాదితత్త్వం త్వమహమిదమదఇతికల్పనాదూరం।
నిత్యానందైకరసంసత్యం బ్రహ్మాద్వితీయమేవాహం॥౪౯౫॥

తే-గీ॥ మొదలులేకయు దేనితో బోల్పరాక।
యేనునీవిదియదియను నేవికల్ప।

మొదఁ గొప్పుడు నొకచవి నుండునట్టి।
మాఱ్పుపొంటలేని సుఖము బ్రహ్మంబె నేను॥౬౫॥

శ్లో॥ నారాయణోఽహం నరకాంతకోఽహం।
పురాంతకోఽహం పురుషోఽహమీశః।
అఖండబోధోఽహమశేషసాక్షీ।
నిరీశ్వరోఽహం నిరహంచ నిర్మమః॥౬౬॥

తే.గీ॥ ఆ నరకనాశకుడను నారాయణుడను।
పురహరుడ బురుషుడను నీశ్వరుడ సాక్షి।
నేకమగు తెల్వి నాకుపై నెవడు లేడు।
నేను నాయది యను నవి లేనివాడ॥౬౭॥

శ్లో॥ సర్వేషు భూతేష్వహమేవ సంస్థితో।
జ్ఞానాత్మనాంతర్బహిరాశ్రయస్సన్।
భోక్తా చ భోగ్యం స్వయమేవ సర్వం।
యద్యత్పృథగ్దృష్టమిదంతయా పురా॥౬౮॥

తే.గీ॥ తెలివినై లోన వెల్పల నిలిచి నేనె।
యన్నిభూతములందు నున్నట్టివాడ।
కుడుచువాడును కుడువంగబడెడు నఖిల।
మిదియనుచు మున్ను జూచిన దెల్ల నేనె॥౬౯॥

శ్లో॥ మయ్యఖండసుఖాంభోధౌ బహుధా విశ్వవీచయః।
ఉత్పద్యంతే విలీయంతే మాయామారుతవిభ్రమాత్॥౭౦॥

తే.గీ॥ వేఱుపడకుండు చిత్సుఖాబ్ధి నయియుండు
నట్టినాయందు విశ్వంబు లలల చుట్టు।
వేయు తెఱగుల బుట్టుచు మాయుచుండు।
మాయయను గాలి సుడియుచు మలయుకతన॥౭౧॥

శ్లో॥ స్థూలాదిభావా మయి కల్పితా భ్రమా।
దారోపితా నుస్ఫురణేన లోకైః।
కాలే యథా కల్పకవత్సరాయ।
నర్త్వాదయో నిష్కలనిర్వికల్పే॥౪౯౭॥

చ॥ యుగము నుగల్ప మేడు నెలయున్మొదలైనమితుల్ జనుల్కృతిం।
దెగకయు మాఅకండ నొకతీరగు కాలమునందు నెన్నన।
టొగిభ్రమచోచు వానివయి యున్న క్రియంగను పట్టు మేనులో।
నగున వినాశు నున్నవని యందరు నేనట వెల్లుచుండుటన్॥౫౯౯॥

శ్లో॥ ఆరోపితం నాశ్రయదూషకం భవే।
త్కదాపి మూఢైరతిదోషదూషితైః।
నార్ద్రీకరోత్యూషరభూమిభాగం।
మరీచికావారిమహాప్రవాహః॥౪౯౮॥

చ॥ కదుగలు పొత్తులౌ నరుల కన్నుల కున్న తెఱంగునం గనం।
బడి నిజమెన్న లేనియది వాస్తవమైననుఁ గలంచునే।
జడుల విష మోహదృష్టికి నిజంబుగ వెల్లువ నీరు గాఁగనం।
బడెడు యెడి యెండమావుల విపాటిన భూమికి జమ్ము దెచ్చునే॥౫౦౦॥

శ్లో॥ ఆకాశవల్లేపవిదూరగోఽహ।
మాదిత్యవద్భాస్య విలక్షణోఽహం।
అహార్యవన్నిత్య వినిశ్చలోఽహ।
మంబోధివత్పారవివర్జితోఽహం॥౫౯౯॥

తే.గీ॥ ఆకసము బోలి మాలిని యట్టివాఁడ।
నినుని వలె వెల్గు గొనువాని నెనయ నేను।
కొండయట్లెట్లు కదలక యుండువాఁడ।
కడలి పోలిక దరిలేని ఘనుఁడ నేను॥ ౫౦౧॥

శ్లో॥ నమే పే హీన సంబంధో మే ఘే దేవవిహాయసః।
అతః కుతో మే తద్ధర్మా జాగ్రత్స్వప్న సుషుప్తయః॥ ౫౦౦॥

తే-గీ॥ ఆకసము మొయిలంటని యట్లె నేను।
మేని నెన్నడు నంటము గాన నాకు।
గలుగు నేదాని వైన మేలకొనుట కలల।
గనుట నిదురించుటను పనుల్లనియు మృతియు॥ ౫౦౧॥

శ్లో॥ ఉపాధిరాయాతి సనీవ గచ్ఛతి సఏవ కర్మాణి కరోతి భుఙ్క్తే।
సఏవ జీర్యన్మ్రియతే సదాహం కులాద్రివన్నిశ్చలఏవ సంస్థితః॥ ౫౦౨॥

తే-గీ॥ వచ్చె నేనిను పాధి డా వచ్చు బోవు।
పనులనదె చేయు నదె ఫలంబను భవించు।
నదె శిథిలమైన శించు నే నెనగ బెద్ద।
కొండవలె నన్నిలకదలక యుండువాడ॥ ౫౦౩॥

శ్లో॥ నమే ప్రవృత్తిర్న చ మే నివృత్తి।
స్సదైక రూపస్య నిరంశకస్య।
ఏకాత్మకో యో నిబిడో నిరంతరో।
వ్యోమేవ పూర్ణస్స కథం ను చేష్టతే॥ ౫౦౪॥

తే-గీ॥ దేని నే జేయు మతి దేని నేని విడువ।
నొకటి రూపైన సత్తునే బెకుటి గాను।
పికటి టిలిసందు లేక తానొకటి డగుచు।
నాకసము వలె నిండు వాడగు నెకదలు॥ ౫౦౫॥

శ్లో॥ పుణ్యాని పాపాని నిరింద్రియస్య।
నిశ్చేతసో నిర్వికృతేర్నిరాకృతేః।
కుతో మమాఖండసుఖానుభూతే।
ర్బ్రూతే హ్యనన్వాగతమిత్యపి శ్రుతిః॥ ౫౦౬॥

తే-గీ॥ ఇంద్రియంబులుమనసు లేకేవికార।
మాకృతియులే కఖండసుఖానుభవమె।
నైయునాకునుపాపపుణ్యములుగలవె।
వెంటనివిరావనియుచెప్ప వేదములును॥౫౦౫॥

శ్లో॥ ఛాయయా స్పృష్టముష్ణంవా శీతంవాసుష్ఠుదుష్ఠువా।
నస్పృశత్యేవయత్కించి త్పురుషంతద్విలక్షణం॥ ౫౦౪॥

ఆ-వె॥ మేనినీడవేఁడిమినిగాని చలిగాని।
మంచిచోటుగాని మైలగాని।
సోకుగాక నీడగాక వేఱగునట్టి।
నరుని నాగుణములు బొరయగలవె॥ ౫౦౬॥

శ్లో॥నసాక్షిణం సాక్ష్యధర్మా స్సంస్పృశంతి విలక్షణం।
అవికారముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్॥ ౫౦౭॥

తే గీ॥ అట్లెయెట్టివికారంబులంటకుండ।
దగులకేజోలియును వేఱై యగుచు సాక్షి।
నైననునంటవగపడు వానిగుణము।
లింటిగుణములు దీపంబునంటనిక్రియ॥ ౫౦౭॥

శ్లో॥ రవేర్యథాకర్మణిసాక్షిభావో।
వహ్నేర్యథావాయసిదాహకత్వం*।
రజ్జోర్యథారోపితవస్తుసంగ।
స్తథైవకూటస్థచిదాత్మనోమే॥ ౫౦౮॥

తే-గీ॥ అరుకుడెట్లన్నిపనులకు సాక్షియగుట।
యగ్నియినుమును గాల్చువాడగుటయెట్లు ×।

పాఠాంతరము.

* వహ్నేర్యథా దాహనియామకత్వం।
× అగ్నివేడిమినిచ్చువాఁడగుటయెట్లు॥

త్రాసుతనయుంచుదోచు సర్వమెటులంటు।
నల్లెకూటస్థచిన్మాత్రమైన నేను॥ ౫౦౮॥

శ్లో॥ కర్తాపి వా కారయితాపి నాహం।
భోక్తాపి వా భోజయితాపి నాహం।
ద్రష్టాపి వా దర్శయితాపి నాహం।
సోఽహం స్వయం జ్యోతి రనీదృగాత్మా॥ ౫౦౯॥

తే గీ॥ ఎదియు జేయను చేయింప నెదియు నేను।
ఫలమనుభవింప ననుభవింపంగ జేయ।
నెదియుఁ జూడను చూపింప నెట్టివాడ।
నని తెలియరాక నాయంత నలరుచుందు॥ ౫౧౦॥

శ్లో॥ చలత్యుపాధౌ ప్రతిబింబలౌల్య।
మౌపాధికం మూఢధియో నయంతి।
స్వబింబభూతం రవివద్వినిష్క్రియం।
కర్తాస్మి భోక్తాస్మి హతోఽస్మి హేతి॥ ౫౧౧॥

ఉ॥ ఆడెను నాశ్రయంబునను నాడెడునీడను గాంచి మూఢులా।
యాడుట యాశ్రయంబనుచు నారయలే కల నీడమూలమౌ।
నాడన సూర్యుఁడాడెనని నట్టులు పాధిగుణంబులేవియుం।
గూడ తనిమ్ముగూర్చి యనుకొందురు కర్తను భోక్తనంచిలన్॥ ౫౧౨॥

శ్లో॥ జలేవాపి స్థలేవాపి లుఠత్వేష జడాత్మకః।
నాహం విలిప్యే తద్ధర్మై ర్ఘటధర్మై ర్నభో యథా॥ ౫౧౩॥

తే-గీ॥ మెఱ్ఱదిజలంబులోనైన భూమినైన।
దొర్లగా కేమి నేదానితోడఁ గూడి।
దానిగుణముల గలియను దానగుణము।
లాకసంబంటకుండెడి యావిధమున॥ ౫౧౪॥

శ్లో॥ కర్తృత్వభోక్తృత్వ ఖలత్వమత్తతా।
జడత్వ బద్ధత్వవిముక్తతాదయః।
బుద్ధేర్వికల్పానతుసంతివస్తుత।
స్వస్మిన్పరే బ్రహ్మణికేవలేఽద్వయే॥ ౫౧౦॥

శా॥ నేనేచేయుదు నే భుజింతుఫలమున్నేదుష్టుడన్మత్తుడ।
న్నేనజ్ఞుండను నేనుకట్టబడితె న్నేముక్తుడన్ లెస్సగా।
నేనున్నానను నిట్టివెల్లమతిలో నే పుట్టుదోషంబు లా।
హా నికటంబుగ లే వాకండ నగుబ్రహ్మంబైన నాకేవియున్॥౫౧౧॥

శ్లో॥ సంతువికారాః ప్రకృతేర్దశధాశతధాసహస్రధాచాపి।
తైఃకింమేఽసంగచితేర్నహ్యంబుదడంబరోఽంబరంస్పృశతి॥౫౧౧

ఆ-వె॥ పదులు నూర్లు వేలు ప్రకృతి వికారంబు।
లుండుగాక యెన్ని యున్ననేదియు।
నంటకుండు తెల్వినైయుండునాకేమి।
మేఘమంటగలదె మింటిదొడరి॥ ౫౧౩॥

శ్లో॥ అవ్యక్తాదిస్థూలపర్యంత మేత।
ద్విశ్వం యత్రాభాసమాత్రం ప్రతీతం।
వ్యోమప్రఖ్యం సూక్ష్మ మాద్యంతహీనం।
బ్రహ్మాద్వైతంయత్తదేవాహమస్మి॥ ౫౧౪॥

తే-గీ॥ తోచునవ్యక్తమునుదొట్టి స్థూలతనువు।
వఱకు నీవిశ్వమెల్ల నే వస్తువునను।
నీడవలెతోచు నాసూక్ష్మమీదు లేని।
మొదలుకొనలేని బ్రహ్మమన్ చదలె నేను॥ ౫౧౪॥

శ్లో॥ సర్వాధారం సర్వవస్తుప్రకాశం।
సర్వాకారం సర్వగం సర్వశూన్యం।

నిత్యంశుద్ధం నిశ్చలం నిర్వికల్పం।
బ్రహ్మాద్వైతం యత్తదేవాహమస్మి॥ ౫౧౩॥

ఉ॥ అన్నిటికేదియాధరువొ యన్నిటినేది వెలుంగఁజేయునో।
యన్నియుదేనిరూపొ మెదియన్నిటనుండునో దేనికన్నియుఙ్।
సున్నదియొ యట్టినిత్యమును శుద్ధమునిశ్చలమేవికల్పము।
ల్సన్నవసేయుచుండు పరమంబగు బ్రహ్మమొకండె నేనహా॥ ౫౧౫॥

శ్లో॥ యత్ప్రత్యస్తాశేష మాయావిశేషం।
ప్రత్యగ్రూపం ప్రత్యయాగమ్యమానం।
సత్యజ్ఞానానంత మానందరూపం।
బ్రహ్మాద్వైతంయత్తదేవాహమస్మి॥ ౫౧౪॥

తే-గీ॥ మాయచేదోచు నవియెల్లమాపెనేది।
యేవి యన్నిటికెడమైన దేగుఱుతున।
కందనిది సచ్చిదానంద మాత్మసౌఖ్య।
మట్టిదియొండగు బ్రహ్మంబె నైతినేను॥ ౫౧౬॥

శ్లో॥ నిష్క్రియోఽస్మ్యవికారోఽస్మి నిష్కలోఽస్మినిరాకృతిః।
నిర్వికల్పోఽస్మి నిత్యోఽస్మి నిరాలంబోఽస్మి నిర్ద్వయః॥ ౫౧౫॥

తే-గీ॥ కదల నేనేవికారంబు గాంచనేను।
చీలన్నేను రూపేదియు జెందనేను।
మాఱునేన్పునందు నిమ్మళమునగాను।
పట్టులేకుండు రెండవపాటిలేక॥ ౫౧౭॥

శ్లో॥ సర్వాత్మకోఽహంసర్వోఽహం సర్వాతీతోఽహమద్వయః।
కేవలాఖండబోధోఽహం స్వానందోఽహంనిరంతరం॥ ౫౧౬॥

తే గీ॥ నాదురూపె యంతయును నంతయును నేనె।
యంతయునువింతు లేదునాకన్యమొండు।

చేసినంటని చెదరని తెలివిసేను।
నాదుసుఖమున నెప్పుడు నూదియుందు॥ ౫౧౭ ॥

శ్లో॥ స్వారాజ్య సామ్రాజ్య విభూతి రేషా।
భవత్కృపా శ్రీమహిత ప్రసాదాత్।
ప్రాప్తా మయా శ్రీగురవే మహాత్మనే।
నమోనమస్తేఽస్తు పునర్నమోఽస్తు॥ ౫౧౮॥

తే గీ॥ ఓ మహాత్మ శ్రీగురుమూర్తి నీమహిమను।
నీదయ ననుగ్రహంబున నేబడసితి।
నీమహారాజ్య సామ్రాజ్య మీసమగ్ర।
సంపదను నీకుని దెనమస్కారశతము॥ ౫౧౯॥

శ్లో॥ మహాస్వప్నే మాయాకృత జనిజరామృత్యుగహనే।
భ్రమంతం క్లిశ్యంతం బహుళతర తాపైరనుదినం।
అహంకార వ్యాఘ్రవ్యథిత మిమమత్యంత కృపయా।
ప్రబోధ్య ప్రస్వాపా త్పర మవతవా న్మామసిగురో॥ ౫౧౯॥

ఉ॥ పుట్టుటవృద్ధుడౌట మృతిబొందుట యన్వనమందు జిక్కినే।
బెట్టసుగ్రాగి నిత్యమును బెలుకరి క్రుమ్మరుచున్న వ్యాఘ్రమై।
యట్టె యహమ్మునన్ దఱుమ నాపెతివందురినట్లుమాయచే।
బుట్టిననాకలం జెలిపి ప్రోచితి నతకృపనన్ గురుప్రభూ॥ ౫౨౦॥

శ్లో॥ నమస్తస్మై సదేకస్మై కస్మైచిన్మహసేనమః।
యదేతద్విశ్వరూపేణ రాజతే గురురాజ తే॥ ౫౧౯॥

క॥ ఏనీదురూపు విశ్వం। బై నిరతము నలరుచుండునట్టిసత మొకం।
డైన యొకానొక వెలుగున। కే నతులొనరింతు జూడవే గురువర్యా॥

శ్లో॥ ఇతినతమవ లోక్యశిష్యవర్యం।
సమధిగతాత్మసుఖం ప్రబుద్ధతత్త్వం।

ప్రమథిత హృదయస్స దేశికేంద్రః।
పునరిదమాహవచః పరంమహాత్మా॥ ౫౨౦॥

తే గీ॥ అనుచు బరతత్త్వమెఱిగి సుఖానుభవము।
గలిగి మ్రొక్కిన శిష్యాగ్రగణ్యు బూచి।
యధిక సంతోష మొంది మహాత్ముడైన।
యాగురువు మఱియిట్లని యానతిచ్చె॥ ౫౨౦॥

శ్లో॥ బ్రహ్మప్రత్యయసంతతిర్జగదతో బ్రహ్మైవసత్సర్వతః।
పశ్యాధ్యాత్మదృశా ప్రశాంతమనసా సర్వాస్వవస్థాస్వపి।
రూపాదస్యద వేక్షితం కిమభితశ్చక్షుష్మతాం దృశ్యతే।
తద్వద్బ్రహ్మవిదస్సతః కిమపరంబుద్ధేర్విహారాస్పదం॥ ౫౨౧॥

శా॥ తోచుం బ్రహ్మముచిన్నెలే జగము లెందుం గాన బ్రహ్మంబెస।
త్తాచదంబున నంతటంగనుము సర్వావస్థల న్నెమ్మదిం।
దోచంగల్గునె నేత్రవంతులకు నెందున్ రూపుగాకన్యము।
ల్లేచెల్లున్మతికాటపట్టుగను సత్తేయంతటన్ జ్ఞానికిన్॥ ౫౨౩॥

శ్లో॥ కస్తాంపరానంద రసానుభూతి।
ముత్సృజ్యశూన్యేషురమేత విద్వాన్।
చంద్రేమహాహ్లాదిని దీప్యమానే।
చిత్రేందుమాలోక యితుంకఇచ్ఛేత్॥ ౫౨౨॥

తే-గీ॥ మహితసుఖరసమానుభవమానివిజ్ఞు।
డెవ్వడేనియు లేనివియియ్యకొనునె।
కడుముదంబిచ్చు రేవెల్గు గాలుచుండ।
దానిబొమ్మనెవండైన గానబోవు॥ ౫౨౪॥

శ్లో॥ అసత్పదార్థానుభవేనకించి న్నహ్యస్తితృప్తిర్నచదుఃఖహానిః।
తదద్వయానందరసానుభూత్యా తృప్తస్సుఖంతిష్ఠ సదాత్మనిష్ఠయా॥

తే-గీ॥ వట్టివస్తువు లనుభవింపంగ నించు
నైన తనివియు వెతమాను టదియు లేదు।
గానసరిలేనిసుఖరసమాని తనివి।
హాయి గనుచుండు మెపుడు సత్తుగుచు నిలిచి॥౫౨౫॥

శ్లో॥ స్వమేవసర్వధాపశ్య న్మన్యమానస్స్వమద్వయం।
స్వానందమనుభుంజానః కాలంనయమహామతే॥౫౨౬॥

క॥ నిన్నేయంతటబూచుచు నిన్నేరెండవదిలేనినిజమనుకొనుచుం।
బన్నుగసాత్మసుఖంబే క్రన్ననగొను చెపుడుగడపు కాలముసుమతీ॥

శ్లో॥ అఖండబోధాత్మనినిర్వికల్పే।
వికల్పనంవ్యోమ్ని పురప్రకల్పనం।
తదద్వయానందమయాత్మనాసదా।
శాంతింపరామేత్యభజస్వమౌనం॥౫౨౭॥

తే-గీ॥ రెండవదిలేని కలగని నిండు తెలివి।
నన్యమగపడుటాకసంబందుఁబురము।
పొలుచుక్రియ గాన సరిలేని పూర్ణసుఖమ।
వై పరమశాంతినొంది యేమనకయుండు॥౫౨౮॥

శ్లో॥ తూష్ణీమవస్థాపరమోపశాంతి।
ర్బుద్ధేరసత్కల్పవికల్పహేతోః।
బ్రహ్మాత్మనాబ్రహ్మవిదోమహాత్మనో।
యత్రాద్వయానంద సుఖంనిరంతరం॥౫౨౯॥

తే గీ॥ ఊరకుండెడుస్థితి లేని యున్నయట్లు।
గనబఱచుబుద్ధి యేమియుఁ గదలకెపుడు।
బ్రహ్మమైయుంట దీనిచే బ్రహ్మమెఱుగు।
ఘనుడు గను సరిలేని సౌఖ్యంబునెపుడు॥౫౩౦॥

శ్లో॥ నాస్తిన్నిర్వ్యాసనాన్మ్నానా త్పరంసుఖకృదుత్తమం।
విజ్ఞాతాత్మస్వరూపస్య స్వానందరసపాయినః॥ ౫౨౭॥

తే-గీ॥ తనదునిజమైనరూపంబు దానెఱింగి।
నిత్యమానందరసపాన నిరతుడైన।
వానికేతలపునులేని వాసనదశను।
మించి సుఖమిచ్చునది మఱేమియును లేదు॥ ౫౨౮॥

శ్లో॥ గచ్ఛంస్తిష్ఠన్నుపవిశ౯ శయానోవాన్యథాపివా।
యథేచ్ఛయావసేద్విద్వా నాత్మారామస్సదామునిః॥ ౫౨౯॥

తే-గీ॥ నడుచుచున్నను నిల్చియున్నను మెదలక।
కూరుచున్నను దా బండుకొన్ననైన।
నిచ్చవచ్చినయట్లున్న నెపుడు మౌని।
యై తనంతట తానుండనగు బుధుండు॥ ౫౩౦॥

శ్లో॥ నదేశకాలాసనదిగ్యమాది లక్ష్యాద్యపేక్షా ప్రతిబద్ధవృత్తేః।
సంసిద్ధతత్త్వస్యమహాత్మనోఽస్తి స్వవేదనేకానియమాద్యవస్థా॥

తే-గీ॥ వృత్తి దానిల్చి బ్రహ్మంబు వెలయనెఱిగి।
యలరుఘనునకు దనుదానె తెలియుకొఱకు।
స్థలమ్ముసమయంబుదిక్కు నాసనము యమము।
మున్నగునవస్థలును లక్ష్యములును నేల॥ ౫౩౧॥

శ్లో॥ ఘటోఽయమితివిజ్ఞాతుం నియమఃకోన్వపేక్షతే।
వినా ప్రమాణసుష్ఠుత్వం యస్మిన్సతిపదార్థధీః॥ ౫౩౦॥

క॥ ఘటమిదియని యెఱుగనెవం।
డిట నియమమువలయునంచు నిచ్చంజేయు౯।
దిటముగ వస్తువు దెలియగ।
స్ఫుటమైతగుగుఱియొకండు పొసగినజాలు౯॥ ౫౩౨॥

శ్లో॥ అయమాత్మా నిత్యసిద్ధః ప్రమాణే సతి భాసతే।
న దేశం నాపి వా కాలం న శుద్ధిం వాప్యపేక్షతే॥౫౩౧॥

క॥ ఈయాత్మ యెపుడు దెల్లం।
బైయమరుచు గుఱిగుదిరినయప్పుడె తెలియుం।
బాయకి స్థలము సమయము।
పాయము లేవియును గోరబని లేదు సుమీ॥౫౩౧॥

శ్లో॥ దేవదత్తోఽయమిత్యేతద్విజ్ఞానం నిరపేక్షకం।
తద్వద్బ్రహ్మవిదోఽప్యస్య బ్రహ్మాహమితి వేదనం॥౫౩౨॥

తే-గీ॥ దేవదత్తుఁడ నేనని తెలియఁగోరుటకు।
నేనియమములు నక్కఱ లేనియట్లు।
బ్రహ్మమెఱిగినవాఁడు నే బ్రహ్మమనుచు।
దెలియ నేనియమంబులు వలవ దెపుడు॥౫౩౨॥

శ్లో॥ భానునేవ జగత్సర్వం భాసతే యస్య తేజసా।
అనాత్మకమసత్తుచ్ఛం కిం ను తస్యావభాసకం॥౫౩౩॥

తే-గీ॥ తరణి జగములవెల్గించు కరణి నెవ్వ।
డాత్మదీప్తిని నీహేయమై నిజంబు।
గాక తోచు ననాత్మ వెల్గంగఁజేయు।
నట్టివాని వెలుంగించునది యుఁగలదె॥౫౩౩॥

శ్లో॥ వేదశాస్త్రపురాణాని భూతాని సకలాన్యపి।
యేనార్థవంతి తం కిన్ను విజ్ఞాతారం ప్రకాశయేత్॥౫౩౪॥

తే-గీ॥ వేదశాస్త్రపురాణముల్ వివిధభూత।
జాతములు దేనిచే బ్రయోజనము నొందు।
నట్టి సకలంబెఱుంగు పరమాత్ము నెద్ది।
యేని వెల్గొందఁజేయు నే యెంచిచూడ॥౫౩౪॥

శ్లో॥ ఏషహ్యయంజ్యోతి రనంతశక్తి।
రాత్మాప్రమేయ స్సకలానుభూతిః।
యమేవవిజ్ఞాయ విముక్తబంధో।
జయత్యయంబ్రహ్మ విదుత్తమోత్తమః॥౫౩౫॥

తే.గీ॥ ఇతఁడుదనయంత వెలుఁగు నే చేని జేయు।
నిట్టిడనరాదు సకలంబు నీతఁడెఱుఁగు।
నిట్టిబ్రహ్మంబె యెఱిఁగి కళ్లెడలిపోవ।
వెలుఁగుసుమిబ్రహ్మ విద్వరశ్రేష్ఠుఁడనఁగ॥౫౩౬॥

శ్లో॥ నఖిద్యతేనో విషయైః ప్రమోదతే।
నసజ్జతేనాపి విరజ్యతేచ।
స్వస్మిన్సదా క్రీడతినందతిస్వయం।
నిరంతరానంద రసేనతృప్తః॥౫౩౭॥

క॥ కుందఁడు విషయంబులచే। నందఁడు ముదమెదియువలయునసడు విడువఁడా
నందరసంబునతృప్తిం। బొందిసతతమాత్మకేళిబొదలుచు మురియున్॥

శ్లో॥ క్షుధాం దేహవ్యథాంత్యక్త్వా బాలః క్రీడతివస్తుని।
తథైవవిద్వాన్రమతే నిర్మమోనిరహంసుఖీ॥౫౩౮॥

క॥ బాలుండాకలిబడలిక। జోలివదలి యాటలాడు సొబఁగునబ్రహ్మం।
బై లీలక్రీడసేయుచు। హాళిన్నానాదియనక యలరుఘనుండున్॥౫౩౯॥

శ్లో॥ చింతాశూన్య మదైన్యభైక్ష మశనం పానం సరిద్వారిషు।
స్వాతంత్ర్యేణ నిరంకుశాస్థితిరభీర్నిద్రా శ్మశానేవనే।
వస్త్రంత్వక్షాళనశోషణాది రహితం దిగ్వాస్తుశయ్యామహీ।
సంచారో నిగమాంతవీథిషు విదాం క్రీడాపరే బ్రహ్మణి॥౫౪౦॥

సీ॥ బ్రహ్మంబునెఱిఁగితత్పరులైసుఖించెడుపరమమునీంద్రులచరితవినుము।
వగవకదీనభావములేకదొరికిన బిచ్చపుకథతిఁడు రిచ్చమైన।

నేటఁ ద్రావుదురు నీరేయడ్డమును లేకనిచ్చలు నెందేని నిలిచియుండ్రు।
కాఁడడవిన్నోవల్ల కాటిలోనో వెలిపెలుఁగకనిద్రింతురింతతడవు॥

ఆ-వె॥ ఉదుకకారవేయకుండెడిగూడ్డయో।
దెసలొకట్టుకొండ్రు నిగువబందు।
కొండ్రు వేదపఙ్త్రిఁ కౌసలజరిఁద్రుబ్ర।
హ్మంబుగూడి మెపుదునాడుచుండ్రు।౫౪౦॥

శ్లో॥ విమానమాలంబ్య శరీరమేత।
ద్భునక్త్యశేషాన్విషయానుపస్థితాన్।
పరేచ్ఛయాబాలవదాత్మవేత్తా।
యోఽవ్యక్తలింగోఽ ననుషక్తబాహ్యః॥౫౩౯॥

తే-గీ॥ గుఱుతెఱుగగాక వెలివానిగూడకుండ,
నీశరీరంబను విమానమెకిఁయొరుల।
యిచ్చచేవచ్చువిషయంబు లెల్లగుడుచు।
బాలుపోలికబ్రహ్మమై పరగువాడు॥౫౪౧॥

శ్లో॥ దిగంబరో వాపిచసాంబరోవా త్వగంబరో వాపిచిదంబరస్థః।
ఉన్మత్తవద్వాపివ బాలవద్వా పిశాచవద్వాపి చరత్యవన్యాం॥

క॥ దెసలోగుడ్డయొతోలో। పసగలయం తెలివిచదలా బట్టగవెట్టిన్।
బసివానిబిశాచంబును। వెసబోలుచు దిరుగుబ్రహ్మవేత్తయవనిపై॥౫౪

శ్లో॥ కామాన్నికామ రూపీసంశ్చరత్యేక చరోమునిః।
స్వాత్మనైవసదాతుష్టస్స్వయం సర్వాత్మనాస్థితః॥ ౫౪౧॥

తే-గీ॥ తనకుచానెయెప్పుడును తృప్తినివహించి।
తానెసర్వంబునై నిల్చితానొకడయి।
కోరినవిభుజియించుచు కోరినట్టి।
రూపమునసంచరించు నారూఢిమౌని। ౫౪౩॥

శ్లో॥ క్వచిన్మూఢో విద్వాన్క్వచిదపిమహారాజ విభవః।
క్వచిద్భ్రాంత స్సౌమ్యః క్వచిదజగరా చారకలితః।
క్వచి త్పాత్రీభూతః క్వచిదవమతః క్వాప్యవిదిత।
శ్చరత్యేవం ప్రాజ్ఞస్సతత పరమానందసుఖితః॥ ౫౪౨॥

సీ॥ బ్రహ్మంబులెస్సగా బరికించి మెఱిగియా మెకుఁడా సుఖమున జొ
కుఁడ వాడు । భువిజరియించుచో బూడసూవునొకఁచో నేమి
యు నెఱుగనిపామరుక్రియ। నొకచోటవిజ్ఞుపోలిక నొందుచోట
మహారాజు నైశ్వర్య మమరినట్లు। లొక యెడమత్తుడైయున్నట్టులిం
కొక యెడశాంతుడగు వానివడువుదోప॥

ఆ-వె॥ కొండచిలువబోల్కి యుండునింకొకచోట।
పూజలొందువాని బోలునొకట।
మఱియునొకట భంగపఱుపగా బడినట్లు।
నొకట మెఱుక బడకయుండునతడు॥ ౫౪౪॥

శ్లో॥ నిర్ధనోఽపిస దాతుష్టో ప్యసహాయోమహాబలః।
నిత్యతృప్తోఽప్యభుంజానోఽప్యసమస్సమ దర్శనః॥ ౫౪౩॥

తే-గీ॥ ధనములేకయు ముదమునీ ధనరు నెపుడు।
తోడులేకయు గడు బల్లిదుండెయగును।
భోజనముసేయకయుఁ దృప్తిబొదలు నెపుడు।
నీడులేకయు గనునన్నియొడు గాగ॥ ౫౪౫॥

శ్లో॥ అపికుర్వన్నకుర్వాణ శ్చాభోక్తాఫలభోగ్యపి।
శరీర్యప్యశరీర్యేష పరిచ్ఛిన్నోఽపిసర్వగః॥ ౫౪౪॥

తే-గీ॥ చేయుచుండియు జేయక చెలగుచుండు।
ఫలమనుభవించుచుండియు దలగియుండు।

మేనుగల్గియులేకుండ మెలగుచుండు।
వేలువేలయ్యునంతట వెలయుచుండు॥ ౫౪౬ ॥

శ్లో॥ అశరీరంసదాసంత మిమంబ్రహ్మ విదంక్వచిత్।
ప్రియాప్రియే నస్పృశత స్తథైవచ శుభాశుభే॥ ౫౪౫॥

తే-గీ॥ మేనులేకయె యెప్పుడుమిగిలియుండు।
బ్రహ్మవేత్తను దగులవేపాటియైన।
నింపగునవేని నట్టుగానివేని పనులు।
నించుకయుమేలెయేని గీడేని ఫలము ౫౪౭॥

శ్లో॥ స్థూలాది సంబంధవతోఽభిమానిన।
స్సుఖంచ దుఃఖంచ శుభాశుభేచ।
విధ్వస్తబంధస్య సదాత్మనోమునేః।
కుతస్శుభం వాప్యశుభం ఫలంవా॥౫౪౬॥

తే-గీ॥ స్థూలదేహాదులను జికిరలోలుడైన।
యతనికగు సుఖదుఃఖ శుభాశుభములు।
తగులమును ద్రెంచిసన్మాత్రుడగుమునికిని।
ఫలముమేలైన కీడైన గలుగగలదె॥౫౪౭॥

శ్లో॥ తమసాగ్రస్తవద్భానా దగ్రస్తోఽపిరవిర్జనైః।
గ్రస్తఇత్యుచ్యతే భ్రాంత్యా హ్యజ్ఞాత్వావస్తులక్షణం॥ ౫౪౭॥

తే-గీ॥ నీడ సూర్యుని మ్రింగిన జాడదోప।
భ్రమసిలోకులు వాస్తవ క్రమమెఱుగక।
నికరముగమ్రింగబడని యాచాకరమైన।
సూర్యుడదె మ్రింగబడెనని చూచుపగిది॥ ౫౪౮॥

శ్లో॥ తద్వద్దేహాదిబంధేభ్యో విముక్తం బ్రహ్మవిత్తమం।
పశ్యంతి దేహవన్మూఢా శ్శరీరాభాసదర్శనాత్॥ ౫౪౯॥

తే. గీ॥ తనువుమొదలగు బంధములను దొరగిన।
బ్రహ్మవిత్తముగని వానిబట్టుకొన్న।
యట్లుతోచెడు మేనిచాయగనివాని।
మేనుగలవాడె యాందు రజ్ఞానులవని॥ ౫౫౦॥

శ్లో॥ అహిర్నిల్వయనీవాయం ముక్తదేహాస్తుతిష్ఠతి।
ఇతస్తతశ్చాల్యమానో యత్కించిత్ప్రాణవాయునా॥ ౫౪౯॥

తే. గీ॥ తనువుతగులంబువిడచిన ఘనుడు తోలు।
విడచియుండెడి పాముకైవడిని వెలయు।
నటునిటునునించుకించుక ప్రాణవాయు।
వీడ్వ గదలుచునచలమా వృత్తివలరి॥ ౫౫౧॥

శ్లో॥ స్రోతసానీయతేదారు యథానిమ్నోన్నతస్థలం।
దైవేననీయతేదేహో యథాకాలోపభుక్తిషు॥ ౫౫౦॥

తే. గీ॥ దైవవశమున దేహంబు దానివేళ।
కొలదివచ్చెడు ననుభవంబులను బొందు।
కొయ్యనదివేగమున గొట్టుకొనుచుబోయి।
పల్లమునమిట్టునను బెట్టబడెడుమాడ్కి॥ ౫౫౬॥

శ్లో॥ ప్రారబ్ధకర్మపరికల్పితవాసనాభి।
స్సంసారివచ్చరతి భుక్తిషు ముక్తదేహః।
సిద్ధస్స్వయం వసతిసాక్షివదత్రతూష్ణీం।
చక్రస్యమూలమివ కల్పవికల్పశూన్యః॥ ౫౫౧॥

మ॥ వడిప్రారబ్ధముచేతదోచువిషయవ్రాతంబుభోగించున।
య్యెడమైవీడినవాడు పామరునియట్లే తానటించుకగలం।
గడు బ్రహ్మంబయి చూచువాని పగిదింగన్పట్టుని శ్చేష్టుడై।
సుడియుంజక్రము మధ్యమందిటుసు నిల్చుంబోలిక-నిర్వ్యగుడై॥ ౫౫౩॥

శ్లో॥ నైవేంద్రియాణి విషయేషునియుఙ్క్త ఏష।
నైవాపయుఙ్క్త ఉపదర్శనలక్షణస్థః।
నైవక్రియాఫలమపీషదవేక్షతైష।
సానందసాంద్ర రసపానసుమత్త చిత్తః॥ ౫౫౧॥

ఉ॥ ఆరయునట్టులుండు విషయంబులలోనికి నింద్రియంబులన్।
జేరుచునేని వేఱుపడజేయుట యేని నొనర్ప డేపనిన్।
గోరిక యించుకేనియును గోరక చేయునిరంతరంబు చికటనా।
సారసుఖంబు గ్రోలియలసంబగు చిత్తముగల్గియెప్పుడున్॥ ౫౫౨॥

శ్లో॥ లక్ష్యాలక్ష్య గతింత్యక్త్వా యస్తిష్ఠే త్కేవలాత్మనా।
శివఏవస్వయంసాక్షా దయం బ్రహ్మవిదుత్తమః॥ ౫౫౩॥

తే-గీ॥ చూచుటయు జూడకుండుట ద్రోచియవల।
నెందునంటకతానె వెల్గొందునెవ్వ।
డట్టిఘనుడగు నతడె బ్రహ్మంబునిజము।
వాడెయగుజుమ్ము బ్రహ్మవిద్వరుడనంగ॥ ౫౫౪॥

శ్లో॥ జీవన్నేవ సదాముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః।
ఉపాధినాశాద్బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి నిర్ద్వయమ్॥ ౫౫౫॥

తే-గీ॥ బ్రదికియుండియు బ్రహ్మవిద్వరుడు ముక్తు।
డై యలరు నెప్పుడును ధన్యుడతడెసుమ్ము।
పాధినశియింపబ్రహ్మమై పరగనిలిచి।
రెండవదిలేని బ్రహ్మమేనిండికలియు॥ ॥ ౫౫౬॥

శ్లో॥ శైలూషో వేషసద్భావా భావయోశ్చయథాపుమాన్।
తథైవబ్రహ్మవిచ్ఛ్రేష్ఠ స్సదాబ్రహ్మైవనాపరః॥ ౫౫౭॥

తే-గీ॥ వేషమును దాల్చియున్నను విడిచియున్న।
బురుషుడేకద వేషధారియనఁబ్డె।

బ్రహ్మవిచ్ఛ్రేష్ఠు డెప్పుడు బ్రహ్మమెయగు।
గానిమతియొండుగాదు నికరంబుజూడ॥ ౫౫౪॥

శ్లో॥ యత్రక్వాపి విశీర్ణం పర్ణమివతరోర్వపుః పతనాత్।
బ్రహ్మీభూతస్యయతేః ప్రాగేవతచ్చిదగ్నినా దగ్ధమ్॥ ౫౫౬॥

తే-గీ॥ బ్రహ్మమైయుండు యతిశరీరంబు ముసుపె।
తెలివియనునగ్గిఁగాలి బూదివలెనుంట।
నెందునైననుబడి పండి క్రిందపడెడు।
చెట్టునాకుతెఱంగున చివికిపోవు॥ ౫౫౭॥

శ్లో॥ సదాత్మని బ్రహ్మణి తిష్ఠతో మునేః।
పూర్ణాద్వయానంద మయాత్మనాసదా।
నద్దేశకాలాద్యుచిత ప్రతీక్షా।
త్వజ్మాంసవిట్పిండ విసర్జనాయ॥ ౫౫౪॥

తే-గీ॥ ఎపుడుసత్తగు బ్రహ్మమై యొసగినిండి।
రెండవదిలేనిసుఖమయి యుండుమునికి।
మంచిచోటును వేళయు నెంచవలెనె।
మలమునంజుడు తోల్నుద్ద మైనివిడువ॥ ౫౫౯॥

శ్లో॥ దేహస్యమోక్షోనో మోక్షో నదండస్య కమండులోః।
అవిద్యాహృదయ గ్రంథి మోక్షో మోక్షో యతస్తతః॥ ౫౫౮॥

తే-గీ॥ తనువువిడుచుట మోక్షంబుగనుటకాదు।
కట్టెయనుచెంబు విడువ మోక్షంబుగాదు।
మదినెఱుంగమియను ముడి వదలిపోవు।
టదియెమోక్షంబు దానిచే నగు సుఖంబు॥ ౫౬౦॥

శ్లో॥ కుల్యాయామథనద్యాంవా శివక్షేత్రేపిచత్వరే।
పర్ణంపతతిచేత్తేన తరోః కింనుశుభాశుభం॥ ౫౫౯॥

తే.గీ॥ కాల్వలోనైన నదినైన కాటనైన।
నగ్నులను వేల్పుపట్టున నైనదనదు।
నాకు రాలినమాత్రాన మ్రాకునకును।
నగునె మేలైన గీడైన నవనియందు॥౫౮౧॥

శ్లో॥ పత్రస్య పుష్పస్య ఫలస్య నాశవ।
ద్దేహేంద్రియప్రాణధియాంవినాశః।
నైవాత్మనస్స్వస్య సదాత్మకస్యా।
నందాకృతేర్వృక్ష వదాస్తఏషః॥౫౮౨॥

తే.గీ॥ ఆకుపూవును పండు రూపఱినయట్లె।
పొలియుదేహేంద్రియప్రాణ బుద్ధులెల్ల।
బొలియఁడాత్మసదానంద మూర్తి తాను।
మ్రానుపోలికతనయంత మలయుచుండు॥౫౮౨॥

శ్లో॥ ప్రజ్ఞానఘనఇత్యాత్మ లక్షణంసత్యసూచకం।
అనూద్యోపాధికస్యైవ కథయంతివినాశనం॥౫౮౩॥

తే.గీ॥ ఆత్మ ప్రజ్ఞానఘనుఁడను టాతఁడెపుడు।
నుండునని తెల్పుటకె మఱియొండుగాదు।
చెడుననుటయాశ్రయంబుచే జేయబడిన।
దానికేగాని స్థిరమైనదానిగాదు॥ ౫౮౩॥

శ్లో॥ అవినాశీవా అరేఽయ మాత్మేతిశ్రుతిరాత్మనః।
ప్రబ్రవీత్యవినాశిత్వం వినశ్యత్సువికారిషు॥౫౮౪॥

క॥ ఓరీయీయాత్మ చెడదని దా౯ బ్రాయనిచాటినిగమమనుటవికారా।
కారములెల్లను జెడుననియారసియాత్మ చెడకుండునని తెల్పుటకే॥

శ్లో॥ పాషాణవృక్షతృణధాన్యకటాంబరాద్యా।
దగ్ధాభవంతిహిమృదేవయథాతథైవ।

దేహేంద్రియాసుమన ఆదిసమస్తదృశ్యం।
జ్ఞానాగ్నిదగ్ధముపయాతి పరాత్మభావం॥౫౬౩॥

తే-గీ॥ శిలలు చెట్లును గడ్డి గింజలునుచాప।
లంబరాదులు కాలిమన్నైనయట్లు।
తనువునింద్రియమాన సాద్యములుజ్ఞాన।
వహ్నిలోగాలి బ్రహ్మభావంబునొందు॥౫౬౫॥

శ్లో॥ విలక్షణం యథాధ్వాంతం లీయతేభాను తేజసి।
తథైవసకలందృశ్యం బ్రహ్మణిప్రవిలీయతే॥౫౬౪॥

తే-గీ॥ ఎట్లువేలుగుచీకటి యెండయందు।
నణగియెండయె యైపోవు నట్లెకాన।
నగుసమస్తంబు బ్రహ్మంబునందుగలిసి।
బ్రహ్మమైపోవు పొడగాన బడదుమఱల॥౫౬౬॥

శ్లో॥ ఘటేనష్టేయథావ్యోమ వ్యోమైవభవతిస్ఫుటం।
తథైవోపాధివిలయే బ్రహ్మైవబ్రహ్మవిత్స్వయమ్॥౫౬౫॥

ఆ-వె॥ కుండచెడిననందు నిండియుండినచెదల్।
చదలెయగునుగాదె స్పష్టముగను।
నట్లెతనయుపాధి యణగిపోయినబ్రహ్మ।
వేత్తబ్రహ్మమెయగు వేయునేల॥౫౬౭॥

శ్లో॥ క్షీరంక్షీరేయథాక్షిప్తం తైలంతైలేజలంజలే।
సంయుక్తమేకతాంయాతి తథాత్మన్యాత్మవిత్॥

తే-గీ॥ పాలుపాలను తైలంబు తైలమునను।
నీరునీటనుగలిసిన తీరుగాను।
బ్రహ్మమెఱిగినవాడు తాబ్రహ్మమందు।
గలిసియొకటైయెపోవు క్షణములోన॥౫౬౮॥

శ్లో॥ ఏవంవిదేహకైవల్యం సన్మాత్రత్వమఖండితం।
బ్రహ్మభావంప్రపద్యైష యతిర్నావర్తతేపునః॥౫౬౭॥
తే-గీ॥ ఇదివిదేహకైవల్య మన్పదవిసుమ్ము।
వేఱుగానిసన్మాత్రమై వెలయుబ్రహ్మ।
భావమిదిపొందిన సహానుభావుడైన।
యతివరేణ్యుడు తిరిగి రాడందునుండి॥౫౬౮॥
శ్లో॥ సదాత్మైకత్వవిజ్ఞాన దగ్ధావిద్యాదివర్ష్మణః।
అముష్యబ్రహ్మభూతత్వా ద్బ్రహ్మణఃకుతఉద్భవః॥౫౬౯॥
క॥ సత్తైనదియొకటేయని హత్తిమెఱుగుట నెడినిప్పునంటిమెఱుగమిం।
బొత్తైనవిగాల్చినతడుసత్తాబ్రహ్మమగునదియుజన్మము గను నే॥౫౭౦॥
శ్లో॥ మాయాక్లుప్తౌబంధమోక్షౌ నస్తస్స్వాత్మనివస్తుతః।
యథారజ్జౌనిష్క్రియాయాం సర్పభావవినిర్గమౌ॥౫౭౧॥
తే-గీ॥ కట్టువిడుపును మాయచేబుట్టినట్టి।
భావములెకానియాత్మకు లేవుచూడ।
కార్యమేమియులేని పగ్గంబునకును।
పాముతోచుటతోపమి పరగునొక్కొ॥౫౭౧॥
శ్లో॥ ఆవృతేస్సదసత్వాభ్యాం వక్తవ్యేబంధమోక్షణే।
నావృతిర్బ్రహ్మణఃకాచి దన్యాభావాదనావృతం।
యద్యస్త్యద్వైతహానిస్స్యాత్ ద్వైతంనోసహతేశ్రుతిః॥౫౭౨॥
తే-గీ॥ ఆవరణముండు లేములనలరవచ్చు।
బంధమోక్షములావృతి బ్రహ్మమునకు।
లేదొకింతయు నన్యంబులేకయుంట।
బ్రహ్మమావృతమగుటకు వలనుపడదు॥౫౭౨॥

తే-గీ॥ రెండవదియుండిన ట్టైనవండవచ్చు।
నయ్యయద్వైతసిద్ధికి నాగమములు।
ద్వైతమంగీకరించవు తత్త్వవిదుల।
స్వానుభవమునుకాదన బూనవలయు॥౫౩॥

శ్లో॥ బంధంచ మోక్షంచ మృషైవమూఢా।
బుద్ధేర్గుణంవస్తు నికల్పయంతి।
దృగావృతిం మేఘకృతాంయథారవౌ।
యతోద్వయాసంగ చిదేతదక్షరం॥౫౩॥

తే గీ॥ బంధమును మోక్షమనుటిది వట్టిదియది।
బుద్ధిగుణమాత్మ గూర్తురంబుదముకంటి।
గప్పరవిగప్పెనన్నట్లు కలుషమతులు।
కానస్థిరమద్వయాసంగమైన తెలివి॥౫౪॥

శ్లో॥ అస్తీతిప్రత్యయోయశ్చ యశ్చనాస్తీతివస్తుని।
బుద్ధేరేవగుణావేతౌ నతునిత్యస్యవస్తునః॥౫౪॥

తే గీ॥ బ్రహ్మమున్నది లేదను పలుకులవియు।
బుద్ధిగుణములె రెండును పిద్ధమగుచు।
నిత్యమగువస్తువున కల్గనేర వెపుడు।
నేమియును జేయనిదియది యెంచిచూడ॥౫౫॥

శ్లో॥ అతస్తౌమాయయాక్లృప్తౌ బంధమోక్షౌనచాత్మని।
నిష్కలేనిష్క్రియేశాంతే నిరవద్యేనిరంజనే।
అద్వితీయేపరేతత్త్వే వ్యోమవత్కల్పనాకుతః॥౫౫॥

తే-గీ॥ కానమాయనుదోచెడు కల్లమితులు।
బంధమోక్షములాత్మకెప్పటికిలేవు।

గుణముక్రి యలేక శాంతమైగణనకంద।
కెదియనంటకయుండెడు నదియెయాత్మ॥ ౫౧౬॥

తే-గీ॥ రెండవదిలేక చివరమైయుండునట్టి।
యాత్మతత్త్వముననుబంధమనియు మోక్ష।
మనియు గల్పించుటాకాశమున నువట్టి।
వున్నవనుకొన్న తీరెయాసిన్నియేల॥ ౫౭౭॥

శ్లో॥ ననిరోధోన చోత్పత్తి ర్నబంధోనచసాధకః।
నముముక్షుర్నవైముక్త ఇత్యేషా పరమార్థతా॥ ౫౭౬॥

తే.గీ॥ అడ్డగిరిచుట పొడముటయును బెలేదు।
బంధమునుసాధకుండను పలుకెలేదు।
ముక్తికోరెడువాడని ముక్తుడనియు।
మొదలెలేదిదె పరమార్థమిదె నిజంబు॥ ౫౭౮॥

శ్లో॥ సకలనిగమచూడా స్వాంతసిద్ధాంతరూపం।
పరమమిదమతి గుహ్యందర్శితం తేమయాద్య-
అపగతకలిదోషంకామ నిర్ముక్తబుద్ధిం।
స్వసుతవదసకృత్త్వాం (త్వమనుపదసకృత్త్వం)
భావయిత్వాముముక్షుం॥ ౫౭౭॥

తే-గీ॥ ఉపనిషత్తులలోడాగి యుండునికర।
మిదియతిరహస్యమిదె నీకునే దెలిపితి।
విమలుడవుకోరి కలులేని సుమతివనియు।
ముక్తిగోరితివని యెంచిపుత్రునట్లు॥ ౫౭౯॥

(పాఠాంతరము.)

తే-గీ॥ ఉపనిషత్తులలో డాగియుండునికర।
మిదియతిరహస్య మిదెనీకునె దెలిపితి।

విమలుఁడునుకోరకలు లేని సుమతి మోక్ష।
కామియుండైనను న్నను నికర-మిది దెల్పు॥౫౮౦॥

శ్లో॥ ఇతి శ్రుత్వా గురోర్వాక్యం ప్రశ్రయేణ కృతాసతిః।
స తేన సమనుజ్ఞాతో యయౌ నిర్ముక్త బంధనః॥౫౭౫॥

క॥ అనియిట్లు గురువు వలికిన। విని శిష్యుఁడు విస్మయమలర వినతుండై యా।
యనయాసీతి గోసి బంధను। లనువిడుపించుకొని నిశ్చలత దానరిగెన్॥

శ్లో॥ గురు శేష సదానంద సింధౌ నిర్మగ్న మానసః।
పావయన్వసుధాం సర్వాం విచచార నిరంతరః(నిరుత్తరః)॥౫౭౬॥

తే.గీ॥ ఆగురువరుండు నిత్యసుఖాబ్ధియందు।
నోలలాడెడు మనముతో నుర్వియెల్ల।
బావనము జేయుచును మాఱుపలుకకుండ (పూర్ణభావమునసె)
సంచరించుచునుండె నాశ్చర్యముగను॥౫౮౦॥

శ్లో॥ ఇత్యాచార్యస్య శిష్యస్య సంవాదేనాత్మలక్షణం।
నిరూపితం ముముక్షూణాం సుఖబోధోప పత్తయే॥౫౭౭॥

క॥ అనియిట్లు గురువు శిష్యుడు। ననుకొన్న తెలుంగుగాగ నాత్మవిధంబిం।
పొనరం దెల్లంబడె ముక్తిని గోరెడువారు తెలియదేలిక గాగన్॥

శ్లో॥ హితమిదముపదేశ మాద్రియంతాం।
విహితనిరస్తసమస్త చిత్తదోషాః।
భవసుఖవిరతాః ప్రశాంత చిత్తాః।
శ్రుతిరసికా యత యో ముముక్షవో యే॥౫౭౮॥

చ॥ వినుఁడిదిమంచిమాట సువివేకమునం గడు నాదరంబుతో।
ఘనతరసత్క్రియల్సలిపి కల్మషమేమియు జిత్తమందుగ।
గ్గనిఘనులున్ భవంబునను గల్గెడు సౌఖ్యము లోయుపుణ్యులు।
స్వనియుతచిత్తులున్ని గమవేత్తలు యోగులు మోక్షకాములున్॥౫౮౧॥

శ్లో॥ సంసారాధ్వని తాపభానుకిరణప్రోద్భూతదాహవ్యథా।
ఖిన్నానాంజల కాంక్షయామరుభువి భ్రాంత్యా పరిభ్రామ్యతాం
అత్యాసన్న సుధాంబుధింసుఖకరం బ్రహ్మాద్వయం దర్శయ।
త్వేషాశంకర భారతీవిజయతే నిర్వాణసంధాయినీ॥౫౮౦॥

మ॥ నరులై సంసృతిబాటఁ దాపమను నెండంబుట్టు పెం దప్పిచే।
గరముందీనత నొంది దప్పిజలముం గాంక్షించు చున్నిర్జలో।
ర్వర పైఁగ్రుమ్మరువారి కందుబడిగా బ్రహ్మాఖ్యశాంతో మోక్షసౌ।
ఖ్యరమావాస సుధాబ్ధి శంకరుని వాక్సారంబిదో చూపెడిన్॥౫౮౦॥

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీగోవింద
భగవత్పూజ్య పాదశిష్య శ్రీమచ్ఛంకరభగ
వత్కృతః వివేకచూడామణిః
సమాప్తః

ఇది శ్రీమత్పరమహంస పరివ్రాజికాచార్య వర్యులును శ్రీగోవింద భగవత్పూజ్యపాదాచార్య శిష్యులునగు శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్య స్వామివారిచే రచియింపంబడిన వివేకచూడామణి ముగిసెను.

ఇష్టవాక్యగర్భ శార్దూలవిక్రీడితము.

ఓంకారప్రతిపాదితా, తతమహావ్యాహార్థ, సత్పతకృతా।
పంకధ్వంసక బ్రహ్మపూజితపదా బ్రహ్మాద్వయామర్భ్రమా।
హంకారార్ణ్య విమోచనప్రవణ నిత్యశ్రీపదా తత్త్వమ।
స్యంకైకాకృతినీవెస్తుత్యుడవు నీకొమ్రొక్కు శ్రీశంకరా॥

(ఇందు మొదటినుండే ప్రతిపాదమునందింట మొదటియక్షరముం గొన్న నిష్టవాక్యమేర్పడు)

సీ॥ బడగణనాటి కన్నడబ్రాహ్మణుండు ఋగ్వేది వైశ్వామిత్రవి తతగోత్రు। డాశ్వలాయనసూత్రు డగుచుఁ గోవూరి వేంకటరమణార్యు

సతరంగ్నవశత్త। నాయనపత్ని నారాయణమ్మకుబుట్టి హరిమె పట్టాభిరా
మాఖ్యనొందు। పెద్దలసేవించి నిష్ఠురసాలించి గురుకృపచే నెలుంగుటను
మాని॥

తే గీ॥ శంకరుండుసెప్ప నీసర్వశాస్త్రిసార।
మైన గ్రంథంబును తెనుంగునందువ్రాసి।
దీనిగనితప్పులొప్పులు గా నొనర్చి।
ధన్యులగుడు వివేకిమూర్ధన్యులెల్ల॥

విభూతివృత్తము.

బాణభూజచంద్రులక్ హ్యాణమామవర్షమం।
దేనొనర్చికూర్చితిక్ దీననాంధ్రిపద్యముల్॥

సీ॥ శ్రీమత్తులైమహా ధీమంతులై గురుసింహాసస్థరుని సచ్ఛిష్యులగుచు।
కడపపురంబున గాపురింబుండుపెండాలసుబ్బయ్యయనై వైశ్యకులజయు
నాశివవర్ణంబునను ధన్యుడైన తంజావూరు గంగయ్య సాధుహితుడు।
వీరిరువురు భక్తివిశ్వాసములతోడ నీగ్రంధరత్నంబు నెల్లను వి...

తే-గీ॥ యచ్చువేయించి ప్రచురింప నిచ్చగించి।
సాహ్యమొనరింప నీపనిసాగగాన।
వీరికోరికలెల్లనవారితముగ।
నిచ్చిరక్షించుగాక సర్వేశ్వరుండు॥



సవరణలు.

| పుట | శ్లోక సంఖ్య | పద్య సంఖ్య | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| ౨ | ,, | ౧ | ౨ | గో్చరు | గో్చరుని |
| ౮ | ౨౫ | , | ౪ | తితిత్షా | తితిక్షా |
| ౯ | ,, | ౨౭ | ౨ | తీ\|వముతె | తీ్రవముతై |
| ౧౦ | ౨౭ | , | ౩ | తీర్గాస్వ | తీర్థాస్స్వ |
| ౧౨ | , | ౪౨ | ౨ | లేపు | లేప్తు |
| ౧౪ | ౫౨ | , | ౧ | శ్రీగురు ఉవాచ | శ్రీగురురువాచ |
| ,, | ,, | , | ౩ | గదా | గద |
| ౧౫ | ౫౬ | , | ౪ | అవగణ్య | అవగమ్య |
| ౧౭ | , | ౬౯ | ౧ | లేస్నే | లైస్నై |
| ౨౧ | ౮౯ | , | ౨ | బదాః | బద్ధాః |
| ౨౩ | ౯౫ | , | ౪ | సస్స్వ | సస్వ |
| ౨౫ | ,, | ౭౩ | ౨ | స్నేపిం | స్నేపా |
| ౨౬ | ౭౬ | , | ౩ | స్వాగమే | స్వాగమేవ |
| ౨౮ | ౭౮ | , | ౩ | బుధ్ధా | బుద్ధ్యా |

| పుట | శ్లోక సంఖ్య | పద్య సంఖ్య | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| ౭౨ | ౨౪౯ | , | ౩ | తథాతథాతత్త్వ | యథాతథాతత్త్వ |
| ౭౭ | , | ౨౬౧ | ౪ | నడస | నడప |
| ౮౨ | , | ౨౮౫ | ౩ | విదువక | విడువక |
| ౮౫ | ౨౯౫ | , | ౨ | మర్త్వాతి | మర్త్వాసి |
| ౮౬ | ౩౦౧ | , | ౪ | సూన్యాః | శూన్యాః |
| ౮౭ | ౩౦౪ | , | ౨ | దిమహా | ఙదమహా |
| ౯౩ | ౩౨౩ | , | ౪ | జాం | జార |
| , | ౩౨౬ | , | ౪ | త్రా | త్రా |
| ౯౪ | ౩౨౭ | , | ౧ | ష్వాతిశ | ష్వావిశ |
| , | , | , | ౩ | నాత్మా మ | నాత్మా మః |
| , | , | ౩౨౯ | ౪ | , | దేహముడిగిన బ్రహ్మమై తేజరిల్లు ౹ ౩౨౯ |
| ౯౯ | ౩౪౫ | , | ౨ | మృషాంపాత్రే | మృషాత్రే |
| ౧౦౦ | ౩౪౭ | , | ౨ | సందర్శనతః | దర్శనతః |

